# చంద్రగుప్త విజయము

[చరిత్రాత్మకమైన నవల]



"సుధాంశు"

జంధ్యాల లక్ష్మీనారాయణశాస్త్రి, ఎం. ఏ.,

ప్రమాదీచ - శ్రావణము

ద్వితీయ ముద్రణము.
వెల : రు. 3-75 పై.

ప్రతులకు :
యూనివర్శిటీ బుక్ సెంటర్
264, ప్రకాశం రోడ్ - తిరుపతి

ముద్రణ : సాయిబాబా ప్రెస్ — విజయవాడ-1

# సమర్పణము

నిజ జీవితమునందును కవితా జీవితమునందును నాకు తోడునీడై
సహాయ సహకారములను అందించి నిరంతరము నా
ఆయురారోగ్యాభివృద్ధిని ఆకాంక్షించు
సుధా మధుర హృదయులు కందుకూరు
ప్రభుత్వ కళాశాలాధ్యక్షులు
శ్రీ ఆర్. కృష్ణమూర్తి బి. కామ్., (ఆనర్సు)
మహోదయులకు-విజ్ఞానమహితులు,
సౌజన్య సంపన్నులైన కళాశాల అధ్యాపక
సోదరులకును కృతజ్ఞతా పూర్వకముగా ఈ కృతిని
సమర్పించుచున్నాను.

10-7-72 నారాయణశాస్త్రి

# జయరేఖలు





# చంద్రగుప్త విజయము

## ప్రభునిర్ణయము

"కుమార చంద్రగుప్తుఁడు మన మగధరాజ్యమునకే కాదు. సమస్తభారత సామ్రాజ్యమునకు చక్రవర్తికాఁదగిన వాఁడు. ప్రజ్ఞాప్రాభవములో, బలపరాక్రమములలో, సర్వ సద్గుణ సంపదలో మన చంద్రగుప్తుఁడు సాటిలేని మేటి అని మే మెఱుఁగుదుము." మహారాజు ప్రశాంత స్వరముతో పట్టపురాణికి బదులు చెప్పెను.

"మరి సర్వవిధముల రాజ్యార్హుఁడైన నా కుమారుని వంచించి, సింహాసనమును నా సవతి బిడ్డలకేల కట్టబెట్ట దలచితిరి" మహారాణి మురాదేవి ప్రభువును దీవ్రముగా ప్రశ్నించెను.

మహారాజు గంభీర కంఠముతో "దేవీ! అది నీ కర్థము గాని రాజకీయ రహస్యము! కుమార చంద్ర గుప్తునకు రాజ్యార్హత లేకుండ పోవుటకు నీవే కారణము!" అని క్లుప్తముగాఁ బలికెను. మహారాజు మాటలకు మురా దేవి దిగ్భ్రాంతి చెందెను: "ఏమంటిరి ప్రభూ! చంద్ర గుప్తునకు రాజ్యార్హత లేకుండ పోవుటకు నేనా కారణము!

అదేమో కాని మీ అభిప్రాయము నా కవగతము కాలేదు ప్రభూ” అని యామె పలికెను.

“కాదని చెప్పితిని గదా! నా యభిప్రాయమేమో చెప్పెదను. వినుము. నీ తండ్రి మతము మార్చి వర్ణ చ్యుతుఁడైనాడు. అతని బిడ్డవగు నీకు గల్గిన కుమారుడు మగధ సింహాసనము నధిష్ఠించుటకు మంత్రు లంగీకరింపరు. ప్రజలామోదింపరు.” మహారాజు దృఢ స్వరముతో ననెను.

“మరి వర్ణ చ్యుతుని బిడ్డనైన నన్ను మహారాణిగా స్వీకరించినప్పుడు మీ మంత్రు లేమైనారు? మీ ప్రజలెచ్చటకు బోయినారు!”

“అది వేఱు విషయము. మా యభీష్టసిద్ధికై యానాఁడు ప్రజలు, మంత్రులు నిన్ను మేము స్వీకరించుట కంగీకరించినారు.”

“అట్లే నేఁడును వారు నా కుమారునకు పట్టము గట్టుట కేల యంగీకరింపరు?”

రాజదంపతుల వాగ్వివాదము తీవ్రతరమయ్యెను.

“నీ కుమారునకు పట్టము గట్టుదుమని మేము నిన్ను స్వీకరించునప్పుడు వాగ్దానము చేయలేదు. అట్టి గొంతెమ్మ కోరికలు పెంచుకొనుట నీ దోషము!“

“అవు నవును. నేనే దోషిని! నాకు రాజమాతయగు నర్హత లేదు! ఆ సునంద మీకన్నులకప్సరఃకాంత! ఆమెయే

రాజమాత కావలెననియు నే నామె దాసినై పడియుండవలె నవియు మీ యభీష్టము. అంతియే కదా.'' మురాదేవి గద్గద కంఠముతో బలికెను.

మహారాజు మురాదేవి నూరడింపసాగెను.

"దేవీ! నీవు చింతపడకుము. రాజ్యక్షేమమునుకాంక్షించియే మేమీ నిర్ణయము చేసితిమి. సునంద పుత్రులు ప్రభువులైనంత మాత్రమున నీ కుమారుఁడు సేవకుఁడైనట్లు కాదు! మేము శౌర్యసాహస సంపన్నుఁడైన కుమార చంద్రగుప్తుని సర్వసైన్యాధిపతిగా నియమింపదలచితిమి.''

"అది గొప్ప ఔదార్యము కాదు. ప్రభువు కావలసిన వానిని సర్వసైన్యాధిపతిని జేయుట మహోపకారమగునా?''

"ప్రభువు దేమున్నది దేవీ! ప్రభువు సేనాపతి చేతిలోని వాడు గదా! సేనాపతి తలుచుకొనినచో ప్రభుపీఠము క్షణములో తల్లక్రిందులవును. ఆ పదవి కున్న ప్రాధాన్యమట్టిది!''

మహాపద్మనందుడు మురాదేవిని మంచి మాటలతో ననునయింపసాగెను. కాని మురాదేవి కా మాటలు సంతుష్టి కలిగించలేదు.

"ప్రభువులు, వాక్చమత్కారముతో చేసిన యన్యాయమును సరిదిద్దలేరు. ప్రభువు సేనాపతి చేతిలోని వాఁడని మీరందురు. ఎంత గొప్ప సేనాపతియైనను ప్రభు సేవకుఁడే గదాయని నే నందును. ఈ మాటలతో ప్రయోజనమేమి?''

"రాజ్యక్షేమము, ప్రజాహృదయము, మంత్రుల భావము సమస్తమును బరీక్షించియే మేమీ నిర్ణయము చేసితిమి. దీని కిక తిరుగులేదు."

మహారాజు తన నిశ్చయమును ప్రకటించెను.

మురాదేవి క్రుద్ధనాగిని వలె మండిపడెను.

"అవునవును. మీ నిర్ణయమునకు తిరుగులేదు. మీరు మహాప్రభువులు కనుక మీ నిర్ణయమున కిప్పుడు తిరుగులేదు. కాని జగత్ప్రభుఁడైన భగవంతుఁడు కరుణించినచో నిట్టి నిర్ణయములు తమంత తామే మారిపోగలవు. ఎప్పటికేని ధర్మము జయింపక పోదు. న్యాయము ప్రతిష్ఠితము కాక తప్పదు." మురాదేవి చివాలున లేచి యభ్యంతర మందిరములోని కేగెను. మహారాజు నిరుత్తరుఁడై, నిట్టూర్చుచు మెల్లగాలేచి సునందాదేవి భవనమువైపు సాగెను.

మురాదేవి విఫలమనోరథయై, క్షుభిత హృదయముతో తనకుమారుని జేరి మహారాజు హృదయము వివరించి చెప్పినది. విధివైపరీత్యమున జ్యేష్ఠుడును, రాజ్యార్హుఁడును నయిన కుమార చంద్రగుప్తుడు మహారాజుచే వంచితుఁడైనందులకు ఆమెకు పట్టరాని దుఃఖము కలిగినది. ఆమె తమ దురదృష్టమును నిందించుకొన్నది. ఈ జన్మమున తన కిఁక రాజమాత గౌరవము ప్రాపించు భాగ్యము

లేదేమో యని పరితపించినది. తల్లి తెచ్చిన వార్త విని చంద్రగుప్తుడు సాలోచనముగా తల పంకించినాడు.

"అవునమ్మా! ఇది యిట్లగునని నాకు సందేహముగనే యున్నది. అయినను నీవు చింతపడకమ్మా! నీ బిడ్డడు నీకు రాజమాత గౌరవము సాధించిపెట్టగలడు తల్లీ! వీరభోజ్యమైన ఈ రాజ్యమును ప్రభుప్రసాదమున సంపాదించుటకంటె స్వసామర్థ్యమున సమార్జించుకొనుటే సంతోషకరము దైవసాక్షిగా నీ పాదములంటి ప్రమాణము చేయుచున్నాను. నీ కుమారుఁడు మగధరాజ్యాధినేత కాకతప్పదు. ఈ మౌర్య చంద్రగుప్తుఁడు మహాసార్వభౌముఁడై మాతృశ్రీ యభీష్టమును సఫలము జేసితీరునని ప్రతిజ్ఞ చేయుచున్నాఁడు." అని చంద్రగుప్తుఁడు తల్లి పాదములంటి ప్రమాణము చేసెను. శోకసంతప్తమైన ఆమె మాతృహృదయము కొంత యూరట చెందెను.

ఆమె కుమారుని చేరదీసి మేను నిమిరి సానురాగముగ నిట్లు పలికెను. "చంద్రా! నీవు నా ఆశాజ్యోతివి నాయనా! నీపై నాకా నమ్మకమున్నది! నీ భుజబలముపై నాకా విశ్వాసమున్నది! నీ బుద్ధిబలముపై నాకాయాశ యున్నది! నీవు మగధాధిపతివై రత్నసింహాసనము నధిష్ఠించి జరిగిన యన్యాయమును సరిదిద్దవలెను. నీవు ప్రభువువై నామనోభీష్టమును సఫలము చేయవలెను. నాకు కావలసినదదే! నా

జీవితాశ యదే తండ్రీ!" మురాదేవి ఆనందాశ్రువులతో కుమారుని శిరస్సు నభిషేకించెను.

"నీవు నిశ్చింతగా నుండు తల్లీ! ధర్మరక్షకమైన దైవము మనకు తోడ్పడకపోదు" చంద్రగుప్తుడు తల్లికి ధైర్యము చెప్పెను.

# సైన్యాధిపత్యము

మగధాధిపతియగు మహాపద్మనందునకు ఇద్దఱు భార్యలు. పెద్దభార్య మురాదేవి. రెండవ భార్య సునందాదేవి. మురాదేవి సుక్షత్రియ వంశోద్భూతుఁడైన పిప్పలవన ప్రభువుకుమార్తె. సునందాదేవియు రాజపుత్రికయే. కాని పిప్పలవనప్రభువు కొంతకాలము హైందవమతమును బరిత్యజించి బౌద్ధమతమును స్వీకరించినవాఁడగుటచే నాతనిని బ్రాహ్మణులు వర్ణచ్యుతుడనియు, నక్షత్రియుడనియు దుష్ప్రచారము చేసిరి. కాని మహాపద్మనందుఁడా నిందలు లెక్కచేయక మురాదేవిని పట్టపురాణిగా స్వీకరించెను. మహారాజు దక్షిణనాయకుఁడయ్యును, సునందాదేవి సౌందర్యవిలాసములకు వశుఁడై యామెపై నధికానురాగము కల్గియుండెను. ఆ విధముగా మురాదేవికి రాజగౌరవమును, సునందాదేవికి రాజాదరమును సంప్రాప్తించెను.

మహాపద్మనందునకు సువిశాలమును సుప్రతిష్ఠితమును నైన మహారాజ్యమున్నది. అపారములైన భోగభాగ్యములున్నవి అసంఖ్యాకమైన పరిచారికాగణమున్నది. అఖండ ప్రజ్ఞాధురీణులైన యమాత్యులున్నారు. బలసంపన్నమైన మహాసైన్యమున్నది. అంతటి శాంత సౌఖ్యములున్నను నా మహీకాంతునకు సంతానభాగ్యము లేదు. అందువలన నా వృద్ధరాజు నిరంతరము చింతాక్రాంతుఁడై యుండెను. తన

యనంతరము మగధమహా రాజ్యభారము సమర్థముగా నిర్వహించు సంతానాంకురము లేనందుల కాతఁడు దురంత సంతాపమున క్రుంగిపోవుచుండెను. తానెంత కష్టపడి శత్రు దుర్నిరీక్ష్యముగా నిర్మించియున్న మగధమహారాజ్యము నేలుటకు తనకు వారసుఁడు లేనందుల కాయన పరితపించు చుండెను. "సమర్థుఁడగు ప్రభువులేక మగధరాజ్యము ఛిన్నాభిన్నమై పోవలసినదేనా" అని ఆయన ఆందోళన పడు చుండెను. రాజపత్నులు సంతానార్థమై యెన్నియో నోములు నోచిరి. వ్రతములు చేసిరి. దైవములను సేవించిరి. తీర్థములలో గ్రుంకులిడిరి. అసంఖ్యాకమైన దానధర్మములు కావించిరి. కాని వారి యభీష్టము సిద్ధింపలేదు. మహాపద్మ నందునకు సంతానము కలుగలేదు.

మహారాజు తన యభీష్టసిద్ధి కలుగు మార్గమునుగూర్చి మంత్రులతో నాలోచించెను. తనకు పరమాప్తుఁడును, ప్రజ్ఞాశౌచ సామర్థ్యయుక్తుఁడును, మంత్రోత్సాహ ప్రభావ మహితుఁడును, శీల సత్వ సమంచితుఁడును, సర్వకార్య కుశలుఁడును, నిరంతర ప్రభుసేవా పరాయణుఁడును నైన రాక్షసమహామాత్యునితో సమాలోచనము చేసెను.

శోకాకులుఁడైన మహాపద్మనందునకు మహామాత్యుఁడొక యుపాయము చెప్పెను. లోకములో దుర్లభములు, దుస్సాధములునైన మహాఫలములను ప్రసాదింపగలవారు తపోధను లొక్కరే!

అందును జగద్ధితార్థులైన తమవంటి ప్రభువుల యభీష్టము దీర్చుట లోకశ్రేయస్కర మగుటచే మహానుభావులగు మహర్షులు తప్పక అనుగ్రహింతురు.

అందువలన మహారాజు పత్నీసమేతముగా పాటలీపుత్ర ప్రాంతారణ్యమునందలి కైలాసేశ్వరాలయ సమీపమునగల మునివాటికకేగి పరమమాహేశ్వరుఁడును దివ్యప్రభావసంపన్నుఁడును, అఘటన ఘటనాసమర్థుడును నైన అచ్చటి మహర్షివర్యు నాశ్రయింపవలెనని మహామాత్యుఁడు మహారాజునకు బోధించెను. మహారాజు సపరివారముగా మహర్షి సన్నిధికి బయలుదేరెను.

మహర్షి ఆశ్రమ ప్రాంతము పరమ ప్రశాంతమై, వివిధ మధురఫల భారావనత నానాతరు సందోహసందీపితమై, వృక్షశాఖాలంబిత లతా నికుంజ పుంజసంశోభితమై, మందమారుత సంస్పందిత సుందర సుమసౌరభోల్లాస భాసురమై, హృదయరంజక మంజుల పుష్ప మకరందపాన పరవశేందిందిరమై, నవచూత పల్లవాస్వాదన కషాయకంఠ కలకంఠ గాన కమనీయమై శోభిల్లుచుండెను. మహారాజు ప్రసన్న హృదయుఁడై సతీసమేతముగా మున్యాశ్రమమున ప్రవేశించెను. శుక శారికారబ్ధ శ్రుతిసుభగ వేదనాద సమంచితమై సముపలాలిత కిశోరసంతాన సమీక్షణోల్లసిత మృగశకుంత సంచార విలసితమై యున్న మున్యాశ్రమములో ఆయన ముందునకు సాగెను.

వచ్చిన మహారాజును మహర్షి ఆదరముగా సంభావించెను. ఆదరించిన ఆ మహర్షిని అభీష్టప్రాప్తికై సముదాచార పురస్సరముగా మహారాజు సేవించెను ప్రభుని వినయ విధేయతలకు మహర్షి కరుణించి ఇష్టవరదానము సనుగ్రహించెను మహారాజున కొక్క-పుత్రుఁడుగాదు - తొమ్మిది మంది పుత్రులు కల్గుదురనియు, వారిలో నొకఁడు మహాబలశాలియై యఖండ తేజశ్శాలియై భారత సామ్రాజ్యాధిపతియై జగద్విఖ్యాతి నార్జించుననియు, త్రికాలజ్ఞుఁడైన మహర్షి యాశీర్వదించెను. మంత్రప్రభావ మహితమైన తన కమండలూదకమును రాజపత్నుల మూర్ధములపై జల్లెను. ఆ పవిత్రజలము మురాదేవి శిరముపై నొక బిందువును, సునందాదేవి తలపై నెనిమిది బిందువులును పడెను. మహర్షి మురాదేవి కొక్క-కుమారుఁడును సునందాదేవి కెనమండ్రు పుత్రులును గల్గుదురనియు పలికెను. మహారాజు పరమానందభరితుఁడై మహర్షికి మ్రొక్కి సెలవు తీసికొనెను.

మహాపద్మనందుని యభీష్టము సిద్ధించినది. ఆతని చిరవాంఛ ఫలించినది రాణులు సముచితకాలమున తొమ్మిది మంది కుమారులను బ్రసవించిరి. ప్రథమమున పెద్దభార్యయగు మురాదేవి చంద్రకాంతి పరిపూర్ణుఁడైన కుమారుని గనెను. మహారాజు సంతోషముగా తన జ్యేష్ఠపుత్రునకు "చంద్రగుప్తు"డని నామకరణము కావించెను. తరువాత సునందాదేవి కెనిమిదిమంది కుమారులు జన్మించిరి. మహారాజానందముగా వారి కందరికి "నందు"లని పేరిడికొనెను. మహారాజ పుత్రోదయ వార్త పండువెన్నెలవలె, పన్నీటి

జల్లువలె, మధురగానమువలె, మలయమారుతమువలె, అల్ల
నల్లన నగరమునెల్ల బ్రాకినది. ప్రజలెల్లరు పరమానంద
పరవశులై పండుగ చేసికొనిరి.

క్రమముగ రాజకుమారులు పెరిగి పెద్దవారై విద్యా
బుద్ధులు నేర్చిరి. రాజోచిత వివిధ విషయ పరిజ్ఞానము
నార్జించిరి.

శస్త్ర శాస్త్ర కళాకోవిదులైరి. అందఱిలో చంద్ర
గుప్తుఁడు మహామేధావియై నిఖిల విద్యానిపుణుఁడై వినయ
వివేకసంపన్నుఁడై గురుదేవుల మన్ననల నందుకొనుచుండెను.

ధనుర్విద్యా ప్రావీణ్యములో, ఖడ్గచాలనములో,
శూలప్రయోగములో, ప్రాసకుంతతోమర ముసలముద్గరాది
వివిధాయుధ వినియోగకౌశలములో, నానావిధ రణవ్యూహ
కల్పన రక్షణ భేదనములలో, అశ్వారోహణ గజారోహణ
రథారోహణాదులలో, చిత్ర విచిత్ర యుద్ధ విద్యావిశేష
విజ్ఞానములో సాటిలేని మేటియయ్యెను.

సునందా తనయులైన నందులా బాల్యముగా చంద్ర
గుప్తుని యెడల నీర్ష్యాద్వేషములతో బ్రవర్తించుచు సాహం
కారులై, సముద్ధత స్వభావులై, స్వేచ్ఛాచారులై యుండిరి.
నిరంతరము సుఖభోగలాలసులై విశృంఖల విలాస
ప్రవృత్తులై కాలము గడుపుచుండిరి.

మహాపద్మనందుఁడు వార్ధక్యవశమున తా నిక రాజ్య
భారము వహింపఁజాలనని తలచెను. కుమారులకు రాజ్యము

నప్పగించి తాను విరాగియై విపినసీమలో విశ్రాంతి గొన వలెనని యాతఁడు నిశ్చయించుకొనెను. రాజ్యాధికారము తన యనంతరము న్యాయముగా జ్యేష్ఠపుత్రుఁడైన చంద్రగుప్తునకు సంక్రమింపవలసి యున్నను, మహారాజు ప్రజాభిప్రాయమును, అమాత్య హృదయమును గుర్తించి సునందా తనయులైన నందులకే పట్టాభిషేకము జరుగవలెనని నిర్ణయించెను.

చంద్రగుప్తుని మాతామహుఁడు బౌద్ధమతావలంబియై వర్ణచ్యుతుడని పేరుపొందినందునవలన ప్రజలు చంద్రగుప్తుని ప్రభువుగా నంగీకరింపరనియు, నతనికి రాజ్యాభిషేకము చేసినచో దేశమున నంతర్విప్లవము సంభవించుననియు మహాపద్మనందుఁడు భావించెను. ఆతఁ డమాత్యులతో నాలోచించెను. అమాత్యులు మహారాజ నిర్ణయము నంగీకరించిరి. సునందాతనయుఁడైన ధననందునకు పట్టముగట్టుటకై ప్రయత్నములు ప్రారంభింపబడెను.

సునందాదేవి తన కుమారుల కాకస్మికముగా నదృష్టము కలసివచ్చినందులకు పరమానంద పరవశురాలగుచుండెను. ఆమె చింతాక్రాంతుఁడై, మారుతాహత పత్రాకమువలె మురాదేవి సౌధమునుండి తన భవనమువైపు సాగి వచ్చుచున్న మహారాజు నల్లంత దూరముననే చూచి, మంద

హాస వదనారవిందయై ఎదురేగి స్వాగతమిచ్చి సాదరముగా తోడితెచ్చి సుఖాసీనునిగావించెను. ఆమె ఆదరానురాగము లకు మహారాజు ముగ్ధుఁడయ్యెను. ఆమె సాన్నిధ్య మాయ నను పన్నీటిజల్లువలె సేదదీర్చెను. ఆమె సల్లాపముల కాయన హృదయము ప్రఫుల్లమయ్యెను. ఆమె పరిచర్యల కాయన ఆనందభరితుఁడయ్యెను.

"ప్రభువులు చాల ఉదాసీనముగ నున్నారు! కారణ మేమో తెలిసికొనవచ్చునా?" సునందాదేవి మహారాజును పరామర్శించెను.

"ఏమియులేదు దేవీ! నీ సాన్నిధ్యము చకోరిని జాబిల్లి వలె, చల్లని పాలవెల్లివలె నా హృదయమున కిప్పుడు పరమ శాంతి కలిగించుచున్నది." మహారాజు సేదదీరి పలికెను.

సునందాదేవి వినయ వినమితయై "ప్రభువుల యను గ్రహము! చరణదాసిపై ప్రభువులకు గల యనురాగమే తమ మనశ్శాంతికి కారణమనుకొందును." అని పలికెను.

ప్రభువు సునందాదేవి మధురప్రసంగమునకు ప్రసన్న హృదయుఁడయ్యెను. "ఈమెకు, మురాదేవికి ఎంత భేద మున్నది! ఆమె సుడిగాలి వంటిది. ఈమె మలయ మారు తము వంటిది! అవును. ఈమె కుమారునికే రాజ్యము నిచ్చుట సర్వథా సముచితము. మురాపుత్రునకు సైన్యాధిపత్య

మిచ్చుటయే యోగ్యకృత్యము." ప్రభువు దృఢనిశ్చయుఁడై ప్రశాంతచిత్తుఁడై విశ్రాంతి గైకొనెను.

ఒకానొక సుముహూర్తమున నందులలో జ్యేష్ఠుడైన ధననందునకు రాజ్యపట్టాభిషేకము జరిగినది. నంద సోదరు లందఱు నా మహోత్సవములో నెల్లెడల తామై పరమా నందముగా ప్రవర్తించిరి. చంద్రగుప్తుఁడు సేనాపతి పదవిని స్వీకరించెను. వృద్ధరాజగు మహాపద్మనందుఁడు రాక్షస మంత్రిచేత మగధ రాజ్యమును సుప్రతిష్ఠితము చేయునట్లు ప్రతిజ్ఞ చేయించి కృతకృత్యుఁడై, సునందాదేవితో గూడి తపోవనమునకు పయనమాయెను. పట్టపురాణి మురాదేవి మాత్రము కుమారాభ్యుదయమును బ్రతీక్షించుచు నగరము ననే నిలిచియుండెను.

# రాజాగ్రహము

నందులకు రాజ్యపాలనముపై నాసక్తిలేదు. రాజ్య నిర్వహణమునకు శక్తిలేదు. రాజ్యాధికారము స్వీకరించిన నాటినుండి వారి స్వేచ్ఛాచారములకు మితిలేకుండెను. ప్రభుత్వ నిర్వహణ కవసరమైన నీతి నియమములు వారికి లేవు. విజ్ఞాన విచక్షణములు వారెరుగరు. వారు నిరంతరము భోగవిలాసములతో నక్రమవర్తనలతో కాలము గడుపు చుండిరి. క్రోధోన్మత్తులై నిగ్రహశూన్యులై యౌచిత్య హీనులై వర్తించుచుండిరి. అహోరాత్రములు అసంఖ్యాక విలాసినీ కటాక్ష పాశబద్ధులై, మదిరాపానపరవశులై, కేళీ గృహములలో ప్రొద్దుపుచ్చుచుండిరి. నర్తకీమణుల నృత్యములతో గణికా గానములతో వారికి క్షణకాలముకూడ తీరికలేకుండెను. ప్రజాహిత కార్యనిర్వహణమునకు బుద్ధి పుట్టకుండెను.

కాలక్రమమున నందుల దౌష్ట్యములు మితిమీరి పోయెను. ప్రజల ధనమాన ప్రాణములకు రక్షణ లేకుండెను. పతివ్రతల శీలసంపదకు భద్రతలేకుండెను. అందుచే నందుల పట్ల ప్రజల యాదరానురాగములు తొలగిపోయెను. ఆ యదను చూసికొని రాజోద్యోగులు అమాయక

ప్రజలను బాధించి ధనసంపదలు గడించి పలు విధముల పీడింపసాగిరి. ఆ ప్రజనులకు రాజదర్శనము దుర్లభమై పోయెను. మహామాత్యులకు గూడ రాజసన్నిధి లభించుటలేదు. ప్రజ్ఞాధురంధరులైన యమాత్యు లెన్నివిధముల ప్రయత్నించినను నందుల మనస్సు మారలేదు. మంత్రులు నిస్సహాయులై మిన్నకుండిరి. అది చూచి చంద్రగుప్తుఁడు క్రమముగా రాజకార్యములు చాలవరకు తానే నిర్వహింపసాగెను. ప్రజల కష్టములు విచారించి న్యాయ నిర్ణయములు చేయుచుండెను. సమయోచితములైన రాజశాసనములు చేసి రాజ్యపాలనమున సువ్యవస్థ నేర్పరచుచు ప్రజాభిమానమును జూరగొనుచుండెను. నందులు పేరునకు మాత్రమే ప్రభువులు గాని ప్రభుకార్యము లన్నియు చంద్రగుప్తుని వశమయ్యెను.

అదిచూచి ప్రధానామాత్యుఁడైన రాక్షసమంత్రి మిక్కిలి కలవరపడెను. ఆ పరిస్థితి నట్లే కొనసాగనిచ్చిన కొంతకాలమునకు నందులను కూలద్రోసి చంద్రగుప్తుఁడే రాజ్యాధిపత్యము స్వీకరింపవచ్చునని రాక్షసమంత్రి భయపడెను. అట్లయినచో తాను వృద్ధరాజగు మహాపద్మనందున కిచ్చిన వాగ్దానము వమ్మగునని యాతఁడు చింతించెను. ఆతఁడనేక పర్యాయములు నందరాజును సందర్శించి హితవు చెప్పవలెనని యత్నించెను. కాని ఎన్ని పర్యాయములు

ప్రయత్నించినను నిరంతర కామినీ జన పరివృత్తుఁడైన నంద రాజు దర్శనమే మహామాత్యునకు ప్రాప్తింపలేదు. ఒకనాడు రాక్షసమంత్రి విశ్వప్రయత్నముచేసి ధననందుని సందర్శించెను. నందరాజు చిరాకుపడుచు విలాసమందిరమునుండి బయటకు వచ్చి మహామాత్యుని వచ్చిన పని యేమని ప్రశ్నించెను.

రాక్షస మంత్రి : ప్రభువులు సావధానులు కావలెను. రాజ్యము విపత్కర పరిస్థితిలో నున్నది.

నందరాజు : విపత్కర పరిస్థితియా? ఏమిటా విపత్తు? మీరుండగా అంత విపత్తు రాజ్యమునకేల గలుగవలసి వచ్చినది ?

రాక్షస: ప్రభువులు రాజ్యభారమును స్వయముగా నిర్వహింపవలెను. అమాత్యులు ప్రభు సహాయకులు మాత్రమే! మఱి తాము రాజ కార్యములు పట్టించు కొనక పోయినచో తమకును రాజ్యమునకును ప్రమాదము తప్పదు.

నంద : రాజ కార్యములు ప్రభువులే చూడవలసి వచ్చినచో మంత్రు లెందుకు? తిని కూర్చుండుటకా? అట్టి పనికి మాలిన మంత్రులను మేము పదవులనుండి తొలగింప దలచితిమి.

రాక్షస: ప్రభువులు ప్రశాంతచిత్తులు కావలెను. రాజకార్యముల విషయములలో నంత తొందరపడి నిర్ణయము చేయరాదు.

నంద : అంత నిదానముగా నాలోచించుటకు మాకు తీరిక లేదు. మీరు చెప్పవలసినదేమో వెంటనే చెప్పుడు.

రాక్షస: మనవి చేయుచున్నాను. సేనాపతి చంద్రగుప్తులు క్రమక్రమముగా సర్వ రాజ్య కార్యనిర్వహణాధికారములు వశపరచుకున్నారు. అమాత్యులతో నాలోచింపకుండ నిర్ణయములు చేసి వైచుచున్నారు. ఇది యట్లే సాగనిచ్చినచో దేశమున నరాజకత్వము ప్రబలునని మా భయము.

నంద : ఆహా! గొప్పబుద్ధిమంతుడవు! అయినను ఆ భయము నీకేలనయ్యా? చంద్రగుప్తుడు రాజ్యకార్యములు నిర్వహించినచో నందు తప్పేమున్నది? అతడు సమర్థుడు. కనుక మంత్రులతో నాలోచింపవలసిన యవసరమాతనికి లేదు. అందులకు నీవేల దుఃఖపడవలెను ? వచ్చెడి వేతనము గ్రహించి నిశ్చింతగా నింట గూర్చుండక రాజ్యమునకు రాజునకు విపత్కర స్థితి వచ్చినదని చెప్పవచ్చితివా? పో పొమ్ము. హాయిగా నిల్లుచేరి యాలు బిడ్డలతో సుఖముగా నుండుము. మఱి యెప్పుడును మా కడకు రాకుము. మాకేమియు

ప్రమాదములేదు. తెలిసినదా? మా కాలస్యమగు చున్నది. ఇక మేము వనవిహారమునకుఁ బోవలెను.

నందరాజు చివాలున లేచిపోయెను. రాక్షసమంత్రి ఖిన్నవదనుఁడై గృహాభిముఖుఁడయ్యెను.

ఆ మఱునాటి ఉదయమునకు నందరాజు మనసునకు పట్టిన మైకము తొలగిపోయెను. క్రిందటిరోజు రాక్షసమంత్రి చెప్పిన మాటల కర్థ మప్పుడు బోధపడసాగెను. తాను వన విహారములతో వనితాప్రణయములతో కాలము గడుపు చున్నాడు. రాజకార్యములు నిర్వహించుటలేదు. రాక్షస మంత్రి చెప్పినట్లు చంద్రగుప్తుఁ డాయవకాశమును వినియో గించుకొని రాజ్యపాలనములో నెక్కువ జోక్యము పెట్టుకొను చున్నాడట! ఒకవేళ ఆతడు క్రమముగా తానే రాజై సింహా సనము నాక్రమించునేమో! అప్పుడు తనగతి యేమగును? తన తమ్ముల స్థితి యేమగును? తాము రాజ్యభ్రష్టులై బికా రులు కావలసివచ్చును. అట్టి ప్రమాదసమయమున తమ్మాదు కొనువారెవరున్నారు? అమాత్యులు రాజోద్యోగులు పరిచా రకులు ప్రజలు అందరు ప్రభు వెవ్వరైన ఆతని సేవింతురు! తననుగూర్చి యెవ్వ రాలోచింతురు? తానిట్లే కళ్ళు మూసి కొని చంద్రగుప్తుని ఆధిపత్యమును సాగనిచ్చినచో తాము సర్వనాశనముకాక తప్పదు. తమ మీఁది ప్రత్యేకాభిమాన

ముతో తంత్రీగారు చంద్రగుప్తుని వంచించి రాజ్యమును తమ కిచ్చినారు. అందువలన చంద్రగుప్తుఁడు సింహాసన మాక్ర మించుకొనుటకు యత్నించుచుండుట యథార్థమేయగునేమో! అమ్మో! అట్లయిన తమ బ్రతుకులేమి యగును !"

నందరాజు భయంకరాలోచనముతో గడ గడ లాడి పోయెను. "అట్లు జరుగరాదు. జరుగనీయరాదు. ఇప్పుడే చంద్రగుప్తుని రావించి రాజ్యమునుండి బహిష్కరింపవలెను. దానితో పీడ విఱుగడయై పోవును." - నందరాజు నిశ్చ యించుకొనెను. వెనువెంటనే ఆయన సేనాపతియైన చంద్ర గుప్తుని దోడ్కొనిరమ్మని రాజభటుల నాజ్ఞాపించెను.

చంద్రగుప్తుఁడు రాజాజ్ఞవిని ప్రమాదమును శంకిం చెను. అయినను సర్వసన్నద్ధుఁడై ప్రభువు సన్నిధికి వచ్చి నాఁడు. నందరాజు చంద్రగుప్త ననాదరముగా చూచి "ఏమి చంద్రగుప్తా! ఈమధ్య రాజ్యపాలనములో నీ యనుచిత ప్రమేయ మధికమైనదని యమాత్యులారోపించుచున్నారు! అందుల కేమందువు?" అని ప్రశ్నించెను. చంద్రగుప్తుఁడు నిర్లక్ష్యముగా "అవును. అసమర్థప్రభువు ఔదాసీన్యము వహించినప్పుడు సేనాపతి రాజ్యభార్యములు నిర్వహింపక తప్పదు." అని బదులు పలికెను.

నందరాజు క్రోధోద్విగ్నుఁడయ్యెను. "రాజ్యకార్య ములు నిర్వహింపుమని నిన్నెవ్వరాదేశించిరి?" - నందరాజు

తీవ్రస్వరమున ప్రశ్నించెను. చంద్రగుప్తుఁడు నిర్భయముగా సమాధానము చెప్పెను. "ప్రజాక్షేమము కొఱకు నేనే పూనుకొంటిని. అం దపరాధము లేదని నా అభిప్రాయము."

"నీవు రాజద్రోహివి! సర్వాధికారము అపహరించి మాకు రాజ్యభ్రష్టత కలిగించుటకై యత్నించుచున్న నేరమునకు నిన్ను శిక్షింపదలచితిమి."

"మంచిది. రాజునకు విశ్వాసములేని సేనాపతి యధికారమున నుండకుండుటయే మేలు."

చంద్రగుప్తుఁడు లేచి నిలువబడెను.

"చంద్రగుప్తా! రాజ తిరస్కార ఫలముగా నిన్ను సేనాపతి పదవినుండి తొలగించుచున్నాము. రాజభద్రత కొఱకై నీకు కారాగారశిక్ష విధించుచున్నాము. నీ ప్రవర్తనము బట్టి నీ శిక్ష విషయము పునరాలోచింపబడును."

రాజాజ్ఞ నిర్వర్తింపబడినది. చంద్రగుప్తుఁడు తల్లి మురాదేవితోపాటు భయంకర కారాగారమున బంధితుఁడయ్యెను.

# అద్భుత సత్కారము

మురాదేవి తన కుమారునకు గలిగిన ఘోరవిపత్తు నకు మిక్కిలి వ్యాకులిత యగుచుండెను. చంద్రగుప్తునకు మాత్రము కారాగారవాసము భవిష్యదాలోచనా పరంపర కవకాశము కల్పించినది. నంద విధ్వంసనమునకును, మగధరాజ్య సింహాస నాక్రమణమునకును సముపయుక్తములు కాగల అనేక ప్రణాళిక లాతఁ డాలోచింపసాగెను.

"అసమర్థుఁడు నీతిబాహ్యుఁడు నైన నందరాజును సింహాసన భ్రష్టుని గావింపవలెను. కాని రాక్షస మహామాత్యు మేధారక్షితమైన మగధ సామ్రాజ్యము తాననుకొనినంత అవలీలగా నధీనముగాదు. నానా సామంత సేనా సమూహముతో కలిసి మగధసైన్యము లెంత బలవత్తరము లైనవో తానెరుగుదును. అందులకై తగిన సహాయసంపద కావలెను. అట్టి సహాయము నందించువారు లభింపవలెను. ఏ ప్రభువు నాశ్రయించిన తన ప్రయత్న మీడేరును? ఏ మార్గమును ద్రొక్కిన తన యభీష్ట మీడేరును?"

చంద్రగుప్తుని మనమున నొక క్రొత్త యాశ తలిర్చెను.

"ఇప్పుడు గ్రీకు ప్రభువైన యలెగ్జాండరు మహాసైన్యములతో విశ్వవిజయమునకు బయలుదేరి వచ్చి పశ్చిమ భారతమున తక్షశిలాప్రాంతమున విడిసియున్నాడు. అతని సహాయమున తన తలచిన పని సులభసాధ్యమగునేమో!"

చంద్రగుప్తున కొక సందేహము కలిగెను.

"తాను, పవిత్రమైన భారతభూమిపై దుర్బుద్ధితో దురాక్రమణ చేయవచ్చిన యవనప్రభువును సహాయమర్థింపవచ్చునా? అది దోషమగునేమో! ఎట్లగును! తాను సైన్య సహాయము చేయుమని గ్రీకుప్రభువు నర్థింపఁడు. తనకు కావలసినది విశ్వవిఖ్యాతమైన గ్రీకుల యుద్ధ విద్యా పరిజ్ఞానము. అది సాధించినచో తన ప్రయత్నము సఫలమైనట్లే! అంతేకాదు. ధర్మపరిరక్షణకై తాను చేయబోవు మహాయత్నములో తానెవ్వరి సహకారము పొందినను తప్పులేదు. పైగా తానిప్పుడీ విధముగా గ్రీకుల యుద్ధ కళానైపుణ్యము నెరుగుట భవిష్యత్తులో దేశరక్షణమునకు గూడ సహాయకారి కాగలదు.

ధర్మభూమియైన భారతదేశము వివిధరాజ్య వికీర్ణమై ఐకమత్యములేక, ఆత్మశక్తి నెఱుఁగక, యవన దురాక్రమణమునకు గుఱియగుచున్నది. కనుక తానిప్పుడు భారతీయ రాజ్యములను సమైక్యము చేసి, విదేశీయుల బారినుండి ఆర్యావర్తమును గాపాడవలెను. అందులకు ముందుగా అసమర్థ

దుర్జనులైన నందరాజులనుండి మగధరాజ్యమును సంపాదింప వలెను. అదే తన కర్తవ్యము.

అవును. అందులకై తానిప్పుడు సుప్రశస్తమైన భారతీయ రణ కళాపాండిత్యమునకు తోడుగా పాశ్చాత్య యుద్ధ విద్యాప్రావీణ్యము గూడ సంపాదించుకొనవలెను. అప్పుడు గాని తన జీవితలక్ష్యము సిద్ధింపదు."

చంద్రగుప్తుడు తన కర్తవ్యమును నిశ్చయించుకొనెను. అందులకై యాతడు ముందు నందుల కారాగారము నుండి తాము తప్పించుకొని బయటపడవలెనని యాలోచించెను. కాని మురాదేవి కుమారుని యాలోచనము నంగీకరింపలేదు. "కారాగారమునుండి తప్పించుకొని పోవునప్పు డెవ్వరి కంటనైన బడినచో నది మరింత ప్రమాదకరమగును. వద్దు చంద్రగుప్తా! ఆ ప్రయత్నము చేయవద్దు. ఇట్లే కొంత కాలము గడువనిమ్ము. దైవానుగ్రహ మున్నచో ఎప్పుడో ఒకప్పుడా పాపాత్మునికి మనస్సు మారవచ్చును. మనకు బంధవిముక్తి లభింపవచ్చును." అని మురాదేవి చంద్రగుప్తునకు హితవు చెప్పెను.

చంద్రగుప్తుడు తల్లికి నచ్చజెప్పసాగెను. "ఆ యాశ నాకు పీసమైన లేదమ్మా! ఆ దుష్టాత్మునకు దయకలుగుట యసంభవము. నేనీవిధముగా కర్తవ్యమూఢుడనై కారాగార

ములో పడియుండుట నిష్ప్రయోజకము - తప్పదు - ఈ గృహద్వారములు బ్రద్దలు కొట్టియైన నేను బయట బడక తప్పదు. నీవు సందేహపడకు. భగవంతుఁడు నా కాబలము నిచ్చినాఁడమ్మా !"

చంద్రగుప్తుఁడు పిడికిలి బిగించెను.

మురాదేవి కుమారుని దృఢదీక్షకు పొంగి పోయినది. ఆమె కన్నుల వెంట ఆనందబాష్పములు జాలువారినవి.

అంతలో కారాగార కవాటములు తెరచుకొనెను. మాతాసుతు లాశ్చర్యచకితులైరి. ఆ యకాలమున కవాటము లేల తెరువబడినవో వారి కర్థము కాలేదు. సింహళాధిపతి పంపిన సింగపుబోనును బరీక్షించుటకై చంద్రగుప్తుని బంధముక్తుని జేసి, సభకు గొనిరమ్మని రాక్షసమంత్రి పంపిన రాజభటుఁడు ప్రభుశాసనమును వినిపించెను. "రాజకుమారా! మిమ్ము ప్రభువులు కారాగారమునుండి విడుదల చేయుచున్నారు. మీరు వెంటనే మహారాజ సభామందిరమునకు విచ్చేయవలెను."

చంద్రగుప్తుడు తల్లి నింటికిపంపి, తాను నందరాజ సభామందిరమునకు బయలుదేరిపోయెను.

అది నందరాజు సభామందిరము. మగధాధిపతి ధన నందుఁడు తమ్ములతో మంత్రులతో నుద్యోగులతో కొలువు

తెచ్చి యుండెను. ఆనాడు రాజసభ ప్రత్యేకముగా సమా వేశమైనది. సభాసదులందరు ఉద్విగ్నహృదయులై యుండిరి. నాటి ఉదయము సింహళదేశాధీశుడు పంపిన యొక చిత్ర మైన సింగపుబోను పాటలీపుత్రము కోటగుమ్మముముందు నిలచినది. దేశదేశములలోని ధీమంతుల ప్రతిభా వైభవమును పరీక్షించుటకై సింహళాధిపతి దానిని పంపినాడు. ఏ దేశము వారును దాని రహస్యము నెరుగజాలక పోయిరి. అది తిరిగి తిరిగి మగధరాజధానియగు పాటలీపుత్రమును చేరుకొనినది.

అది యొక విచిత్రమైన పరీక్ష. బోనున కమర్చబడిన యినుపచువ్వలను తాకకుండ లోపలనున్న సింహమును బయటకు రప్పింపవలెను. ఈ మహాకార్యము నెవరు సాధింప గలరో వా రద్వితీయ మేధావంతులు వారికి సింహళాధిపతి పంపిన నవరత్నఖచితమగు ఖడ్గము బహుమానముగ లభిం చును! ఆ పరీక్షలో సాఫల్యమును సాధింపలేని రాజ్యమున బుద్ధిమంతు లెవ్వరు లేనట్లు లెక్క!

నందరాజు ఆజ్ఞానుసారము పాటలీపుత్రములోని మేధావు లందఱును సింహపుబోనును పరీక్షించినారు. కాని వారిలో నెవ్వరికిని కార్యసాఫల్య మార్గము గోచరించలేదు. నందులు మహనీయ మేధావంతులగు మంత్రులను రావించి సంప్రదిం పులు జరిపినారు. పాటలీపుత్రము నగరవీధులలో నలువైపుల బోనును ద్రిప్పినారు. ప్రజలు తండోపతండములుగవచ్చి యా

విచిత్రమును వేలము వెఱ్ఱిగా వీక్షించినారేకాని తగినయుపాయము మాత్రము గ్రహింపలేదు. తమ గౌరవము తమ రాజ్యప్రతిష్ఠ గంగపాలగునేమోయని నందులు క్రుంగిపోసాగిరి. వారు కర్తవ్యము నాలోచింపుమని మహామాత్యుడైన రాక్షసమంత్రిని వేడుకొనిరి.

రాక్షసమంత్రి కొంతసేపు యోచించి యొక్కసారి తల పంకించినాడు. అతనికి రాజకుమారుడైన చంద్రగుప్తుని బుద్ధికుశలత జ్ఞప్తికి వచ్చినది. వెంటనే ఆతడు నందుల నొప్పించి కారాగారముననున్న చంద్రగుప్తుని బంధముక్తుని చేయించి సభామందిరమునకు రప్పించినాడు. ఆతనికి సింగపుబోను వృత్తాంతము దెలిపి "రాజకుమారా! ఈ పరీక్షలో నీవే జయము సాధింపవలెను. ఈ గండము గడిచి గట్టెక్కు మార్గము నన్వేషించి మన మగధరాజ్య గౌరవమును నీవే నిలబెట్టవలెను." అని రాక్షసమంత్రి చంద్రగుప్తు నభ్యర్థించినాడు.

చంద్రగుప్తుడు బోనును క్రిందినుండి పైవరకు పరీక్షించి చూచెను. "బయటనున్న వ్యక్తి లోని సింహము నాడించుటయా? అతని చేతి కదలికనుబట్టి సింగపుపిల్ల అటు నిటు కదలుటయా? చూపరుల కది సజీవసింహముగా గన్పించుటయా?" - చంద్రగుప్తుడు కొంచెముసేపాలోచించినాడు. అందేదియో యంత్రములో తంత్రమున్నట్లు పసిగట్టినాడు, ఆత డొక మాంసఖండము నందుకొని బోను

నంజలి సింహము ముందుంచినాడు. సింహము కదలలేదు - మెదలలేదు. అది నిజమగు సింహమైనచో మాంసఖండమున కాశపడి ముందుకు రావలెనుగదా! అది యట్లు చేయకపోవుటచే చంద్రగుప్తునకు సందేహము కలిగెను. ఆతడు సింహము కదలికకు కారణముగా నేదియో మర్మమున్నట్లు గ్రహించినాడు. వెంటనే ఇనుపకడ్డీలను తెప్పించినాడు. కణకణమండు ఆ రెండుఇనుపకడ్డీలను దెప్పించి యొకదానిని బోనుచువ్వలలో నుండి సింహము నోటిలోనికి గుచ్చి, మరొకదానిని దాని వీపుపై నుంచినాడు. అంతకుముందు భీకరాకృతితో నున్న సింహరాజము క్షణకాలములో నీరై బోను చువ్వలవెంట కరిగిపోసాగినది. "లక్క-సింహము" "లక్క-సింహ" మని యొక్క-సారిగా సభ్యులు దిక్కు-లు పిక్క-టిల్లునట్లు గొంతెత్తి యరచిరి. పరీక్ష ముగిసినది. అగ్నిపరీక్ష ముగిసినది.

బోనుచువ్వలు తాకకుండ లోని సింహమును చంద్రగుప్తుఁడు తన బుద్ధిబలముతో బయటకు రప్పించినాడు, సింహళాధిపతి పంపిన నవరత్నఖచిత మహాఖడ్గము ఆతనికి బహూకరింపబడినది. అప్పటికి నందుల ప్రాణములు కుదుటబడినవి. కాని ఆ సంఘటనముతో చంద్రగుప్తుని విఖ్యాతి దేశదేశములకు బ్రాకుననియు, అద్భుత ప్రతిభావంతుడును, నఖండ శౌర్యరాశియునగు నా చంద్రగుప్తుని మహాప్రశస్తి యాతనికి అపారమైన ప్రజాభిమానమును సంపాదించి పెట్టు

సనియు వారికి అసూయ కలిగినది. ఆతడు మగధలోనున్నచో తమ కెప్పటికైన ముప్పు తప్పదని భావించిరి. ఆతని యునికి వారికి ప్రక్కలో బల్లెమని యనిపించినది. వారాతని నెట్లయి సను నగరమునుండి వెడలగొట్టవలెనని నిశ్చయించుకొనిరి.

నందరాజు రాజశాసనము ప్రకటించెను. "చంద్ర గుప్తుడు మున్ను చేసిన రాజద్రోహమునకు విధింపబడిన కారాగారవాస శిక్షకు బదులుగా ఇప్పుడు దేశబహిష్కార శిక్ష విధింపబడుచున్నది. అతడు నేడు చేసిన రాజగౌరవ రక్షణకు ప్రతిఫలముగా నాతనికి ప్రభువు లీ యుపకారము చేయుచున్నారు. ఆతడు వెనువెంటనే నగరము విడిపో వలెను."

ఆ ప్రకటన విని సభ నిర్విణ్ణమైనది. అమాత్యు లాశ్చర్యపడిరి. ఆపత్కాలమున మగధగౌరవము కాపాడి నందులకు కృతఘ్నులైన నందరాజులు చంద్రగుప్తున కిచ్చిన యమూల్య బహుమానమిది! మెచ్చి చేసిన అద్భుత సత్కారమిది!!

# మార్గోపదేశము

రాజసభలో చంద్రగుప్తుఁడు చేసిన ప్రతిభాప్రదర్శనమునకు ప్రతిఫలముగా దేశనిర్వాసన శిక్ష ప్రాప్తించినది. మగధరాజ్య మహాగౌరవము కాపాడిన నేరమునకు ఆతడు దేశబహిష్కృతుఁడై నాడు. అయినను అది యొక విధముగా చంద్రగుప్తుని యాలోచనముల కనుకూలమే యైనది. నిర్వ్యాపారముగా కారాగారములో బడియుండుట కంటె కర్తవ్య పాలనమునకు దగిన యవకాశము కల్పించినది.

చంద్రగుప్తుఁడు దన భవిష్యత్కార్య నిర్ణయమునకై ముందుగా నెవ్వరిని సందర్శింపవలెనా యని యాలోచించెను. అతనికి మున్నొకప్పుడు ప్రస్తావన వశమున తన తల్లి యగు మురాదేవి చెప్పిన యొక మహామహుఁడు స్మృతిపథమున మెదిలెను.

ఆ మహామహుఁడు సాక్షాత్కృత పరమేశ్వరుఁడు. మహాతపస్సంపన్నుఁడు. నిరంతర తపోనిష్ఠా గరిష్ఠుఁడు. అఘటన ఘటనా సమర్థుఁడు. దివ్య ప్రభావ మహితుఁడు. ఆయన పాణిని మహర్షి.

ద్రాక్షాశలంకుల పుత్రుఁడైన పాణిని మహర్షి పాటలీపుత్ర నివాసి. వర్షోపాధ్యాయుఁడను మహాపండితుని సమక్షమున దివ్యమంత్రోపదేశము పొందినవాడు. వివిధ విద్యలు

సమార్జించుకొన్నవాఁడు. విశేషించి శబ్దశాస్త్రవేత్తయైన వాడు. గురుని ఆజ్ఞానుసారముగ పాణినీయముగ చిరకీర్తిఁ బొందిన 'అష్టాధ్యాయి' యను సంస్కృత వ్యాకరణ గ్రంథమును నిర్మించినవాడు. జపతపోనుష్ఠాన దీక్షా బలమున మహత్తరమైన ఆత్మశక్తిని సంపాదించినవాడు. గురుదేవుని అనుశాసనము తలదాల్చి బహుకాలము పాటలీపుత్ర ప్రాంత కాంతారసీమలో మహాతపోదీక్ష వహించి సిద్ధపురుషుఁడై, సార్థక వచస్కుఁడై సుప్రశస్తుఁడైనవాడు.

ఇరువదియైదేండ్ల క్రిందట కారణజన్ముఁడైన ఆ పాణిని మహర్షిని సేవించియే మహాపద్మనందుఁడు సంతాన భాగ్యమును సంపాదించుకొనెను. ఆ మహర్షి వరప్రసాద మహత్త్వముచేతనే చంద్రగుప్తుడును, ధననందాదు లెనిమిది మందియును జన్మించినారు. ఆబాల్యముగ నందుల అక్రమ ప్రవర్తనము ఆ మహర్షికి తెలియుచునే యుండెను. పాణిని మహర్షి ఆలోచనామగ్నుఁడయ్యెను.

"మగధరాజ్య క్షేమమును గోరి తాను మహారాజునకు అనుగ్రహించిన వరము నిరర్థకమై పోవుచున్నట్లున్నది. ఆర్య ధర్మ సంరక్షకమై వర్థిల్లునని తానాశించిన మగధరాజ్య స్థితి అస్తవ్యస్తముగా నున్నది. అందుకు తోడు "పులిమీాద పుట్రయన్నట్లు" జగద్విజేత కాఁగోరిన గ్రీకుప్రభువు అలెగ్జాండరు అపారసేనాసమూహముతో ఆర్యావర్తముపై

దండెత్తివచ్చి అనేక రాజ్యము లాక్రమించుకొనుచున్నాడు. పశ్చిమభారతములోని కొందఱు ప్రభువులు శక్తికొలది ప్రతిఘటించియు, కొందఱు అతని ధాటికోర్వలేక 'దాసోహ' మనియు, మఱికొందఱు బహూకృతులంపి మంచిచేసికొనియు, ఇంక కొందఱు తోడి స్వదేశరాజులతోగల శత్రుత్వము వలన వారిని ధ్వంసము చేయగోరియు, గ్రీకు ప్రభువునకు సాదరముగ స్వాగతమిచ్చి ఆయన జైత్రయాత్రకు సహాయపడుచున్నారు. ఆర్యధర్మము, భారతీయ సంస్కృతి క్రమక్రమముగా పరదురాక్రమణము వలన, గ్రీకు నాగరకతా ప్రభావము వలన రూపుమాసి పోవునట్లున్నది. ఈ క్లిష్టసమయములో తనవంటి దివ్యప్రభావ సంపన్నులైన తపస్వులు, సిద్ధపురుషులు, తమకేమియు పట్టనట్లు ముక్కుమూసికొని మునివృత్తిబూని మాఱుమూల అడవులలో కాలము గడుపరాదు. తనవంటి మహర్షుల ఆత్మశక్తి వల్లనే భారతభూమి ఎన్ని దురాక్రమణలకు గుఱియైనను స్వదేశీయ సంస్కృతి సంప్రదాయములను, సర్వోత్తమ జీవన విధానమును, స్వజాతీయ స్వేచ్ఛాగౌరవములను సంరక్షించుకొనుచున్నది. ఇప్పుడు ముందుగా తాను పశ్చిమభారతమునకుఁ బోవలెను. కొంతకాలముపాటు ఆత్మవిముక్తికేకాక జాతివిముక్తికై గూడ తన తపోబలమును వినియోగింపవలెను. అన్యోన్య కలహములతో, అనైకమత్యముతో కర్తవ్యవిముఖులై

అల్లాడుచున్న ప్రజలకు, ప్రభువులకు సత్క్రమమార్గమును ప్రదర్శింపవలయును."

పాణిని మహర్షి తన కర్తవ్యమును నిశ్చయించుకొనెను. ఆయన ఆశ్రమమువీడి శిష్యసమేతుడై తక్షశిల నగరమున కేగి తన లోక శాస్త్ర పరిజ్ఞాన బలమున అచ్చటి విశ్వ విద్యాలయములో ఆచార్యపీఠము నధిష్ఠించెను. వివిధవిషయ పరిజ్ఞానముగల విద్యార్థులందఱను తన దేశ స్వాతంత్ర్య సంరక్షణోద్యమములో సహాయకులుగా తీర్చిదిద్దుకొనెను. ఆ మహోద్యమము చేపట్టియున్న పాణిని మహర్షిని తాను ముందుగా సందర్శింపవలెను. అమోఘమైన ఆయనఆశీర్వాదముతో దివ్యమైన ఆయన ఉపదేశముతో తాను కర్తవ్య మార్గమును గుర్తించుకొనవలెను. అనంతరముఆచార్యదేవుని అనుమతిపొంది విశ్వవిజేతయగు గ్రీకుప్రభువు అలెగ్జాండరును సందర్శింపవలెను" అని చంద్రగుప్తుడు నిశ్చయించుకొనెను.

చంద్రగుప్తుఁడు పాటలీపుత్రమును వీడి తక్షశిలాభిముఖుఁడయ్యెను.

ఔరా! విధివైపరీత్యము! భవిష్యద్భారత సార్వభౌముడు నిర్వాసితుఁడై, నిజభుజబల మాత్ర సహాయుఁడై, మహత్తరమైన యాత్మవిశ్వాసమే యండగా పరప్రదేశమునకు పయనించుచున్నాఁడు.

అది సుందర సుప్రభాతము. ఉదయలక్ష్మి ఫాలభాగమున నొప్పు సిందూర తిలకమువలె, ఇంద్రాణి చేతిమాణిక్య దర్పణమువలె భాస్కరుఁడు నవారుణ కిరణకాంతులతో భాసిల్లుచుండెను. చీకటిలో చీకాకుపడిన లోకము నవాలోకమును, నవచైతన్యమును బొంది, ఆ జగద్బాంధవుని సువర్ణ ప్రభలతో దేదీప్యమానమగుచుండెను. చంద్రగుప్తుఁడు తక్షశిలా నగరములో ప్రవేశించెను. తక్షశిలానగర మాకాలమున పశ్చిమభారతములో సుప్రసిద్ధమై సర్వసంపన్నమై, భాగ్యభోగ్యవైభవ పరిపూర్ణమై వెలుగొందుచుండెను. బహుముఖ ప్రజ్ఞాధురంధరులైన మహాపండితుల కాలవాలమై విశ్వవిఖ్యాతమైనవిద్యాకేంద్రమైవిలసిల్లుచుండెను. నగరమంతయు సుందరసౌధములతో, సువిశాల వీధులతో సురభిళ ప్రసూన శోభితారామములతో నేత్రపర్వముగావించుచుండెను. నగరమున నెచ్చట జూచినను శిరస్త్రాణధారులైన గ్రీకు సైనికులు సాయుధులైన దేశీయనాయకులు సంచరించుచుండిరి. రాజవీధులు యాతాయాత ప్రజాసందోహములతో, రథగజాశ్వ ఘటాసంకులములై రమణీయములై యుండెను. వీధులనిండ రత్నాలరాసులు, ముత్యాల దండలు కుప్పలు కుప్పలుగా బోసికొని కోమలాంగులు సవిలాసముగా విక్రయించుచుండిరి.

చంద్రగుప్తుఁడు నగరశోభను చూచి విస్మయ పడుచు రాజమార్గము నతిక్రమించి తక్షశిలా విశ్వవిద్యాలయాభిముఖుఁడై ముందునకు సాగిపోయెను. వివిధశాస్త్ర విశారదు

లైన మహాపండితులతో, నానాకళా పారీణులైన విజ్ఞానవేత్త లతో నిరంతరాధ్యయనాధ్యాపన కార్యనిమగ్నములై తన రారుచున్న గురుకుల విభాగములను సందర్శించుచు చంద్ర గుప్తుఁడు నవ వ్యాకరణ నిర్మాతయైన పాణిన్యాచార్యుని సన్నిధికి జేరెను.

ఆ సమయమున ఆచార్యపాణిని యొక సుందరవృక్ష చ్ఛాయలో సమాసీనుఁడై యంతేవాసులకు విద్యాబోధనము చేయుచుండెను. తేజోమయుఁడైన ఆచార్యునిగాంచి చంద్ర గుప్తుఁడు ముగ్ధుఁడైపోయెను. ఇంతకాలముగా తాను విన్న యా తపోమయమూర్తి, యా పుంభావసరస్వతి సన్నిధాన ములో నాతని కద్భుతమైన మనశ్శాంతి లభించెను.

ఆచార్యదేవుడు చంద్రగుప్తుని జూచెను. "స్వాగతము! రాజకుమారా స్వాగతము! రమ్ము. కూర్చుండుము!" ఆచా ర్యుఁడు చంద్రగుప్తుని సాదరముగా నాహ్వానించెను. అను రాగ పురస్సరమైన ఆయన ఆహ్వానము చంద్రగుప్తునకు వేయియేనుగుల బలము నిచ్చెను. చంద్రగుప్తుఁడు భక్తి పూర్వకముగా సర్వజ్ఞుఁడైన పాణిన్యాచార్యుని పాదపద్మము లపై వ్రాలి నమస్కరించెను. ఆచార్యుడు ఆప్యాయముగా పలుకరించెను.

"క్షేమమా! రాకుమారా! మగధాధిపతులు కుశలమే గదా!"

చంద్రగుప్తుఁడు బదులు పలికెను. "గురుదేవుల యాశీర్వాదబలమున మగధాధిపతులు ఇకపై కుశలముగా నుండఁగలరు." ఆచార్యుడు కొంతవడి నిమీలితనేత్రుఁడై ఆలోచనా మగ్నుఁడయ్యెను. "మంచిది రాజకుమారా! మేము సర్వమును గ్రహించితిమి. మహాపద్మనందుని జ్యేష్ఠ పుత్రుఁడవైన నీవు, శస్త్రశాస్త్రవేత్తవైన నీవు ప్రభువంచితుఁడవై నిర్వాసితుఁడవై కర్తవ్యాన్వేషివై మా సన్నిధికి వచ్చితివని మేము గ్రహించితిమి." ఆచార్యుని మాటలు విని చంద్రగుప్తుఁడు విస్మితుఁడయ్యెను.

"రాకుమారా! గ్రీకుచక్రవర్తిని దర్శించి, యవన యుద్ధ కళారహస్యములు గ్రహింపవలెనని కుతూహలపడు చున్నావుగదా!" ఆచార్యుఁడు రాకుమారుని యాంతర్య మును విశదీకరించెను. చంద్రగుప్తుఁడు "చిత్తము స్వామీ! ఆ నా యభీష్టము సిద్ధించు కర్తవ్య మార్గము నుపదేశించి నన్నాశీర్వదింపుఁడని అభ్యర్థించుటకే తమ పదసన్నిధికి వచ్చితిని. ఇఁక తమ అనుగ్రహము." అని విన్నవించుకొనెను. "మంచిది, నాయనా! భవిష్యద్భారత కల్యాణము త్వదధీనమని పురాణప్రమాణ పురస్సరముగా నే నెఱుఁగుదు. నీ యత్నము సర్వదా సఫలమగును." ఆచార్యుఁడు సానురాగముగా ననెను. చంద్రగుప్తుఁడు వికసిత వదనుఁడయ్యెను.

ఆచార్యుఁడు మరల పలికెను. "రాజకుమారా! చక్రవర్తి దర్శన మంత సులభసాధ్యముగాదు. కాని గ్రీకు సేనా

పతి సెల్యూకసు సమక్షమునకు మాత్రము నిన్ను బంపగలను. అసాధారణ మేధా సంపన్నులైన నా శిష్యు లనేకులు బహు వేష భాషాప్రవీణులై నిరంతరము గ్రీకుసైనికుల మధ్య సంచరించుచు వారి యుద్ధప్రయత్నములను గుర్తించు చున్నారు ప్రజానీకములో స్వాతంత్ర్యభావమును బ్రచారము చేయుచు, శత్రువర్తన రహస్యమును గ్రహించుచు దేశమున యవనులభయమును దొలగించి ఆత్మబలమును స్వజాతి గౌరవమును సంరక్షించుటకై యత్నించుచున్నారు. వారి సాయమున నీవు సెల్యూకసును దర్శింపవచ్చును. ఆపిమ్మట...'

ఆచార్యు నర్థోక్తిలో నాపి చంద్రగుప్తుఁ డందు కొనెను.

"ఆ పిమ్మట యవన సేనాపతి యాదరాభిమానము లను నే నార్జించుకొనగలను గురుదేవా!"

ఆచార్యుఁడు మందహాసముచేసి యనెను. "నీ వంత వాఁడవే రాకుమారా! నీ కార్యనిర్వహణ సామర్థ్యముపై నాకు విశ్వాసమున్నది. కాని యొక్కమాట. భారత సామ్రాజ్య నిర్మాణమునకై కంకణము గట్టుకొనిన నీకు నేను చెప్పవలసిన యంశ మొకటి యున్నది."

"సెలవిండు గురుదేవా! మీ యాదేశమును బ్రత్యక్ష రము ననుసరింతును." చంద్రగుప్తుఁడు వినయపూర్వకముగ బలికెను.

"చెప్పెదను రాజకుమారా ! నీవు చాణక్యుని పేరు వింటివా ?"

"విన్నాను. ఆయన మగధవాసి యనియు, బహుకాలముగ తక్షశిలా విద్యాలయమున నధ్యయ నాధ్యాపన తత్పరుఁడై యున్నాడనియు విన్నాను."

"అవును. ఆయన వేద వేదాంగవేత్త. అఖండ రాజనీతి నిపుణుఁడు. అర్థశాస్త్రి పారంగతుఁడు. నవ్యార్థశాస్త్రి నిర్మాత. సర్వధర్మ రహస్యజ్ఞాత. భారత ధర్మ పరిరక్షణ దీక్షాసంపన్నుఁడు. దృఢ సంకల్పుఁడు. అపర బృహస్పతి. నీవు గ్రీకురాజ సందర్శనము పిమ్మట నాతని దర్శింపవలెను. నీ భుజబలమున కాతని బుద్ధిబలము తోడైనచో నీ యభీష్టము నిశ్చయముగ ఫలింపగలదు. ఆతని ఆశ్రయమే నీకు శ్రీరామరక్ష." ఆచార్యుడు దృఢ స్వరముతో బలికెను. ఆచార్య ప్రస్తుతుడైన చాణక్యునిపై చంద్రగుప్తుని కఖండమైనభక్తి భావము గలిగెను.

"ఆచార్యా ! మఱి వారి దర్శనము నే నెచ్చట జేయుదును ? " చంద్రగుప్తుఁ డడిగెను.

"ఆతఁడీ మధ్యనే ఇట్టి మహోద్యమమునకే మగధ కేగినాడు. నీ వనతి కాలములో మరలిపోయి యాతని నచ్చటనే సందర్శింపవచ్చును. ఆత డమాత్యుఁడుగా, నీవు చక్రవర్తివిగా

సుప్రతిష్ఠితులు కాఁగలరు. అది యవశ్య భవితవ్యము. అది దైవేచ్ఛ."

ఆచార్యుఁ డాంతర దృష్టితో నొక్కొక్కమాట తూచి తూచి పలికెను. చంద్రగుప్తుఁడు ప్రఫుల్ల వదనుఁ డయ్యెను.

"మఱియొకమాట రాకుమారా! యవనులు నిరంతర దురాక్రమణ పరాయణులు. వారితోడి సంతతము సావధానుఁడవై వర్తింపవలెను. ఈ మాట నెన్నడునుమరువకుము."

ఆచార్యుఁడు హెచ్చరించెను. చంద్రగుప్తుఁడు తల యూఁచెను. ఆచార్యుఁడు ప్రక్కనున్న శిష్యునివంకఁ జూచెను. శిష్యుఁ డాచార్య హృదయమును గ్రహించెను.

"రాజకుమారా! ప్రస్తుతము నీవు మా విద్యాలయము నందలి ఆతిథ్య భవనములో విశ్రాంతిఁగొనుము. ఒకటి రెండు దినములలో నీకు గ్రీకు సేనాపతి దర్శనము చేయించెదను. ఇప్పుడేపోయి సర్వము సన్నద్ధము కావింతును." అని పలికి గ్రీకు సైనిక వేషమును ధరించి వెడలిపోయెను. చంద్రగుప్తుఁ డాచార్యు ననుమతినొంది యతిథి భవనమువైపు సాగెను.

# దైవ సంకల్పము

పండు వెన్నెల. నిండు చంద్రుని వెండి వెలుగుల వెల్లువలో లోకమంతయు దేదీప్యమానముగా శోభిల్లు చుండెను. వనలక్ష్మి మందపవన సముపలాలితయై పరమ సుందరముగా భాసిల్లుచుండెను. అరణ్య వృక్షములు పక్షుల కలకలారావములతో నపూర్వానందమును బ్రకటించు చుండెను. ఆకసమున నొక ప్రక్కనుండి యనేక మేఘము లొక్కుమ్మడిగావచ్చి పూర్ణచంద్రు నాచ్ఛాదించినవి. చీకటి తెరలను తొలగించుకొని లోకము నెల్ల నలరింపవలెనని పూర్ణ చంద్రుఁడు తహతహలాడుచుండెను.

ఆ నిశీథిలో మహారణ్య మధ్యముననున్న గ్రీకు శిబిర ముల ప్రాంతమున నొంటరిగాఁ బయనించుచున్న చంద్ర గుప్తున కాకస్మికముగా నొక కేకవినిపించెను. "ఎవరది? ఇక్కడ నీ కేమి పని?" - చంద్రగుప్తుడు పరిశీలించి చూచెను. ఇరువురు గ్రీకు సైనికు లశ్వారూఢులై యాతని ముందుకువచ్చి నిలచిరి.

"ఎవరు నీవు? ఇక్కడ నీకేమి పని?" గ్రీకుసైనికులు మరల ప్రశ్నించిరి.

"మీ రెవరు? ఇక్కడ మీకేమి పని?" చంద్ర గుప్తుఁడు నిర్భయముగా ప్రతి ప్రశ్న వైచెను.

గ్రీకు భటులు తిరస్కార పూర్వకముగా "మే మెవ రమో తెలియదా ? మేము విశ్వ విజేతయైన అలెగ్జాండరు చక్రవర్తుల సైనికులము. ఇక్కడనే మా ప్రభువు విడిదిచేసి యున్నారు. ఆ సంగతి నీకు తెలియదు కాబోలు."

"అయిన మీరు మీ ప్రభువుల శిబిరముదగ్గర నుండక ఇక్కడ మీకేమి పని?" చంద్రగుప్తుఁడు మరల ప్రశ్నించెను.

"నీవంటి గూఢచారుల జాడలు తెలిసి పట్టి బంధించుట మా పని." గ్రీకు భటులు తీవ్రముగా బలికిరి.

చంద్రగుప్తుఁడు గంభీరస్వరముతో "అది మీచేత కాని పని !" అని పలికెను.

"అయిన నిన్నిప్పుడే పట్టిబంధించెదము" గ్రీకుభటులు అశ్వములు దిగి యతివేగముగా చంద్రగుప్తు నాక్రమింప వచ్చిరి.

చంద్రగుప్తుఁడు మెఱపు మెఱసినట్లు ఒఱనుండి కత్తి దూసి "ఆగుడు. అడుగు ముందుకు వైచితిరా మీ ప్రాణములు మీవి కావు." అని గర్జించెను.

గ్రీకు భటులు వెనుకంజ వేసిరి.

చంద్రగుప్తుఁడు కత్తి యొఱలో నుంచి "ఇప్పుడు చెప్పుడు. నన్ను బంధించి యేమి చేయుదురు ?" అని యడిగెను.

"మా ప్రభువుల ముందుంతుము. అంతే." గ్రీకు భటులు వినయముగా బలికిరి.

"మంచిది నా కోరిక కూడ నదే! మీ ప్రభువుల దర్శింపవలెననియే నే నిచ్చటకు వచ్చితిని. రండు. మీ ప్రభువుల సన్నిధికి నేనే వచ్చెదను." చంద్రగుప్తుడు ముందడుగు వేసెను.

గ్రీకు సైనికులు చంద్రగుప్తుని వెంట తమ చక్రవర్తి సమక్షమునకు పోయిరి.

అర్ధరాత్రి సమయము. అలెగ్జాండరు చక్రవర్తి సేనాపతి సెల్యూకసుతో మంత్రాలోచనము సాగించుచుండెను. గ్రీకు సైనికులు చంద్రగుప్తునితో ప్రభువు సన్నిధికి పోయి నివేదించిరి.

"ప్రభూ! శిబిర ప్రాంతములో సంచరించుచుండగా నీతనిని పట్టి బంధించి కొనివచ్చితిమి."

చంద్రగుప్తుడు వెంటనే తీవ్రస్వరముననెను. "లేదు, వారు బంధించితేలేదు. నేనే స్వయముగా వచ్చితిని." అలెగ్జాండరు చక్రవర్తి యాశ్చర్యముగా చంద్రగుప్తునివంక చూచెను. ఆ వీరభావము, ఆ సుందర రూపము, ఆ గంభీర కంఠము, ఆ మహా సాహసముచూచి గ్రీకు ప్రభువు మంత్రముగ్ధుడై యాతనివంక నట్లే చూడసాగెను.

ప్రక్కనేయున్న గ్రీకు సేనాపతి సెల్యూకసు స్థిర సంకల్పుడైన యాతనిగాంచి ముచ్చటపడెను. సాదరముగ తలయూచెను.

అలెగ్జాండరు చంద్రగుప్తుని గంభీరముగా ప్రశ్నించెను.

"ఎవరు నీవు? అర్ధరాత్రమున మా స్కంధావారము సమీపమున నీకేమి పని?"

"నేను మగధ రాజపుత్రుడను. నన్ను మౌర్యచంద్ర గుప్తుడందురు. ప్రస్తుతము నిర్వాసితుడను. జగత్ప్రశస్తులైన గ్రీకు ప్రభువుల సందర్శనాభిలాషయే నా యీ రాకకు కారణము. నా జీవిత లక్ష్యమైన భారత సామ్రాజ్య సంస్థాపనమునకు మీ సమర సామర్థ్యము సముచితముగా నుపకరించునని నా అభిప్రాయము." చంద్రగుప్తుడుదాత్త కంఠముతో బదులు పలికెను.

అలెగ్జాండరు చక్రవర్తికి పాణిని మహర్షి మాటలు స్ఫురణకు వచ్చెను. ఆ మహర్షి చెప్పిన భావిభారత సార్వభౌముడీతడే యై యుండునేమో! తేజోమయుడైన యీ యువకుడంతవాడగుటలో నాశ్చర్యములేదు. గ్రీకుప్రభువు మనోనేత్రముముందు మున్నొకనాడు తక్షశిలానగర ప్రాంతమందలి యొక మున్యాశ్రమ సమీపమున పాణిని మహర్షితో తన కేర్పడిన సమావేశ దృశ్యము సాక్షాత్కరించెను.

"పాణిని మహర్షి మహాద్భుత తపఃప్రభావ సంపన్నుడు. విశ్వవిజేతయైన తనయంతటివానిని గడగడలాడించిన

తేజోమయుఁడు. తాను అఖండ సేనాసమేతముగా జగద్విజ యమునకు బయలుదేరి నానాదేశములను పాదాక్రాంతము చేసికొనుచు వచ్చి, పశ్చిమ భారతములో నడుగుపెట్టినాడు. ఒకనాఁడు తానొక ప్రశాంత మహనీయమైన మున్యాశ్రమ ప్రాంతమున సంచరించుచు దీక్షాబద్ధుఁడై యున్న మహర్షిని చూచినాడు. చక్రవర్తియైన తనరాక గుర్తించి యా ముని సగౌరవముగా స్వాగతము పలికి సత్కరింపలేదని తనకు పట్టరాని యాగ్రహము వచ్చినది. ముక్కు మూసికొని కూర్చుండియున్న ఆ మునీంద్రుని సమాధి భంగము చేయుఁడని తాను తన సైనికుల నాజ్ఞాపించినాడు. సైనికులు మహర్షిని సంస్పృశింపబోయిరి. అది గుర్తించిన మహర్షి కన్నులు తెరచి తనవంక చూచి "ఓయి వివేకహీనుఁడా! భారత విజయమును కాంక్షించి వచ్చుట వ్యర్థప్రయాసమని ఎఱుఁగలేక యేల యహంకరించెదవు? ఈ యార్షభూమిలో మెరకబట్టి నీ జైత్రయాత్రారథ మాగిపోవునని గ్రహించుకొనుము." అని పలికినాఁడు.

తాను క్రోధావేశముతో "చాలు నీ యధికప్రసంగము! గోచిపాత బైరాగివి. నీవు మా జయాపజయములను గూర్చి బ్రస్తావించుచుంటివా? జగద్విజేతయైన చక్రవర్తిని సత్కరించుట మాని ధిక్కరించుచున్నావా? ఈ యవమానమునకు శిరచ్ఛేదమే నీకు తగిన శిక్ష." అని యొఱనుండి

కత్తిదూసి ఆ ముని శిరస్సును ఖండించుటకై చేయి యెత్తినాడు. మహర్షి ఒక్క మందహాసము చేసెను. అంతే! ఎంత అద్భుతము! తన యెత్తిన చేయి యెత్తినట్లే యుండెను. తన భుజమట్లే స్తంభించిపోయెను. తాను మహర్షి మహత్త్వమును గ్రహించి వెంటనే ఆయన పాదములపై వ్రాలి "మన్నించు మహర్షీ! నీ మహత్త్వ మెఱుగక యక్రమముగా వర్తించితిని. నా యపరాధమును మన్నింపు" మని ప్రార్థించినాఁడు. మహర్షి కరుణించి తన భుజా స్తంభమును దొలగించెను.

తానప్పుడు సవినయముగా మహర్షిని ప్రశ్నించినాడు. "స్వామీ! నా జగజ్జైత్రయాత్రకు భారతభూమిలో నిక్కముగా నాటంకము గలుగునా?"

మహర్షి నిమీలితనేత్రుఁడై బదులు పలికెను. "అవును. భారతదేశము నీ యధీనమగుట యసంభవము. భారత చక్రవర్తి యగు భాగ్యము నీకు లేదు."

"మఱి యా భాగ్యమెవ్వరిది మహర్షీ?" తాను సకౌతుకముగా నడిగెను.

"భారతభూమి నేకచ్ఛత్రముగా నేలు చక్రవర్తి యెవ్వరో యనతికాలముననే నీవు గ్రహింపగలవు. ఒకానొకనాడు ఆ యదృష్టవంతుఁడు నీ సమక్షమునకే రాగలడు." మహర్షి స్పష్టము చేసెను.

ఆనాడు తాను ఆశా నిరాశల యాందోళనముతో మహర్షి దగ్గర సెలవు దీసికొనెను. అటుపిమ్మట తాను పురుష కారమును నమ్మి మహాసైన్యముతో పురోగమించి భారత దేశములోని బహుప్రాంతముల నాక్రమించుకొనుచు వచ్చి, చివరకు తన్నెదిరించి నిలచిన పాంచాలపతియగు పురుషోత్తముని పరాక్రమమును మెచ్చుకొని ఆతనితో సంధిచేసికొని యున్నాఁడు. ప్రస్తుతము జైత్రయాత్ర కొనసాగించుటయా వెనుదిరిగి పోవుటయా యను నాలోచనముతో తాను సతమత మగు స్థితి ఏర్పడినది. ఈ సమయములో తన సహాయముగోరి సన్నిధికి వచ్చియున్న ఈ వీరకుమారుఁడు నిక్కముగా కారణజన్ముడే యై యుండును!" అని సముదాత్త స్వభావుఁడైన 'యలెగ్జాండరు చక్రవర్తి చంద్రగుప్తునిచూచి చాల ముచ్చటపడెను. "అవును. ఇక తనకెట్లును భారత విజయ గౌరవము ప్రాప్తించు నాశలేదు. తన సైనికులిక నొక్క యడుగుకూడ ముందునకు వేయలేమనియు, వెను వెంటనే స్వదేశమునకు దిరిగిపోవుదమనియు పట్టుబట్టియున్నారు. అగు గాక! ఇట్టి సాహసవంతుఁడైన యువకునకు తగినసహాయము చేయుట వీరధర్మమే యగును!" అలెగ్జాండరు చక్రవర్తి నిశ్చయించుకొనెను.

"మంచిది రాకుమారా! నీ యభిలాష మా కానంద మును గల్గించినది. నీ సాహసప్రవృత్తి మాకు నచ్చినది. నీవు భారతసార్వభౌముఁడవగుట దైవసంకల్పమని మాకు తోఁచు చున్నది. నీవు కోరిన యుద్ధ విద్యావిధాన విశేషములు నీకు

నేర్పవలసినదే! కానిమేము ప్రకృతమువూ జగజ్జైత్రయాత్రా సంకల్పమును విరమించుకొని స్వదేశోన్ముఖులమైయున్నాము. అయినను మా ప్రయాణ దినమువరకు నీవు మా సేనాపతి సెల్యూకసు సమక్షములో శ్రద్ధాసక్తులతో మాయుద్ధవిద్యా విశేషములు గ్రహింపవచ్చును. విద్యాసక్తులైన వీరపురుషుల కోరికతీర్చుట మాకు గౌరవకారణమే యగును." అని పలికెను. చంద్రగుప్తుడు గ్రీకు చక్రవర్తి యౌదార్యమునకు మహానందమందెను. ఆ రాత్రి అలెగ్జాండరు చక్రవర్తి చంద్రగుప్తునకు రాజోచితముగా సత్కారము చేయించెను. చంద్రగుప్తుడు గ్రీకు సార్వభౌమునకు కృతజ్ఞత తెలిపి సేనాపతియైన సెల్యూకసువెంట నడచెను.

# మధుర స్నేహము

"హెలీనా ! హెలీనా!"

లీనా బదులు పలుకలేదు.

"అమ్మా ! హెలీనా ! ఏమిటమ్మా ఆ పర ధ్యానము ?"

హెలీనా నూరు మాటాడలేదు.

"ఏమి చేయుచున్నా వమ్మా ?"

సేనాపతి సెల్యూకసు తదేక ధ్యానముతో గ్రంథ పఠనమున నిమగ్నురాలైయున్న హెలీనాను వీపు దట్టెను.

"చూడమ్మా ! మన యింటికి మంచి అతిథిని గొని వచ్చితిని."

సెల్యూకసు చంద్రగుప్తుని కుమార్తెకు జూపెను.

హెలీనా చివాలున లేచెను. ఎట్టఎదుట ధీర గంభీర మూర్తియైన సుందరయువకుడు! హెలీనా విభ్రమాశ్చ ర్యములతో నా యువకుని వీక్షించెను. అతడు సానురాగ ముగా నా జగదేక సుందరి నవలోకించెను. హెలీనా సాద రముగా రాజపుత్రుని సందర్శించెను. ప్రథమ వీక్షణముల లోనే వారి మనఃపద్మములు ప్రఫుల్లము లయ్యెను.

"రాజకుమారా! ఈమె నా ఏకైక ప్రియపుత్రిక హెలీనా. నా బంధుమిత్రాప్త వర్గ మంతయు నీమెయే! నా జీవన సర్వస్వము నీమెయే!" సేనాపతి పరిచయము చేసెను.

"ఈతఁడు మగధరాజ కుమారుఁడు హెలీనా! నా విద్యార్థిగా నీకు మిత్రుఁడుగా కొంతకాలము మన ఇంట నుండును. ఇక ఆయన సత్కార బాధ్యత నీదే" సేనాపతి కుమార్తెకు చెప్పెను.

హెలీనా మధుర మందహాసాంచిత వదనయై చంద్ర గుప్తునకు చేతులు మోడ్చి నమస్కరించెను. చంద్రగుప్తుఁ డామె ప్రణామ పద్ధతికి ముచ్చటపడి ప్రతి నమస్కారము గావించెను.

"చూడు రాకుమారా! హెలీనాకు మీ భారత భూమిపై మీ సంస్కృతిపై మీ ఆచారములపై నపరిమి తాభిమానము. మీ గ్రంథములే యిచ్చట నామెకు పరమ మిత్రములు!" సేనాపతి కుమార్తె మనస్తత్వమును వివ రింపసాగెను.

హెలీనా తండ్రిమాటల కడ్డువచ్చి వచ్చిరాని కోప మున బలికెను, "ఈ పరిచయోపన్యాసము నిట్లే సాగింతురా ఏమి! అతిథులను కొంచెము విశ్రాంతి తీసికొననిండు." మా

తల్లి మనస్సు మెత్తనయే కాని మాట మాత్రము కొంచెము కటువు." సెల్యూకసు నవ్వుచు పలికెను. చంద్రగుప్తుడు స్మితవదనుడై "అవును. చిన్నతనము గదా మతి!" అనెను. "అవును. మాకు చిన్నతనమే! మీరు మాత్రము మహావృద్ధులు!" హెలీనా తీవ్రముగా పలికి లోనికి బోయెను. "చూచితివా! రాజకుమారా! హెలీనా తనపై నొక్కమాట కూడ పడనీయదు." సెల్యూకసు చంద్రగుప్తుడు నవ్వుకొనిరి.

హెలీనా చంద్రగుప్తుల స్నేహము ప్రతిదిన ప్రవర్ధమాన మయ్యెను. పరిచయాధిక్యమున హెలీనాకు చంద్రగుప్తుని తోడి ప్రణయభావ మభివృద్ధి నొందెను. ఆమె యాతని కాహార విహారములలో నిరంతరము తోడునీడయై వర్తింపసాగెను. క్రమముగా వారిపరస్పరానురాగము నిత్యసాహచర్యమున దృఢతరమయ్యెను. సేనాపతి సెల్యూకసుకు రాజకార్యనిర్వహణమున విశ్రాంతి లేకుండెను. చంద్రగుప్తుడు తన విరామకాలములో హెలీనాకు భారతీయ సంస్కృతి సాహిత్యములను గూర్చిన మహాగ్రంథములను బరిచయముచేసెను. హెలీనా చంద్రగుప్తునకు గ్రీకుతత్త్వమును, నాగరకతావిశేషములను వివరించెను. జగత్ప్రసిద్ధములైన గ్రీకు భారతీయతత్త్వములను హెలీనా చంద్రగుప్తులు పరస్పరసహాయమున గ్రహించుకొనిరి. ఈవిధముగా కొలదిదిన

ములలోనే సమస్వభావులైన హెలీనాచంద్రగుప్తులు ప్రాణాధిక మిత్రులై నిత్యసాన్నిహిత్యమున ప్రణయ భావ పరిపూర్ణులయిరి.

చంద్రగుప్తుఁడు సెల్యూకసు సమక్షమున గ్రీకుల యుద్ధ విద్యా విధానములను సమగ్రముగా నభ్యసించెను. సేనాపతి యాజ్ఞానుసారము యవన శిబిరములలో స్వేచ్ఛగా సంచరించుచు నా సైనిక శిక్షణ పద్ధతులన్నియు గ్రహించెను. విచిత్రములైన వారి వ్యూహ రచనా విషయములు తెలిసికొనెను వివిధాయుధ నిర్మాణములను బరిశీలించెను. శస్త్రాస్త్ర కళా కౌశలము నవలోకించెను. అనతి కాలములోనే భారతీయ సమర కళా పాండిత్యముతోబాటు గ్రీకు యుద్ధ ప్రావీణ్యము నార్జించి చంద్రగుప్తుడు సఫలీకృత మనోరథుఁడయ్యెను.

ఇప్పుడాతనికి మగధరాజ్య సంపాదనము సులభసాధ్యమని తోచినది ఆచార్యపాణిని యాదేశాను సారముగా తానిప్పుడు మగధ దేశమున కేగి చాణక్య దర్శనము చేసికొనవలెను. అనంతరము మిత్రరాజ సహాయ సంపద నార్జించుకొనవలెను. తన యెడల సుముఖమై యున్న ప్రజాభిమానమును సుదృఢము గావించుకొనవలెను. అప్పటికి గాని తన చిరకాలవాంఛిత మీడేరదు. తనరాజ్యలక్ష్మితనకుదక్కదు. అవును! తానిప్పుడు మగధాధిపుఁడుకాక తప్పదు. కాని... తానిప్పుడు నిశ్చింతగా బయలుదేరలేకున్నాడు. తన హృద

యము హెలీనాతోడి వియోగమునకు బరితపించు చున్నది. తానేమి చేయవలెను? అయినను తప్పదు. తాను హెలీనా కోసము కర్తవ్య విముఖుఁడు కారాదు-చంద్రగుప్తుని మానసము బహుభావతరంగితమగు చుండెను.

అంతలో నలెగ్జాండరు తన సైనికుల యొత్తిడికి తట్టుకొనజాలక భారత విజయ ప్రయత్నమును విరమించుకొని, స్వదేశ ప్రయాణమునకు సన్నాహములు పూర్తికావించెను. గ్రీకు సైన్యముల తిరోగమనము ప్రారంభమైనది.

ఆనాడు హెలీనా మనస్సు మనస్సులోలేదు. ఆమె చంద్రగుప్తవియోగమును దలచుకొని లోలోన కుమిలిపోవు చుండెను. మూర్తీభవించిన శోకమువలె నొకమూల గూర్చుండి యున్న కుమార్తెను జూచి సేనాపతి సెల్యూకసు కలవరపడెను. "ఏమి తల్లీ! అట్లున్నావు! స్వదేశగమనమునకు మన వారందరు మహానందపడు చుండగా నీ విట్లున్నా వేమి తల్లీ!" తండ్రి కుమార్తెను బరామర్శించెను. హెలీనా కన్నీరు తుడుచుకొని "ఏమియులేదు నాన్నగారూ! ఈ సుందరదేశము ఈ - రమణీయ ప్రకృతి - ఇంతతొందరగా విడిచిపోవలసి వచ్చినదేయని బాధగా నున్నది. అంతే ! అంతే!" అని పలికెను.

సేనాపతి కామె యాంతర్యము అర్థము కాలేదు. ఆయన కుమార్తె నోదార్చుచు "ఎంత మెత్తని మనసమ్మా

నీది! అయినను నీ యల్పకాలిక పరిచయమునకే యీ దేశముమీద నింత యభిమానమా? సరే దైవ మనుగ్ర హించినచో మనము మరల నిచ్చటకు రాగూడదా? ఈ దేశమును దర్శింపగూడదా? దానికేమిగాని తల్లీ! లేచి సన్నాహములన్నియుఁ ద్వరితముగా బూర్తి చేయుము. ప్రయాణ సమయమైనది.” అని పలికెను. ఆ తండ్రి కూతుల పలుకులు విన్న చంద్రగుప్తునకు భిన్నార్థములు స్ఫురించెను. ఆతఁడు కన్నెత్తి హెలీనావంక చూచెను. సజల నయనము లతో నాతనివైపు చూచుచున్న హెలీనా ముఖము త్రిప్పు కొనెను. చంద్రగుప్తుడు గుండె దిటవు చేసికొని యొక్క వేడి నిట్టూర్పు విడచి లేచి నిలచెను.

అంతకాలముగా తనకు సాదరముగా నాతిథ్యమిచ్చి సత్కరించి యుద్ధవిద్యా విశేషములు నేర్పినందులకు అతడు యవనసేనాపతికి కృతజ్ఞత తెలిపెను. సేనాపతి సెల్యూకసు చంద్రగుప్తునికి శుభాకాంక్షలు దెలిపి హెలీనాతోబాటు స్వదేశమునకు పయనమైపోయెను. చంద్రగుప్తుఁడు చాణక్య సందర్శనార్థమై మగధమార్గమును బట్టెను.

# మహాశపథము

అది యాషాఢమాసము. మిట్టమధ్యాహ్నమైనది. చండభానుఁడుదుర్నిరీక్ష్యుఁడై దిఙ్మండలమున నగ్నికణములు గురియుచుండెను. మండుటెండకు ప్రకృతియంతయు నట్టుడికి నట్లుడికి పోవుచుండెను.

ఆ ప్రచండాతపములో భానుసమానతేజుఁడు, సువిశాల ఫాలభాగుఁడు, రూపుదాల్చిన బ్రహ్మవర్చసమో యన నొప్పు నొక మహామహుఁడు పాటలీపుత్రము పొలిమేరలో నడచి వచ్చుచుండెను. ఆయన మెడలో రుద్రాక్షమాలలు ప్రకాశించుచుండెను. నుదుట విభూతిరేఖలు తీర్చి దిద్దినట్లుండెను. కర్ణముల మకరకుండలములు కాంతులు జిమ్ముచుండెను. వక్షఃస్థలమున యజ్ఞోపవీతము విరాజిల్లుచుండెను. దక్షిణహస్తమున నేదియో యొక మహాగ్రంథము శోభిల్లుచుండెను. శిరస్సుపై గోష్పాదమంతజుట్టు, భ్రూమధ్యమున కుంకుమబొట్టు వెలుగుచుండెను. ఆయన సునిశితవీక్షణములు తదీయ మేధావైభవమును, దూరదర్శకత్వమును, కార్యదక్షతను జాటుచుండెను.

ఆ మహామహుఁ డొక్కింతసేపు నగరోపకంఠమున నున్న తటాకము నొడ్డునగల వటవృక్షము క్రింద నాసీనుఁడై

సూర్యాయాసము సహనయించుకొనెను. అల్లంతదూరములో పాటలీపుత్రము నేత్రపర్వముగా గాన్పించుచుండెను. ఆయన యంతరంగమున భావతరంగము లేవియో పొంగి పొరలెను. తక్షశిలా విద్యాలయమున గురుదేవుం డొనర్చిన మహోపదేశము మాటిమాటికి అతని చెవులలో ప్రతిధ్వనింపసాగెను. యవనేశ్వరుండైన యలెగ్జాండరు చక్రవర్తి యపారసేనావాహినితో భారతావనిపై దండెత్తి వచ్చుచున్నాడు. భారతదేశమందలి రాజులందరు పరస్పర వైషమ్యములతో బలహీనులై యున్నారు. భయమున కొందఱు, నయమున కొందఱు, లోభమున కొందఱు, యవనేశ్వరుని యడుగులకు మడుగులొత్తుచున్నారు. క్రమముగ యవనులొక్కొక్క రాజ్యమును స్వాధీనము జేసికొనుచున్నారు. ఈ దురాక్రమణము నరికట్టవలెను. జీర్ణమై సంకీర్ణమై పోవుచున్న పవిత్ర భారత సంస్కృతి నుద్ధరింపవలెను. వైదిక ధర్మప్రతిష్ఠాపనము గావింపవలెను. తన ప్రతిభాసామర్థ్యము. రాజనీతి వైదుష్యము సార్థకమగునట్లుగా బలిష్ఠమైన మహాసామ్రాజ్యమును స్థాపింపవలెను. అందుల కన్నివిధముల పాటలీపుత్రమే తగియున్నది. సుస్థిరమైన మగధసింహాసనముపై భారత రాజ్యలక్ష్మిని నెలకొల్పవలెను. ఈ మహాకార్యమునకు పాటలీపుత్ర మెంతవరకు తనకు సహాయపడునో! తదీయ పరిపాలకులైన నందరాజులు తనతో నెట్లు సహకరింతురో! తాను గురుదేవునకు వాగ్దానము చేసివచ్చినాఁడు. హైందవధర్మ సంరక్షణము, సుస్థిర సామ్రాజ్య సంస్థాపనము నను నీ రెండు

మహాకార్యములు సాధింపనలెను అంతవఱకు తనకు శాంతి లేదు. విశ్రాంతిలేదు. ఒకే ఒక వ్యక్తికి, బుద్ధి సంపదతప్ప మఱొక తోడెఱుఁగని వానికి, రాజనీతి తంత్రము తప్ప రాజాశ్రయములేనివానికి అంతటి మహాకార్యములు సాధ్యములా? ఆయన లేచినాఁడు. తటాకములో స్నానము చేసినాఁడు. ధౌతవస్త్రములు ధరించినాఁడు. పాటలీపుత్ర మహానగరమును ప్రవేశించినాఁడు. నగరమంతయు మేళతాళములతో మాఱుమ్రోఁగుచున్నది.

ఆనాఁడు ధననందుని జన్మదినోత్సవము. రాజవీధులు రమణీయముగా నలంకరింపబడినవి. రంగు రంగుల మణి తోరణములు కన్నులకు మిఱుమిట్లు గొల్పుచున్నవి. భవనోపరి భాగములందు పతాకము లెగురుచున్నవి. ఆయన నగర మధ్యమును జేరినాడు. ఎటు చూచినను విలాసములే! వినోదములే! విందులే! జనసందోహములే! ఆయనకు మార్గాయాసముతో బాటు క్షుద్బాధయు మెండైనది. ఆయన తిన్నగా రాజప్రాసాదములోని కేగినాడు. ఆ ప్రక్కనగల భోజన శాలలో నిర్భయముగా బ్రవేశించినాఁడు.

అప్పటికే వడ్డన పూర్తియైనది. కదళీపత్రములు బారులు బారులుగా పరువబడియున్నవి. నడుమనొక ప్రత్యేక ప్రదేశమున నెనిమిదిస్వర్ణపత్రములును, వానికెదురుగ సువర్ణ పుష్పయుతమైన రజతపత్రమును విరాజిల్లుచున్నవి. బ్రాహ్మ

ణుఁడు నిస్సంకోచముగ వెళ్ళి స్వర్ణపుష్పయుతమైన రజత పత్రము నొద్దనున్న పీఠముపై నుపవిష్టుఁ డయ్యెను. రాజ బంధువులాయాగంతుకుని వింతయాకృతిని గాంచి పరిహాస మొనర్చుచు "ఈ పీఠము వేదవేదాంగవేత్తలైన రాజపురో హితులకై యుద్దేశింపబడినది. సాధారణబ్రాహ్మణు లెవ్వ రును గూర్చుండుటకుగాదు. లెమ్ము లెమ్ము. ఆవలికి బొమ్ము. ఆ మూల కూర్చుండుము." అని పలికిరి. వారి వచనముల నాయన వినియు విననట్లూరకుండెను.

ఇంతలో నందరాజులు రాజగురువుతోగూడి భోజన శాలను ప్రవేశించిరి. వెండి యాకునకు ముందు గూర్చుండి యున్న నూతన వ్యక్తిని జూచినంతనే మహారాజగు ధననందు నకు పట్టరాని యాగ్రహము కలిగెను. "ఎవరు నీవు? ఎచ్చట నుండి వచ్చితివి? ఇచ్చట గూర్చుండుటకు సర్వశాస్త్ర పారంగతుఁడైన ప్రజ్ఞానిధికి మాత్రమే యోగ్యత కలదని యెరుగవా? నీవంటి యల్పుల కట్టి యర్హతలేదు. లెమ్ము" అని గద్దించి పలికెను. నందరాజు పలుకు లాయన చెవులకు ములుకులై సోకినవి. రాజబంధువుల నిందావాక్యములచే కుపితుడై యున్న యాతనికి నందుని తిరస్కృతి యగ్నిపై గుగ్గిలము చల్లినట్లయినది. ఆయన యుచ్చైస్స్వరముతో "అవును. ఇచ్చట గూర్చుండుటకు మాకును యోగ్యత యున్నది. కనుకనే యిందుపవిష్టులమైతిమి! మేమును వేద వేదాంగ పారంగతులమే. సమస్తశాస్త్రకోవిదులమే.

తక్షశిలా మహావిద్యాలయములో శిక్షణము పొందిన మహా విద్వాంసుడీ చాణక్యుడీ మాత్రపు గౌరవమున కర్హుడు కాకపోడు." అని పలికెను.

చాణక్యుని మేఘ గంభీర వాక్యములకు నందులు విస్మితులైరి. రాజబంధువులు నిశ్చేష్టులైరి. నందరాజునకు ఒడలు మండినది. చాణక్యుని సాహంకారవచనములు రాజ ధిక్కారముగ నాతనికి తోచినవి. వెంటనే నందరాజు పీఠముపై గూర్చుండియున్న చాణక్యుని సిగబట్టి యొక్క గుంజు గుంజినాడు. సేవకులను రావించి "ఈ తుంటరిని మెడ బట్టి గెంటు" డని యాజ్ఞాపించినాడు. మిగిలిన నందులు పండ్లు పటపట కొఱుకుచు చాణక్యునివైపు చుఱచుఱ జూచిరి.

రాజాజ్ఞ నిర్వర్తింపబడినది. రాజభటులు చాణక్యుని సిగబట్టి బలవంతముగా బయటకు ద్రోసివైచిరి. చాణక్యుడు క్రోధావిష్టుడయ్యెను. తనకు జరిగిన ఘోరావమానమున కాయన తోకద్రొక్కిన త్రాచుపామువలె నదరిపడినాడు. ఆయన కన్నులు రోషకషాయితములైనవి. ఆయన హృదయమున వేయి యగ్నిగోళము లొక్కమాటుగా పెటిల్లుమని ప్రేలినవి.

ఆయన రౌద్రమూర్తియై " ఓరి క్షుద్రుడా! ఓరీ నీచరాజ బంధువులారా! మీ పాప భాండము బ్రద్దలగు కాలము చేరువయైనది. మీ మచ్చరము పెచ్చు పెరిగిపోయి

నది. మీ యధర్మము మితిమీరిపోయినది. మీరు చేసిన యీ బ్రాహ్మణ పరాభవము వ్యర్థముగాపోదు. సరవభాజనుండైన నొక మహా పండితుని భోజన సమయమున ఘోరముగా నవమానించిన పాపాత్ములు మీరు. మీకు వినాశకాలము దాపురించియే యీ విపరీతబుద్ధి పుట్టినది. మీరు ప్రజాకంటకులు లోకకంటకులు. మీ కాయుష్షులు చెల్లినవి. మిమ్ముగూర్చి మేము విన్న మాటలన్నియు ప్రత్యక్షీభూతములైనవి. ఇక మీ యహంకారమును నేలమట్టము గావించెదను. మీరు ప్రభుత్వ నిర్వహణమున కర్హులుకారు. మిమ్ములను మీ వంశమును ధ్వంసముచేసి వైచెదను. మీ పితృదేవతలకు పిండముపెట్టు దిక్కులేకుండ చేసెదను. ఇదియే నా ప్రతిజ్ఞ! ఈ మహా ప్రతిజ్ఞ నెరవేర్చిన యనంతరమే వీడిపోయిన ఈ నా సిగను తిరిగి బంధించుకొందును. అంతవఱకు ముష్కర కరస్పర్శచే విముక్తమైన ఈమహాశిఖ మీపాలిటి కాలసర్పమై హాలాహలమును విరజిమ్ముచుండును. ఇదియే చాణక్యుని భీష్మ ప్రతిజ్ఞ. దీనికి తిరుగులేదు.'' అని చాణక్యుడు కన్నుల నిప్పులు గ్రక్కుచు చరచర నడచిపోయెను. బ్రాహ్మణావమాన పంకిలమైన యా భోజనశాలలో నింక గూర్చుండరాదని యుపవిష్టులైయున్న బ్రాహ్మణు లందఱు లేచిపోయిరి. నందరాజులు విభ్రాంతులైరి.

# ఆశ్రయ లాభము

రాజ తిరస్కార పరాభవ దందహ్యమాన మానసుఁడైన చాణక్యుఁడు తోకత్రొక్కిన మహా భుజంగమువోలె విషవాయువులను గ్రక్కుచు పాటలీపుత్ర నగరమును వీడి యరణ్యమార్గమున నొంటరిగ నడచిపోవుచుండెను. చెట్లులు, పుట్టలు, గుట్టలు ఒకదానివెంట మరొకటి దాటిపోవుచుండెను. చాణక్యున కవియేమియు గోచరించుటలేదు. 'ప్రతీకారము, ప్రతీకారము' అను యంతర్వాణి ప్రబోధము తప్ప ఆయనకు మరొక తలంపులేదు. అవమాన స్మరణముతో ఆయన మాటిమాటికి క్రుద్ధుఁడై పోవుచుండెను. మహా పండితుడును, లోకహితైషియు, మగధరాజ్యమున నసామాన్యుఁడైన తనకే యిట్టి దుర్దశ ప్రాప్తించినదే? ఇక ప్రజాజీవనమెంత భయంకరముగా నున్నదో? కుడిచి కూర్చుండక యకారణముగా నందులు తనపై చేయి జేసికొనుటయా? నిద్రించుచున్న సింహమును కదిపి కవ్వించినట్లున్నది! అలనాడు ద్రౌపదీ మహాసాధ్వి నవమానించి యామె కోపానలమున భస్మమైపోయిన కౌరవ సంతతివలె, ఈ నందరాజులు మదీయ కోపాగ్నిలో శలభములవోలె భస్మీభూతులు కాకతప్పదు. ఇది తప్పదు. ఈ విధముగా చాణక్యుఁ డేమియో నాలోచించుకొనుచు చకచక నడచిపోవుచుండెను.

పరాధీనమనస్కుఁడై నడచుచున్న ఆయన పాదమున నాకస్మికముగ నా ప్రక్కనున్న దర్భముల్లు గ్రుచ్చుకొనెను. చాణక్యున కొడలు మండినది. తత్క్షణమే యాయన యా కంటకము నూడబెరికెను. "ఓసీ! పాపిష్ఠిదానా! నీవుగూడ నే నలుసైతినా? నా పాదమున గ్రుచ్చుకొందువా? ఉండుము నీ మద మణగింతును. నీ నామరూపములులేకుండ జేసెదను. నిన్ను మసిచేసి త్రైచెదను. ఈ చాణక్యుఁ డనగా నెవ్వరో సుంత నిరూపింతును." అని పలికి, ఆయన యా దర్భ ముల్లు నలిపి మసిచేసి. చేతనున్న కమండలూదకమున కలిపి గటగట త్రాగివైచెను.

ఈ విచిత్రదృశ్యము నల్లంతదూరము నుండి వీక్షించు చున్న చంద్రగుప్తుఁడు విస్మయపడుచు నాయనను సమీపించి "ఎవరు స్వామీ మీరు? ఈ యకాలమున మీ రెచ్చట నుండి ఎచ్చటికి కేగుచున్నారు? మీ కార్య మత్యంత విచిత్ర ముగా నున్నది! తమ నామాదికములు తెలిసికొనవచ్చునా?" యని వినయముగా నడిగెను.

చాణక్యుఁ డాతనివంక నెగాదిగ చూచి, "నేనా! నేను దుష్టశిక్షణకై ప్రయత్న మారంభించిన ఒకానొక బ్రాహ్మణుఁడను! శత్రు సంహార కార్యమున కరాళ కాల సర్పమును! నన్నర్థ విదులు 'చాణక్యుఁ' డందురు. తంత్రజ్ఞులు

'కౌటిల్యు' డందురు. ఇక సామాన్యులు 'విష్ణుగుప్తు' డందురు." అని బదులు చెప్పెను

ఆ తేజోమూర్తియే చాణక్యుడని తెలియగానే చంద్రగుప్తుడు మహానందమందెను. ఆతడాయన పాదములపై వ్రాలి "మన్నించు గురుదేవా! వెదుకబోయిన తీగ కాలికి దగిలినట్లైనది. ఇంతవరకు అజ్ఞానమున మిమ్ము గుర్తింపనైతిని. ఇదే తమ పాదములను శరణుగోరుచున్నాను. పాణిన్యాచార్యుల ఆజ్ఞానుసారము నేను మీ సందర్శనము కొఱకే వచ్చుచున్నాను. మదోన్మత్తులైన నందరాజులచే దేశనిర్వాసితుడనైన మౌర్యచంద్రగుప్తుడను నేను! పితృవంచితుడను! ఇక నా దేహ ప్రాణములు మీ యధీనములు! నేను మీ యాజ్ఞానువర్తిని" అని పలికెను.

సుదీర్ఘదేహుండు, సువిశాల వక్షఃస్థలుండు, ఆజాను బాహుండు, తేజోవిరాజితుండు, వినయశీలుండు, ఆచార్య ప్రేషితుడునైన చంద్రగుప్తుని గాంచి చాణక్యుడు సంతోష పరవశుడయ్యెను. తన ప్రతిజ్ఞానిర్వహణకై దైవమే యాతనిని తనయొద్దకు పంపెనని యాయన భావించెను. ఆయన ప్రశాంత గంభీరకంఠముతో "మంచిది రాకుమారా! సరియైన సమయమునకు వచ్చితివి. నాకిప్పుడు నీవంటి రాజపురుషుని యవసర మెంతయో యున్నది. ఇకనుండి నీవు నా శిష్యుడవు! భావిభారత సామ్రాజ్యపథము నీది! నందుల

దుష్టప్రవృత్తి పెచ్చు పెరిగిపోయినది. వారు ప్రజాభిమాన మును గోల్పోయినారు. ఆ పాపాత్ములకు సర్వనాశనము తప్పదు. నా క్రోధాగ్నిలో నందవంశము నిర్మూలమగుట తథ్యము. నీవు ప్రథమ భారత సామ్రాజ్యాధినేతవై, హైందవ ధర్మసంరక్షణ సంధాతవై భవిష్యద్భారత చరిత్రలో సుప్రసిద్ధుఁడవు కాగలవు! ఇఁక ఆ భారము నాది. ఇదే ఆర్యచాణక్యుని అభయము." చంద్రగుప్తుని వెన్నుదట్టి మహాప్రభావమహితుఁడైన చాణక్యుఁడు మక్కువమీర నాశీర్వదించెను. గురుశిష్యుల ముఖమండలములపై నూత్న కాంతులు ప్రసరించెను.

చాణక్యుఁడు గంగాతీరము వెంట గబగబ సాగి పోయెను. "చంద్రగుప్త శౌర్యాగ్నికి చాణక్యమంత్రమారుతము తోడైనది. ఇక నందవంశము భస్మీభూతము కాక తప్పదు." చంద్రగుప్తుఁడు సంతుష్టభావముతో గురుదేవు ననుసరించెను.

# సమరసన్నాహము

చాణక్య చంద్రగుప్తులు మగధరాజ్య సేనాపతులతో రాజోద్యోగులతో రహస్యముగా మైత్రికూర్చుకొని నంద విధ్వంసనమునకు, వారి యామోదమునుసంపాదించిరి. దురాచార పరాయణుఁడైన నందరాజు ప్రభుత్వమును గూలద్రోయుటకు ప్రజాభిప్రాయమును గూడ అనుకూలము జేసికొనిరి. చంద్రగుప్తాభిమానులైన కళింగాంధ్ర కామరూప పాంచాల కిరాతపతులు నంద విధ్వంసనమునకు సైన్య సహాయము చేయుటకై సంసిద్ధులై యుండిరి. ఆ విధముగా చాణక్యుడు తన మేధాబలమున ననేక ప్రభువుల సహాయ సహకారములు సంపాదించి, చంద్రగుప్తునితోఁ గూడి నేపాళ దేశాధిపతియగు పర్వతక మహారాజు ప్రాపుగోరి మంజుపట్టణమునకు బయలుదేరి పోయెను.

నేపాళపతి పర్వతేశ్వరుడు మహాబల సంపన్నుఁడు. శక్తిమంతులైన కులూతదేశాధినేత చిత్రవర్మ, మలయభూపతి సింహనాదుఁడు, కాశ్మీరపతి పుష్కరాక్షుఁడు, సింధుదేశాధీశుఁడు సింధుసేనుఁడు, పారశీకాధినాధుఁడు మేఘుఁడు పర్వతరాజునకు సామంతులై యుండిరి. వీరాధివీరులైన యనేక శబరనాయకులు, మెఱికలవంటి మ్లేచ్ఛవీరులు సైతమాతని కధీనులై యుండిరి. అట్టి జగజెట్టి, మహాబలశాలియైన

పర్వతేశ్వరుని సాయము దొరకినచో నంద నిర్మూలనము 'నల్లేరుపై బండి నడక' యగునని చాణక్య చంద్రగుప్తులు సంభావించిరి. అందువల్లనే తప్పనిసరిగ పర్వతేశ్వర మైత్రి జరిగితీరవలెనని నిశ్చయించుకొనిరి.

గురుశిష్యులు మంజుపట్టణములో పర్వతేశ్వరుని సందర్శించిరి. పర్వతక మహీపతి కార్యార్థులై వచ్చిన చాణక్య చంద్రగుప్తులను సముచితముగా నాదరించి సత్కరించెను. చాణక్యుడు పర్వతేశ్వరునికి తామువచ్చిన పని దెల్పెను. పర్వతకుఁడు తన యపారసేనావాహినితో మౌర్య చంద్రగుప్తుని కండగా నిలచి మగధరాజ్యముపై దండెత్తి వచ్చినచో నంద వధానంతరము చంద్రగుప్తుఁడతని కర్థ రాజ్యమిచ్చి సమ్మానించునని చాణక్యుఁడు వాగ్దానము చేసెను. మగధమంత్రులు, సేనాధిపతులు, రాజోద్యోగులు నగు బలగుప్త, భాగురాయణ, వక్రనాసాదులు చంద్రగుప్తానుకూలురని వివరించెను. పరిసర ప్రాంత ప్రభువు లనేకులు చంద్రగుప్తాభిమానులని ప్రకటించెను. ప్రజలందఱు చంద్రగుప్తాభ్యుదయాభిలాషులని విశదీకరించెను. చంద్రగుప్త విజయము, స్వదేశగౌరవమును గాపాడి విదేశీయ దురాక్రమణమును విచ్ఛిన్నము జేయుట కవసరమని ఉద్బోధించెను. చంద్రగుప్తునికి తోడ్పడుట ధర్మకార్యమేకాక ప్రయోజనకరమును నగునని స్పష్టపరచెను.

పర్వతక మహీపతి యాలోచించెను. 'నందరాజుల దుష్పరిపాలనము జగద్విదితమైనది. బహుకాలముగా బల సంపన్నమై సుప్రశస్తమైన మగధరాజ్యము తనకుఁ గూడ మనశ్శల్యమై యున్నది. అన్యవిషయము లెట్లున్నను ఆక స్మికలాభకరముగా తనకు వచ్చిన ఈ యవకాశమును తాను విడిచిపెట్టరాదు. ముందుగా తాను చంద్రగుప్తునికి సాయము చేసి నందరాజ విధ్వంసనము గావించినచో ననంతరము నవ నాయకమైన మగధరాజ్యమును తాను సులభముగా నధీ నము చేసికొని ఆర్యావర్తనమునకెల్ల సార్వభౌముఁడు కావ చ్చును మగధరాజ్యము తన చేఁజిక్కెనా తానింక జీవిత ములోఁ గోరదగినది లేదు' అని పర్వతేశ్వరుఁడు భావించు కొనెను.

అతఁడు వెంటనే సోదరుఁడైన వైరోచకునితో కుమా రుఁడైన మలయకేతువుతోఁను రహస్యముగా మంత్రా లోచనము గావించెను. వైరోచక మలయకేతువులు పర్వత రాజు భావమును సమర్థించిరి. అనాయాసముగా ననతికాల ములో నమూల్యమగు మగధరాజ్య సింహాసనము తమ కధీనమగుట తప్పదని నిశ్చయించిరి. పర్వతరాజు సైన్య సమేతముగా మగధపై దండెత్తివచ్చుట కంగీకరించెను. చాణక్య చంద్రగుప్తులు సఫల ప్రయత్నులైరి.

దండయాత్రకు సర్వమును సంసిద్ధమైనది. చంద్రగుప్తాభి మానులైన యనేక భూపతులు సేనాసమేతులై పర్వతరాజుతో

గలియవచ్చిరి. పర్వతేశ్వరుడు సముద్రాంత సామంతమండ లితో మహాబల సమన్వితుఁడై యుద్ధయాత్రసాగించెను. అసంఖ్యాక సేనాసమూహముతో చంద్రగుప్తుడు పురోగ మించుచుండెను. చాణక్య బుద్ధిబలముతోఁబాటు శక యవన కిరాత కాంభోజ బాహ్లీక మహాసైన్యములు ప్రళయకాలో ద్వేగ్న మహాసముద్రమువలె మగధరాజధానియగు పాటలీ పుత్రమును ముట్టడింపఁగలవు.

ఆవార్త యానాఁటి యుదయమే నిరంతర భోగలాల సులైయున్న నందరాజులకుఁ జేరినది. కాని కర్తవ్య మూఢు లైన నందులు వెనువెంటనే ప్రతిఘటన ప్రయత్నములు గావింపలేదు. చాణక్య ప్రేరితుఁడైన క్షపణక జీవసిద్ధి వారిని జేరి రాజ్యరక్షణ బాధ్యత యంతయు నమాత్య రాక్షసునిదేయనియు, ప్రభువులు తమ విలాసవినోదములు విరమించుకొని స్వయముగా నందులకు బూనుకొనన నక్కర లేదనియుఁ బలికి వారికి యుద్ధము నెడ నుపేక్షాభావమును గల్గించెను.

జీవసిద్ధి పూర్వనామము "ఇందుశర్మ". ఆతఁడు చాణక్య ప్రేరణమున క్షపణక వేషధారియై పాటలీపుత్ర ప్రాంతారామవాసియై మహాద్భుత మంత్ర తంత్ర విద్యా ప్రవీణుఁడని పేరు పొంది రాక్షస మంత్రి యభిమానమును సంపాదించినవాడు. రాక్షస మంత్రిమూలమున నందులతోఁ బరిచయముగల్పించుకొని వారిమనస్సున కెక్కియున్న వాఁడు.

శుక్ర సంపత్తిలో, అఱువదినాలు గంగముల జ్యోతిశ్శాస్త్రములో ప్రవీణుఁడైన వాడు. చాణక్య మంత్ర తంత్రములను నిర్వీర్యముచేసి నందరక్షణము గావింతునని వాగ్దానము చేసి యున్న వాఁడు. బహుకాలముగా నందరాజులకాయురారోగ్య భాగ్య భోగ్య ప్రదాయకములైన జపహోమ క్రియా ప్రయోగములను గావించుచున్నట్లు నటించుచు వారి విశ్వాసమునకుఁ బాత్రుఁడై యున్న వాడు. అతఁడప్పుడప్పుడు నంద రాజులకు మహాఫలదములని చెప్పి మంత్రౌషధ ప్రయుక్తములైన యుదకములిచ్చి వ్యాధి బాధలు కల్పించెడివాడు. అవియెల్ల చాణక్య మంత్ర ప్రయోగ ఫలములని నమ్మించి వానికి విఱుగుడు చేయుదునని చెప్పి మజల సముచితౌషధ ప్రయుక్తములైన మంత్రోదకము లిచ్చి సర్వబాధలను నివారించెడివాడు. బహువిధములైన భయంకర కృత్యములతో నందులకు పిశాచపీడ గల్గుచున్నట్లు గల్పించి దానిని దొలగించితినని ధైర్యము చెప్పి యూరడించెడివాఁడు. క్రమముగా జీవసిద్ధి తన బుద్ధి చాతుర్యముచేత సంధి విగ్రహాది రాజకీయ కార్యకలాప నిర్ణయములలోఁగూడ తన మాట చెల్లునట్లు నందరాజులను వశపరచుకొనియుండెను. జీవసిద్ధి యొక్కఁడే చాణక్య తంత్రములకుఁ బ్రతిక్రియ గావింప గలవాఁడని నమ్మికొనియున్న నందరాజులు నిరంతర మాతని మాట మన్నింపసాగిరి. ఆ విధముగా శుభాశుభ పరిణామ నిరూపణములో, యుక్తాయుక్త కార్య విచక్షణములో జీవసిద్ధి మాటయే వారికి వేదవాక్యమయ్యెను.

ఆ జీవసిద్ధి యిప్పుడీ విపత్కర సమయములో నంద రాజు రణావేశమును తన కపట వాక్యములతోఁ జల్లార్చి వైచెను. మగధరాజ్య రక్షణమునకు సేనాబల ప్రయోగ ముతో బనిలేదనియు, తన మహా మంత్ర బలముతో శత్రు సైన్యములను మారణహోమము గావింతుననియు నందరాజు నకు ధైర్యము చెప్పెను. అంతియేకాక అది యాషాఢమాస మగుటచే వారి కరిష్టదాయకమైనదనియు, యుద్ధమున కది తగిన సమయము కాదనియు భయపెట్టెను. అంతగా నవసర మైనచో నాల్గుదినముల తర్వాత వారికి శుభగ్రహ బలము సిద్ధించినప్పుడు, వారు నిర్భయముగా రణరంగములోఁ బ్రవే శింపవచ్చునని ప్రబోధించెను. ఇప్పుడు తనమాట పాటింపక నందరాజులు యుద్ధమునకు సన్నద్ధులైనచో వారికి మృత్యు యోగము తప్పదని హెచ్చరించెను. శత్రుసేనలు తన మంత్ర బల బంధితములై పాటలీపుత్రమునకు దూరముగా నుండ వలసినదేగాని నగర ప్రవేశము మాత్రము చేయజాలవని పలికెను. ఈ పరిస్థితులలో ప్రభువులు తాము తలపెట్టు కొన్న నందనవన విలాసవిహారమును హాయిగా జరిపివచ్చి యనంతర మవసరమైనచో యుద్ధరంగమునఁ బ్రవేశింప వచ్చునని సూచించెను.

నందరాజులకు జీవసిద్ధి హితవు నచ్చినది. ఆతని మంత్రశక్తిపైగల విశ్వాసము, తమ స్వభావసిద్ధమైన భోగ లాలస, వారిని యుద్ధ విముఖులనుజేసి వన విహారమునకు ప్రోత్సహించినవి. నందరాజులు మందబుద్ధులై తాము

ముందుగా నిర్ణయించుకొన్న ప్రకారము విలాసినీ జనముతో నందనవనమునకు వినోద విహారమునకై పోయిరి.

తెల్లవారుసరికి చాణక్య పర్వతు లొకవైపునను చంద్రగుప్త కిరాతరాజులు మఱియొకవైపునను మహాసైన్యములతో వచ్చి పాటలీపుత్రమునుముట్టడించిరి. శత్రుసైన్యము లాకస్మికముగా పాటలీపుత్రమును ముట్టడించిన సంగతి రాక్షసమంత్రికి దెలియవచ్చినది. ఆయన యీ విపత్కర పరిస్థితికి కలవరపడెను. నందరాజు నగరమున లేనప్పుడు రాజ్యమున కీ మహాప్రమాద మేర్పడినది. తాను తత్క్షణమే రాజ్యరక్షణమునకుఁ బూనుకొనవలెను. రాక్షసమంత్రి సేనాశిబిరమునకు బయలుదేరెను.

అంతలో నొక వార్తాహరుఁ డరుదెంచెను. ఆతఁడు నందనవనమునుండి నందరాజు రాక్షసమంత్రికి వ్రాసి పంపిన యొక రహస్యలేఖ గొనివచ్చెను. రాక్షసమంత్రి లేఖ నంది యిట్లు చదువుకొనెను. "మహామాత్యా! రాజ్యము విపత్కర పరిస్థితిలోనున్నది. మాకు మీకుగూడ మహోపద్రవ మాసన్నమైనది. మీరు వెనువెంటనే నందనవనమునకువచ్చి మమ్ము గలిసికొనవలెను."

రాక్షసమంత్రి యాలోచనాయత్తుఁ డయ్యెను. ఆలేఖ కూటనీతి నిపుణుడైన చాణక్యుని సృష్టియని రాక్షసమంత్రి

గ్రహింపలేకపోయెను. ఆయనహృదయమున ద్వైధీభావము చెలరేగెను. ఇప్పుడు తాను రాజరక్షణకై ముందుగా నందన వనమునకు బోవలెనా, రాజ్యరక్షణకై సేనా శిబిరమునకు బోవలెనాయని యాయన యాలోచించెను. తాను ముందుగా సేనాపతిని గలిసికొని కర్తవ్యాలోచనము గావించి, వెను వెంటనే నందనవనమును జేరుకొందునని వార్తాహరునికి చెప్పి పంపెను.

రాక్షసామాత్యుఁడు సేనా శిబిరమును జేరుకొనెను. అతఁడు పోవుసరికి చంద్రగుప్తాభిమానియగు మగధ సేనాపతి భాగురాయణుఁడు ప్రశాంతముగా శిబిరమునఁ గూర్చుండి యుండెను. రాక్షసమంత్రి నిశ్చలముగా నిర్విచారముగా గూర్చుండియున్న సేనాపతి భాగురాయణునిజూచి యాశ్చర్య పడుచు "ఏమి సేనాపతీ! శత్రుసైన్యములు పాటలీపుత్రము నాక్రమించుకొనుచుండగా నీ విచ్చట గోళ్ళు గిల్లుకొనుచు నూరక కూరుచున్నావా ?" అని తీవ్రముగాఁ బ్రశ్నించెను.

భాగురాయణుఁడు : ఊరక కూరుచున్నది నేనా ? మహామాత్యా? తాము చెప్పకముందే మన మహాసైన్యము యుద్ధరంగమునకు సాగిపోయినది. అది తెలిసికొనకుండ తామంతగా నాందోళన పడుచున్నారు !

రాక్షసమంత్రి : అదేమి? సేనాపతి లేకుండ సైన్య మెట్లు సాగిపోయినది ?

భాగురాయణుఁడు : సాగిపోయినది! ఆ పనికిఁజాలిన పర్వతరాజును జయించుటకు స్వయముగా నీ మగధరాజ్య మహాసేనాపతి పోనక్కరలేదు. చిల్లరసైన్యములు చాలును. ప్రమోదవనములో ప్రభురక్షణము మొదలు ప్రమాదకాలములో రాజ్యరక్షణమువరకు నన్ని పనులు సేనాపతియే చేయనక్కరలేదు. మీరు చింతపడకుఁడు. అంతయు ననుకూలమే యగును. ఆ విషయమటుంచి మీరు రాజ రక్షణాద్యన్య విషయము లేవైన నాలోచింపవలెనేమో చూడుఁడు.

సేనాపతి మాటలు వినునప్పటికి రాక్షసమంత్రికి బట్టరాని కోపము వచ్చెను. ప్రభురక్షణకై నియుక్తుఁడైన సేనాపతి ప్రమోదవనములో రాజునువిడచి తిరిగివచ్చుటయే పెద్దదోషము. పైగా విరోధి సైన్యములు నగరముపై విరుచుకొని పడినప్పుడు సేనాపతి యింత నిశ్చింతగాఁ దనకు బట్టినట్లు కూరుచుండుట దురన్యాయమని యాయనకు దోఁచినది. ఆయన వెంటనే "సేనాపతీ! సర్వసైన్య సమేతముగా మేము యుద్ధభూమికి బోవుచున్నాము. నీవు మమ్మనుసరింపవలెను." అని భాగురాయణు నాజ్ఞాపించెను. భాగురాయణుఁడు సైన్యసమేతుఁడై రాక్షసమంత్రి ననుసరించెను.

# శత్రు సంహారము

నందరాజు తమ్ములందఱితో గలిసి పాటలీపుత్రమున కనతిదూరములో నున్న రాజోద్యానమును జేరుకొనెను. ఉద్యానవనము మందార మాలతీ మాధవీ పూగ పున్నాగ నీపనారంగ పనసపాటల ఘనసార జంబీర కందబాది నానా తరులతా సమంచితమై, వికసిత కమల కోమల సౌరభోల్లసిత కాసార విహార లోలములగు కలహంసికా చక్రవాక కలకల నినాద కమనీయమై, నరత్నీరసంశోభిత చంద్రోపల వేదికాప్రాంత పరిపక్వసరసరసాల ఫలభారావనమ్రచూతాగ్రకలకంఠ శుకశారికాగాన మాధురీమహనీయమై, మదనాస్థాన మంటపములతో విహారప్రదేశములతో నేపథ్యనికేతనములతో కన్నుల విందు గావించుచుండెను. ఆ నందనోద్యానములో ఆనందముగ ప్రవేశించిన నందరాజుల కెల్లయెడల కలసిమెలసి వర్తించు లలిత లతాతరు మిథునములును, శుకదంపతుల సొగసులును, కొంగ జంటల సొంపులును కంటి కింపుగా గన్పింపసాగెను.

నందరాజు పరమసుందరమైన రాజభవనములో విలాసినీ బృంద పరివృతుఁడై సుఖోపభోగపరవశుఁడై యుండెను. నృత్యగాన కళాప్రవీణలైన కాంతాజనములతో మదిరాపాన మత్తుఁడై పడియున్న నందరాజు తనకును తన తమ్ములకును

నానాటితో నూత్నేండ్లు నిండినవని గ్రహింపలేకపోయెను. తమ దురాచారఫలముగా చాణక్య కాలసర్పము తమ్ము కాటువేయవచ్చుచున్నదని వారెఱుఁగలేకపోయిరి. రాజ రక్షణకై వెంటవచ్చిన భాగురాయణ సేనాపతి తమ్ము మృత్యుముఖమున విడచి, చంద్రగుప్త పక్షపాతియై రక్షక దళ సమేతముగా పాటలీపుత్రమునకు మరలి పోయినాడని వారు గుర్తింపలేకపోయిరి.

ఆకస్మికముగా రాజభవనసమీపమున గోలాహలము చెలరేగెను. చాణక్య చంద్రగుప్తులు సేనాసమేతముగానంద రాజ మందిరములోఁ బ్రవేశించిరి. నందరాజు సుందరీబాహు పాశబద్ధుఁడై పడియుండెను. నందభ్రాతలందఱు నదేస్థితిలో నుండిరి. చంద్రగుప్త విజృంభణముగాని, పరిజన సంభ్రమము గాని నందులు గ్రహింపలేకపోయిరి. ముందుగా అంగరక్షక దళ నిర్మూలనముచేసి వెనువెంటనే చంద్రగుప్తుఁడు ఖడ్గ ధారియై నందసోదరులపై నొక్కపెట్టున విరచుకొని పడెను. మద్యపాన వివశులైన నందు లొక్కొక్కరే వికటముగా నార్తనాదము చేయుచు చంద్రగుప్త ఖడ్గధారకు బలియై పోవుచుండిరి. ఒకప్రక్క నందుల కంఠవిదళన కార్యక్రమము జరుగుచుండెను. మరొక ప్రక్క చాణక్యుఁడు ప్రళయకాల దండధరునివలె మండిపడుచు నందరాజుపై దుమికి యొక్క ప్రబల పాదాఘాతముతో వానిని శయ్యపై నుండి క్రిందబడ దన్నెను. నందుఁడు విభ్రాంతుఁడై తేరుకొనునంతలో

చాణక్యుఁడాతని గుండెపై కాలుపెట్టి "దుష్టుఁడా! నేనెవ్వరో ఇప్పుడు గుర్తించితివిరా!" అని గర్జించెను. నందరాజు హీన స్వరముతో "ఎవరు నీవు?" అని ప్రశ్నించెను.

"ఎవ్వఁడనా! నీపాలిటి కాలుఁడను! ఆనాఁడు నీవు భోజనశాలలో నుత్తమాసనముపుండి యెవ్వని కేశములుబట్టి బలవంతముగా బయటకు ద్రోయించితివో ఆ పండితుఁడను నేను! నీ వంశమును సమూలముగా ధ్వంసము జేసెదనని ఘోరప్రతిజ్ఞ బట్టిన ఆ మహాపండితుఁడను! నీ పాపహస్త స్పర్శతో పంకిలములైన యీ కేశపాశములను నీ గుండె నెత్తుటితోఁ దడిపి ముడివెట్టుదునని మహాప్రతిజ్ఞ చేసిన చాణక్యుఁడను! ఇప్పటికైన దెలిసినదా నే నెవ్వరినో? ఇంక ఇక్కడ నిన్ను రక్షించువాఁ డెవ్వఁడురా!"అని చాణక్యుఁడు చంద్రగుప్తునివైపు చూచెను.

చంద్రగుప్తుఁడు నందసోదర సంహారములో నిమగ్నుఁడై యుండెను. నందరాజు చాణక్యుని పాదములు బట్టుకొని "క్షమించు స్వామీ! క్షమించు. నా యపరాధమును మన్నించు. నాకు ప్రాణభిక్ష ప్రసాదించు."అని ప్రార్థించెను. చాణక్యుఁడతనిని చీదరించుకొనెను. "వీలులేదు. నీవు మహా పాపివి! జగద్ద్రోహివి! నీవు క్షమార్హుఁడవుకావు! నీవు నాకే కాదు. లోకమునకెల్ల శత్రుడవు! దేశప్రజలందఱను బీడించి సుఖభోగములతో గన్నులు గానక సంచరించుచున్న క్రూర

రాక్షసుఁడవు! నీవు ప్రభుపీఠమున కర్హుఁడవుకావు! నీవుచావ వలసినదే!" చాణక్యుఁడు నందరాజును ప్రక్కకు త్రోసెను. "చంద్రగుప్తా!" చాణక్యుఁడు సంబోధనముతోనే నందవధకు చంద్రగుప్తు నాదేశించెను.

చంద్రగుప్తుఁడు చాణక్యాజ్ఞానుసారము నందసోదర రక్తార్ద్రమైననిశితఖడ్గముతో నొక్కవ్రేటుననందరాజుశిరము ఖండించెను. చాణక్యుఁడు ప్రతిజ్ఞానుసారముగా నందరాజ రక్తసిక్తమైన స్వీయశిఖా బంధనము చేసికొని వికటాట్టహాసము గావించెను. "ప్రతిజ్ఞానిర్వహణమైనది! పండితావమానమునకు ప్రతీకారము పూర్తియైనది! నందవంశము నిర్మూలమైనది! దుష్టశిక్షణము జరిగిపోయినది! కాకున్న అఘటన ఘటనా సమర్థుఁడైన ఈ చాణక్యునితోనా అకారణ విరోధము! ఆహాహా!" చాణక్యుఁడు సంతుష్టుఁడై యొక్క వికటాట్టహాసము చేసెను.

"పదపద చంద్రగుప్తా! సమయాతిక్రమణ మగుచున్నది వేగముగాపద. మనసేనను గలిసికొని తెల్లవారుసరికి పాటలీపుత్రమును ముట్టడింపవలెను. ప్రభుత్వమును స్వాధీనము చేసికొనవలెను." అని చాణక్యుడు చంద్రగుప్తుని బిగ్గరగా హెచ్చరించెను. గురుశిష్యులు శరవేగమున పాటలీపుత్రమును జుట్టుముట్టియున్న స్వసైన్యములను కలిసికొనిరి. నందవృత్తాంతమెఱుఁగని రాక్షసమంత్రి నాయకత్వమున ప్రబలములైన మగధసైన్యములు చంద్రగుప్త పర్వతక సైన్యముల నెదు

రొక్కనిసవి. రాక్షసామాత్యుఁడపార సేనావాహినితో విరోధి సైన్యములపై విజృంభించి వీరభద్రునివలె ప్రళయరుద్రుని వలె మహోయుద్ధము చేసెను. కాని మహోద్ధృతమైన చంద్రగుప్త సేనాసముద్రము మగధ బలములను నలుదిశలనుండి యాక్రమించి నైచెను. ఇరుపక్షములకు పోరు ఘోరముగా సాగెను. ప్రాచ్య పాశ్చాత్య రణ రహస్య కోవిదుఁడైన చంద్రగుప్తుని ముందు నందుల బలములు నిలువలేకపోయెను. అంతలో నాకస్మికముగా మగధ సేనాపతి భాగురాయణుఁడు కొంత సైన్యముతో చంద్రగుప్తుని పక్షమున జేరిపోయెను. పర్వతరాజ సైన్యములు రాక్షససైన్యములను నామరూపములు లేకుండ నాశనము చేసెను. హతశేషమైన మగధ బలము భయభ్రాంతమై పంచబంగాళమై పారిపోయెను. రాక్షస మంత్రి నిస్సహాయుఁడై, పరాజితుఁడై రణరంగమును వీడెను. చాణక్యాదేశమున చంద్రగుప్తుడు రాక్షస మంత్రిని రణరంగములో జంపకుండ, బంధింపకుండ వదలి పెట్టెను. చంద్రగుప్త సైన్యములు జయజయ ధ్వనులతో పాటలీపుత్రములో ప్రవేశించెను.

రాక్షసమంత్రి పరాజయ ఖిన్నుఁడయ్యును, బట్టు విడువక నందరాజ రక్షణకై యశ్వారూఢుఁడై నందనవన మార్గమును బట్టిపోయెను. కొంతదూరము పోవునప్పటికి చాణక్యప్రేరితుఁడైన యొక రాజభటుఁ డాతని కెదురు వచ్చెను. "మహామాత్యా! మహామాత్యా! నాశనమైనది!

సర్వనాశనమైనది! క్రిందటి రాత్రియే నందనవనములో నందప్రభువులు సపరివారముగా సంహరింపబడినారు. ఆ దుష్కార్యము చేసిన దుష్టులెవ్వరోగాని యొక ఘోరమైన ప్రవాదమునుగూడ గల్పించినారు. రాజ్యమింత ప్రమాదములో నుండగా నందప్రభువులను విలాసవనమునకు బంపి తామే వారిని కుట్రపన్ని చంపించినారని దుష్ప్రచారము గావించినారు." అని రాజభటుఁడు రాక్షసమంత్రికి చెప్పెను.

రాక్షసమంత్రి నిర్విణ్ణుఁడై పోయెను. "ఇదెక్కడి ఘోరము! ఆకస్మికముగాఁ బాటలీపుత్రముపై నీ దండయాత్రయేమి? నందవధయేమి? దీనికెల్ల మూలకారకుఁడు తానని ప్రవాదము పుట్టుటయేమి?" ఆయన కేమియు పాలుబోలేదు. ఆయన తాను స్వయముగా నందనవనమునకుఁ బోయి విషయ మంతయు నామూలాగ్రముగా గ్రహింపవలెనని ముందునకు సాగెను. కాని రాజభటుఁ డాడతనిని వారించెను. "వలదు, వలదు. మహామాత్యా మీ రిప్పుడు నందనవనమునకేగుట మహాప్రమాదకరము. నా విన్నపము మన్నింపుఁడు. మీరు వెనుదిరిగిపొండు. అప్పుడే అక్కడ నందనవనములో చాలమంది ప్రజలు గుమిగూడినారు. వారందఱు రాజవధకు ప్రధానకారకులు మీరేయని క్రోధోద్విగ్నులై యున్నారు. ఒకవంక రాజవధ చేయించి, మరొకవంక రాజధానిపై దండయాత్రకు శత్రువుల నాహ్వానించినది మీరే

యని ప్రజలందరనుకొనుచున్నారు. ఈ సమయమున మీరు బచ్చుటకేగినచో ప్రాణప్రమాదము గల్గుట నిశ్చయము. కనుక మీరు ఆ ప్రజాగ్రహము చల్లారునవరకు రాజకార్యములు పట్టించుకొనకుండ స్వగృహములో నాత్మరక్షణము చేసికొనుట యత్యావసరమని ఆ ప్రమిత్రుల అభిప్రాయము.'' అని రాజభటుఁడు రాక్షసమంత్రికి ప్రాణభీతి గల్గించెను.

రాక్షస మంత్రి డోలాందోళిత చిత్తుఁడై యాతని మాటలు నమ్మి వెనువెంటనే స్వగృహాభిముఖుఁడయ్యెను. "ఇంతకాలముగా నంద వంశము నాశ్రయించి జీవించితిని. ఇప్పుడు సమయమునకు స్వామిరక్షణము చేయజాలక పోయితిని. పైగా రాజవధదోషముకూడ నాతలపైఁబడినది. రాజ్యకాంక్షతో నేనే నంద వంశమును సమూలముగా నాశనము జేసితినని ప్రజలలోఁ బ్రవాదము వ్యాపించినది. ఏమి చేయుదును! ఇది విధివైపరీత్యము!'' అని రాక్షసమంత్రి చింతాక్రాంతుఁడయ్యెను. "నందరాజ్యమును సుప్రతిష్ఠితము జేయుటకై అహోరాత్రములు యత్నించితిని. కాని నా కన్నుల ముందే నందవంశమిట్లు నాశనమైపోయినది. మగధ సింహాసనము దురాక్రమణ వశమైనది. దానిని నేను సహింపరాదు. తపోవనముననున్న మహాపద్మ నందుని మరల తెచ్చి మహారాజుగా ప్రతిష్ఠింపవలెను.'' అని రాక్షసామాత్యుఁడు నిశ్చయించుకొని ఇంటికి జేరెను.

ఆయన యారాత్రియే రహస్యముగా మహాపద్మనందుని గలిసికొనుటకై తపోవనమునకు బయలుదేరిపోయెను. ఆతఁడట్టి ప్రయత్నము చేయునని యఖండ మేధాసంపన్నుఁడైన చాణక్యుఁడు ముందే యూహించెను. అందుచే నాతని యత్నము విఫలమగుటకై జరుగవలసిన పని ముందేచేయించెను. రాక్షస మంత్రి తపోవనమున కేగి చూచునప్పటికి వృద్ధరాజు మహాపద్మనందుఁడు ఖండిత శిరస్కుఁడై పడియుండెను.

ఆ భయంకర దృశ్యమును వీక్షించునరికి రాక్షస మంత్రి యాశాలేశముగూడ హరించిపోయెను. ఆయన వృద్ధ రాజు మృతికి బహువిధముల పరితపించెను. ఇఁక నాసమయమున తన కర్తవ్యమేమో రాక్షసమంత్రికి తోచలేదు. ఒక వంక ప్రమాదశంక - మఱియొక వంక నంద నాశనము చేసిన పాపరాజ్యములో తానుండరాదను నిశ్చయము - రాక్షస మంత్రి మనస్సును బీడింపసాగెను. సముచిత సమయమున తనపై మోపబడిన రాజవధాపవాదమును తొలగించుకొనవలెననియు నంద శత్రువులను నిర్మూలింపవలెననియు నిశ్చయించుకొని ఆయన పాటలీపుత్రమునకు దిరిగివచ్చెను.

# స్థిరీకరణము

రాక్షస మంత్రి నంద వంశ విధ్వంసమునకు కారణ భూతుడైన చంద్రగుప్తుని సంహరించి తన ప్రభు ఋణము దీర్చుకొనవలెనని ప్రయత్నములు ప్రారంభించెను. అందులకై యాతఁడు చంద్రగుప్తునకు సాయము జేయవచ్చిన పర్వత రాజు నాధారముగా నుపయోగించుకొన దలచెను. అప్పటి నుండి రాక్షస మంత్రి పర్వతరాజుపై నపరిమితాభిమానము జూపసాగెను. అప్పుడప్పుడు సౌకర్యములు జూచు నెపమున నాతఁడు పర్వతరాజును గలిసికొనుచుండెను. చంద్రగుప్తునకు మగధ రాజ్యము ప్రాప్తించుటకు ప్రధాన కారకుఁడు పర్వత రాజేకనుక యందులకు తగిన ప్రతిఫలము నాతఁడు పొందుట న్యాయసమ్మతమే యని రాక్షసమంత్రి యా నేపాళపతి కాశ పెట్టెను. చంద్రగుప్తుని సంహరించి మగధరాజ్యమంతయు నీవే యాక్రమించి పాలించుకొమ్మని పర్వతరాజును ప్రబోధించెను. పర్వతరాజు రాక్షసవశవర్తి యగుచుండెను. ఈ విధముగా రాక్షస పర్వతేశ్వరుల మైత్రి దినదినాభివృద్ధి నందుచుండుట చాణక్యుడు గుర్తించెను. ఆయన వెంటనే పర్వతరాజును, నాతని పుత్రుడగు మలయకేతువును నొక మహాభవనమున జేర్చి గృహనిర్బంధమున నుంచెను.

ఆవిషయమెఱిగి పర్వతరాజు విభ్రాంతుడయ్యెను. 'తనను నందరాజ్యముపై దండెత్తివచ్చి సహాయము చేయుమని రహస్యముగా నాహ్వానించినవాఁడు చంద్రగుప్తుఁడు! అనంతరము మగధరాజ్యములో నర్థభాగమును బహుమాకృతిగా తన కిత్తునని వాగ్దానము చేసినవాఁడు చంద్రగుప్తుఁడు! అట్టి చంద్రగుప్తుఁడు నేఁడు తన్నే పట్టి బంధించినాఁడు! ఇందు వలన నాతనికి గల్గు ప్రయోజనమేమున్నది? ఒకవేళ నాతనికి తన నేపాళరాజ్యముపై మమకారమున్నను నది సులభసాధ్యముకాదు. సుదూరమున నున్న నేపాళదేశము తనను బంధించినంత మాత్రమున చంద్రగుప్తాధీనము కాదుగదా! ఏమో! అంతయుచాణక్యతంత్రము! దీనియంతరార్థమేమియో! అని పర్వతరాజు నిర్బంధవేదనముతో సతమతమగుచుండెను.

ఒకనాటి రాత్రి చాణక్యుఁడు పర్వతేశ్వరుని దర్శింప వచ్చెను. పర్వతేశ్వరునినిర్బంధకారణమునుచాణక్యుఁడాతనికి వివరించి చెప్పెను. దేశము మీఁద దండెత్తి వచ్చిన పరప్రభువును స్వేచ్ఛగా నుండ నిచ్చుట ప్రజాదృష్టిలో ఘోరాపరాధమగుననియు, నందువల్లనే తాత్కాలికముగా నాతనికీ నామమాత్ర నిర్బంధము గల్గినదనియు, కొలది కాలములో నాతనికందుండి విముక్తి గల్గుననియు, చాణక్యుఁడు పర్వతేశ్వరునకు విశదము చేసెను. పేరునకుమాత్రమే నిర్బంధముకాని యాతనికి నిరంతరము రాజోపచారములు జరుగుచునే యుండునని

వాక్రుక్చెను. అప్పుడప్పుడాతఁడు తన యిష్టమిత్రులను గలిసికొనుచుండ వచ్చుననియు దెలిపెను. రాజ్యమున గొంత ప్రశాంత పరిస్థితి యేర్పడగానే మున్ను వాగ్దానము చేసిన యర్ధరాజ్యముతోఁబాటుగా నాతనికి తప్పనిసరిగా విమోచన పత్రము నిప్పింతునని యొడార్చిపోయెను. పర్వతరాజు చేయునదిలేక యూరకుండెను.

రాక్షసమంత్రి తన యత్నమున తానుండెను. ఆతఁడు తన యాంతరంగికుఁడని నమ్మిన జీవసిద్ధిని గలిసికొని చంద్రగుప్త సంహారమునకు తగిన సాధనమును నిరూపింపుమని కోరెను. జీవసిద్ధి పైకి క్రిందికి చూచి, చుక్కలు లెక్కించి వ్రేళ్ళు గుణించి, కన్నులుమూసి యాలోచించి, తలయూచి యిట్లు పలికెను. "అమాత్యా! మీ ప్రభువులను మట్టుబెట్టిన హంతకులను నా మంత్రతంత్ర మహత్త్వముతో మారణహోమము జేసినశించెదను. నీ శత్రువులను త్రుటికాలములో నేలబెట్టి కాలరాచెదను. అందుల కప్పుడే తగిన యుపాయ మాలోచించి యుంచితిని. ఇప్పుడే చెప్పెదను వినుము" జీవసిద్ధిలేచి తనకుటీరములోనికి బోయెను.

రాక్షసమంత్రి చంద్రగుప్తవధ జరిగిపోయినట్లే సంతసించెను.

జీవసిద్ధి యతిలోకసుందరియైన యొక కన్యను వెంటబెట్టుకొనివచ్చెను. "అమాత్యా! ఇదిగో ఇది విషకన్య! ఇట్టి

విషమపరిస్థితులలో శత్రువులపై ప్రయోగించుటకై నేను బహుకాలముగా దీనిని పెంచుచుంటిని. దీనిచేత బాల్యము నుండియు గొంత కొంతగా విషసేవ చేయించుటవలన దీని దేహమంతయు విషాక్తమై యిది 'విషకన్య' యై పోయినది. దీనిని గాగిలించుకొన్నవాఁడు మరుక్షణమున మరణించి తీర వలసినదే! దీని నిప్పుడు మీ కధీనము జేయుచున్నాను. శత్రువుపైఁ బ్రయోగించి మీ యభీష్టసిద్ధి నందవచ్చును. కార్యసిద్ధికాగానే యిది యదృశ్యమై పోవునట్లు కూడ నియమించితిని. మీరింక నిర్భయముగా నిస్సంశయముగా దీనిని వెంటబెట్టుకొనిపొండు." అని పలికి యా విషకన్యను రాక్షసమంత్రి కప్పగించెను. రాక్షసమంత్రి జీవసిద్ధి మహామహిమ నభినందించి వెడలిపోయెను. వెనువెంటనే యావార్తను జీవసిద్ధి చాణక్యున కందించెను. ఆతఁడప్పుడే దానికి ప్రతీకార చర్య నిర్ణయించెను.

ఆరాత్రి రాక్షసమంత్రి విషకన్యను వెంటబెట్టుకొని చంద్రగుప్తుని సందర్శించెను. "మహారాజా! ఈ యందాల రాణి సర్వకళాధురీణ. ఈలోకైకసుందరిని మహాప్రభువులకు మా ప్రథమ బహుమాకృతిగా సమర్పించుచున్నాము. పరిగ్రహింపుఁడు."అని రాక్షసమంత్రి చంద్రగుప్తునకు నివేదించెను. చంద్రగుప్తుఁడా నిరుపమాన లావణ్యరాశిని జూచి విస్మితుఁడయ్యెను.

చంద్రగుప్తుఁడు విషకన్యను సమీక్షించెను. సంపపక్ష పాతమున తనపై పగబట్టి తన వినాశనము నపేక్షించుచున్న రాక్షసమంత్రి కుటిలోపాయమును, కపటభక్తి భావమును, ప్రథమ బహుమతి ప్రభావమును చక్కఁగా సంభావించెను. గురుదేవుల యాదేశమును శిరసావహించి యిట్లు పలికెను. “చాల సంతోషము. మహామంత్రీ! మీకును మాకును తగిన బహుమానమునే తెచ్చియిచ్చితిరి! పరమసంతోషము! కాని ఒక్కమాట! మాకీ మహావిజయము లభించుటకును, మగధ మహారాజ్యము ప్రాప్తించుటకును ప్రధానకారకుఁడు పర్వత రాజు. ఆయన మాకు పరమాప్తుఁడు. మా శ్రేయోభిలాషి. అట్టి పర్వతక మహారాజులవారిని ముందుగా నిట్టి సత్కార ములతో సంతృప్తిపరచుట సముచితము. కనుక ఈ జగదేక సుందరిని బహూకృతిగా పర్వతేశ్వరులకు సమర్పించుట సర్వోత్తమమని మా యభిప్రాయము.

ఆ నారీజన మన్మథులైన పర్వతేశ్వరులకీ కమనీయ రతిస్వరూపిణియగు కన్యక మా కానుక యగుగాక!” చంద్ర గుప్తుఁడు వెనువెంటనే విషకన్యను పర్వతరాజునకు బహూ కృతిగా బంపెను.

రాక్షసమంత్రి దిగ్భ్రాంతుఁ డయ్యెను. “ఔరా! చాణక్యప్రజ్ఞ యెంత యద్భుతమైనది! (ఆతని ప్రతిక్రియా నైపుణ్య మతిలోకమైనదిగదా!) “ఏకక్రియాద్వ్యర్థకరీ”

యన్నట్లు చంద్రగుప్త సంరక్షణముతో బాటు పర్వతక సంహారమునుగూడ ఆత డేకకాలమున సాధించుచున్నాఁడు. నామహాయత్నము విఫలమై పోవుటయేగాక ప్రకృతము నా ప్రయత్నమున కాధారభూతుఁడగు ఆప్తమిత్రుఁడు పర్వతేశ్వరుఁడుగూఁడ ప్రమాదవశలో జిక్కువడినాడు!" అని రాక్షసమంత్రి చింతాక్రాంతుఁడయ్యెను. కాని యాతఁ డిప్పుడిక చేయునది లేక యూరకుండవలసి వచ్చెను.

మధుపాన మదోన్మత్తుఁడైన పర్వతేశ్వరుఁడు మదనావేశపరవశుఁడై యారాత్రి విషకన్యాపరిష్వంగమునఁ బ్రాణములు విడిచెను. అనంతరము విషకన్య యన్యుల కంటబడకుండ నా రాత్రి కా రాత్రియే యదృశ్యమైపోయెను. తెల్లవారుసరికి పర్వతరాజు మరణవార్త పాటలీపుత్ర మంతయు వ్యాపించినది. చాణక్యుఁడు పర్వతక సోదరుడైన వైరోచకుని, కుమారుఁడైన మలయకేతువును శోకోపశమన వాక్యములతో నోదార్చి యాదరించెను. విషకన్యాప్రయోగమున పర్వతరాజ మరణమునకుఁ గారకుఁడైనవాఁడు రాక్షసమంత్రియే యను ప్రవాదమును దేశమంతట ప్రచారము చేయించెను. నందవంశ నిర్మూలమునకు గారకులైన చంద్రగుప్త పర్వతకులలో నెవ్వరు చచ్చినను రాక్షసమంత్రికి సంతోషమేగదాయని తన ప్రచారమును సమర్థించుకొనెను.

రాక్షసమంత్రి తాను బన్నిన వలలోఁ దననే బంధించిన చాణక్యుని బుద్ధిబలమున కచ్చెరువందెను. పర్వతరాజ

హత్యాపరాధముగూడ తనపై బడినందుల కాతని హృదయము బెదరి చెదరిపోయెను. తానింక పాటలీపుత్రమున నుండుట ప్రాణాపాయకరమని యాతఁడు భయపడెను. అప్పకెట్లో నగరమువీడి దూరదేశము పోయి సమయము చిక్కినప్పుడు నందవధకు ప్రతీకారము చేయవలెనని యాతఁడు నిశ్చయించుకొనెను. ఆ కష్టకాలములో తన కుటుంబమున కాశ్రయమిచ్చి కాపాడు పుణ్యాత్ము లెవ్వరా యని రాక్షసమంత్రి యాలోచించెను. ఆతనికి ప్రాణమిత్రుడైన చందనదాసను రత్నాలవర్తకుఁడు స్ఫురణకు వచ్చెను. రాక్షసమంత్రి సకుటుంబముగా చందనదాసు నింటికి బోయి తన గృహజనమునకుఁ గొంతకాలముపాటాశ్రయమిమ్మని యర్థించెను. నిన్న మొన్నటివఱకు నెవ్వని యాజ్ఞ మగధమహారాజ్యమునందలి యాబాలగోపాలమునకు శిరోధార్యమై యుండెనో, ఎవ్వనిమాట సర్వప్రశస్తమై సకలజనమాన్యమై వర్ధిల్లుచుండెనో యా మహామాత్యుఁ డిప్పుడు నిరాధారుఁడై నిరాశ్రయుఁడై తన సాయముగోరి వచ్చినందులకు చందనదాసు మిక్కిలి దుఃఖపడెను. ఆతఁడు రాక్షసమంత్రికి అనునయ వాక్యములు చెప్పి యాతని కుటుంబమును తాను ప్రాణాధికముగా గాపాడుదునని వాగ్దానము చేసెను. రాక్షసమంత్రి కుటుంబరక్షణ భారమును జందనదాసుపై నిడి శత్రుసంహారోపాయాన్వేషణమునకై తాను నగరమును వీడి వెడలిపోయెను.

రాక్షసమంత్రి నగరమును విడిపోవుట చాణక్యునకు మఱింతశక్తి నిచ్చెను. పర్వతకవధాపరాధముననే రాక్షసమంత్రి భయభ్రాంతుఁడై యూరు విడచి పలాయనము చిత్తగించెనని మఱింత ప్రబలముగాఁ బ్రచారము చేయించెను. ఈ విధముగా విషకన్యా ప్రయోగమున బర్వతకప్రభుని బరిమార్చి, తన మంత్రాంగబలమున రాక్షసమంత్రిని పాటలీపుత్రమునుండి పారద్రోలి, చాణక్యుఁడు చంద్రగుప్తుని రాజ్య స్థిరీకరణమునఁ బ్రథమవిజయము సంపాదించెను.

# మహా మంత్రాంగము

చాణక్యుఁడు చంద్రగుప్త శ్రీస్థైర్యమునకై మఱికొన్ని ప్రణాళికలు భావించెను. పర్వతరాజ మరణానంతరము అతని కుమారుఁడగు మలయకేతువును గూర్చి చాణక్యు డాలోచించెను. పితృవధామర్షమున మలయకేతు వెప్పటికైన తమకు ప్రబల శత్రువు కాగలడని చాణక్యుఁ డూహించెను. కాని ఇప్పుడే మలయకేతువునుజంపించినచోపర్వతకవధాపరాధము గూడ మాయని మచ్చయై తమపై బడునని భావించెను. అందుచేత మలయకేతువున కెట్లో ప్రాణభయము గల్పించి ఆతఁడు తనకుఁ దానై స్వదేశమునకు వెడలిపోవునట్లు చేయవలెనని సంకల్పించెను. వెంటనే మలయకేతువునకు గృహ నిర్బంధము తొలగించెను. తనకు పరమాప్తుఁడైన భాగురాయణుని పిలిచి యేకాంతముగా నాతని కిట్లు ఉపదేశించెను.

"సేనాపతీ! మలయకేతువు పితృమరణానంతరము కూడ అర్ధరాజ్య ప్రాప్తిని గూర్చి యాశ వదలక పాటలీపుత్రముననే నిలిచియున్నాఁడు. నీవు వెంటనే యాతనియొద్దకు వెళ్ళి విషకన్యా ప్రయోగమున మీ తండ్రిని జంపినది చాణక్యుఁడే యని నమ్మింపుము. ఆ ఘోరకృత్యములో రాక్షస మంత్రి కెట్టి ప్రమేయమును లేదని స్పష్టము చేయుము. ఇక

రాజ్యభాగము సేయకుండ తప్పించుకొనుటకై చాణక్యుఁడు నిన్నుకూడ వధించి తీరునని భయపెట్టుము. ఆతఁడు ప్రాణ భయముతో పలాయన మంత్రము బఠించునట్లుగాఁ జేసి యా ప్రుండవైనట్లు నటించి నీవును నాతని ననుసరింపుము. మన మహాయత్నములు సఫలమగునట్లు చేయుము."

భాగురాయణుఁడు గురుదేవుని యాజ్ఞానుసారము మలయకేతువును జేరెను. సముచిత వాక్యములతో నాతని మనస్సులో చంద్రగుప్త చాణక్యుల పట్ల మహాభయమును రేకెత్తించెను. పితృమరణదుఃఖమున వికలమనస్కుఁడై యున్న మలయకేతువు ప్రాణభీతితోఁ దల్లడిల్లి పోయెను. ఆతఁడు ప్రాణరక్షకుఁడైన భాగురాయణుని బ్రతిమాలి వెంట బెట్టుకొని పాటలీపుత్రమునుండి తన మంజు పట్టణమునకు పలాయనమై పోయెను.

చంద్రగుప్తునకు రాజ్యభాగమునాశించు మలయకేతువు పీడ వదలిపోయినది. కాని పర్వతక సోదరుఁడైన వైరోచనుఁడు మాత్రి మర్ధరాజ్యాభిలాషతో పాటలీపుత్రములోనే యుండెను. చాణక్యుఁడు సముచిత సమయమున వాని యడ్డముగూడ వదలించుకొనవలెనని నిశ్చయించుకొనెను.

మలయకేతువు మంజు పట్టణమును జేరుకొన్నాఁడను వార్త విని రాక్షస మంత్రి పరమానంద భరితుఁడయ్యెను. పర్వతక సంహార కాండలో తన నిర్దోషిత్వమును నిరూపించు

కొనుటకును, నంద వధకు ప్రతీకారముచేసి తన స్వామి భక్తిని ప్రకటించుకొనుటకును, తాను మలయకేతువునే సమాశ్రయింపవలెనని రాక్షసమంత్రి నిశ్చయించుకొనెను. వెనువెంటనే ఆతఁడు రివారముగా మంజు ల జేరుకొని యేకాంతమున మలయకేతువును దర్శించెను.

“రాజకుమారా! పర్వతరాజును వంచించి చంపించినది చాలక, నీ వచ్చుట నుండినచో గ్దానము చేసిన యర్ధ రాజ్యము నర్పింపవలసివచ్చునని భావించి చాణక్యుఁడు నిన్ను భయపెట్టి యిటకు పారదోలినాఁడు. అయినను నీవు నిర్వ్యాపారముగా నిట్లు చింతిల్లవలసిన పనిలేదు. మౌర్యచంద్రగుప్తుని సంహరించి నేను నిన్ను మగధ సింహాసనముపైఁ బ్రతిష్ఠింతును. సుగాంగమున సువర్ణ సింహ పీఠికపై నిన్ను మహాప్రభువుగా నభిషేకింతును. రాక్షసమంత్రి పరిగ్రహీతుఁడైన మలయకేతువు మగధాధిపతి కాకతప్పదు. నాతోఁబాటు నందాను రక్తులైన రాజభక్తులనేకులు పాటలీపుత్రములో శత్రువిధ్వంసనమునకు కృతనిశ్చయులై యున్నారు. విరోధుల రహస్య వృత్తాంతములనుసంగ్రహించి, వారియైకమత్యమును విచ్ఛిన్నము చేయుటకై యోగ్యులైన అనుచరులను నియమించితిని. ఇఁకనీవు యుద్ధసన్నాహముతో మిత్రరాజ్యబలములను గలుపుకొని సంసిద్ధుఁడవు కమ్ము.” అని యాతని మనస్సున కెక్కునట్లు మాటాడి యొప్పించెను.

పితృవధకు ప్రతీకారము చేయుటకై త్రోవగానక తల్లడిల్లుచున్న మలయకేతువునకు మహామేధావియైన రాక్షసమంత్రి మాటలు వేయి యేనుగుల బలము నిచ్చెను. ఆతఁడు రాక్షసమంత్రి ప్రజ్ఞాబలమును గూర్చి మగధ దేశములో వినియుండుటచే నాతనికి వెంటనే యాశ్రయమిచ్చి యమాత్యపీఠమున బ్రతిష్ఠించుకొనెను.

(బహుకాలముగా పరితాపమగ్నుఁడై సముచిత శరీర సంస్కారమును విడచి నిరాభరణుఁడైయున్న రాక్షస మంత్రికి తన తొలికానుకగా నొక యమూల్యాభరణమును బహూకరించెను.) మలయకేతుని అభీష్టానుసారము రాక్షస మంత్రి ఆ యాభరణమును పరిగ్రహించి అలంకరించుకొనెను.

“మహాత్మా! మీ యండ దొరకుట నాకు కొండంత శక్తి గూర్చినది. ఇఁక నాకు మీ మంత్రాంగమే ఏకైకాధారము! అక్రమముగా నాతండ్రిని చంపించినదురాత్ములను నిర్మూలించిగాని నేను మా నాయనగారికి పరలోక క్రియలు గావింపను. ఇదే నా ప్రతిజ్ఞ.” అని మలయకేతువు ఘోరప్రతిజ్ఞ చేసెను.

మహాబలుఁడైన మలయకేతుని సహాయముతో, తదనుచరులైన మ్లేచ్ఛవీరుల సహకారముతో రాక్షస మంత్రి చాణక్య చంద్రగుప్తులను సాధింపవలెనని బహు భంగుల ప్రయత్నములు సాగించెను.

ఆ ప్రయత్నములను గుర్తించిన చాణక్యుడు ప్రతిక్రియతోపాటు రాక్షస వశీకరణమునకు గూడ మార్గాన్వేషణము నారంభించెను.

"ఔరా! రాక్షసమంత్రి స్వామిభక్తి తాత్పర్యము! నందరాజులను రక్షించుటకై యెన్ని యత్నములు చేసినాడు! దైవదుర్విపాకమున నాతని మేధాబలమును నందరాజు లుపయోగించుకొనలేకపోయిరి. ఆయన యత్నములెల్ల విఫలములైపోయినవి! ఆ యఖండ బుద్ధిబలమును వ్యర్థముకానీయరాదు!

ఆ యసమాన రాజనీతి నేతృత్వమును, ఆమహత్తర ప్రజ్ఞావైభవమును జంద్రగుప్తానుకూలము గావింపవలయును! ఆ మహామహుడు మౌర్య చంద్రగుప్తునకు మంత్రియైనచో మగధ రాజ్యమున కింక లోటుండదు. ఆ మహామేధావి వశమైనచో నా జీవిత లక్ష్యము సమగ్రముగా నెరవేరినట్లే!" చాణక్యుడు నిశ్చయించుకొనెను.

ఆయన వెంటనే తనకు విశ్వాసపాత్రులైన అనేక చారులను పలువేషములతో, పలు ప్రదేశములలో సంచరించుచు నిగూఢ వార్తలు తెచ్చి తెలుపుడని నియమించెను. రాక్షస-పక్షపాతులను నెపమున ననేకవ్యక్తులను రాజ్యము నుండి వెడలగొట్టించెను. అట్టివారందరు తమ బుద్ధిబలమున రాక్షసామాత్యు నాశ్రయించి యాతని కార్య రహస్యము

లన్నియు గ్రహించి మున్ముందుగా తన కందచేయవలెనని యాజ్ఞాపించెను. అట్టివారందరు నిజముగానే రాజద్రోహాప రాధమున బాటలీపుత్రము నుండి నిర్వాసితులైనారని నమ్మి రాక్షస మంత్రి వారి నాప్తవర్గములోఁ జేర్చుకొనుచుండెను. అట్లు చేర్చుకొనబడిన వారిలో మంత్రతంత్ర క్రియాదక్షుఁ డగు క్షపణక జీవసిద్ధియు నుండెను.

ఆజీవసిద్ధి రాక్షసునిచేత చంద్రగుప్త సంహారమునకై నియోగింపబడిన విషకన్య వృత్తాంతమును చాణక్యునకు మునుముందుగా చేరవేసినవాడు. అందువలన నిప్పుడు రాక్షసమంత్రి జీవసిద్ధిని విశ్వసింపఁడని చాణక్యుఁడు గ్రహించెను. జీవసిద్ధిపై రాక్షసమంత్రికి విశ్వాసమును గల్గించుటకై చాణక్యుఁ డొక యుక్తిని బన్నెను.

"జీవసిద్ధి రాక్షసమంత్రి యాజ్ఞానుసారముగా విష కన్యను బర్వతరాజుపైఁ బ్రయోగింపఁజేసి యాతని మరణ మునకుఁ గారకుఁడైనాఁడ"ని ప్రకటించి అవమానించి చాణ క్యుఁ డాతనికి దేశ బహిష్కార శిక్షవిధించెను. జీవసిద్ధి గురు కార్య నిర్వహణమునకై మంజు పట్టణములోనున్న రాక్షస మంత్రిని జేరుకొనెను. రాక్షసమంత్రి శత్రు శత్రుఁడైన తన ఆప్తమిత్రుని క్షపణక జీవసిద్ధిని సాదరముగా మన్నించి కొలువునఁ జేర్చుకొనెను.

# గృహ ప్రవేశము

రాక్షస మంత్రియు తనకు విశ్వాసపాత్రులైన యనేక వ్యక్తులను గూఢచారులుగా పాటలీపుత్రమున నియమించెను. మగధరాజ్య పరిస్థితులు గ్రహించి నివేదించుటకును, చాణక్య ప్రయత్న రహస్యములను వెనువెంటనే తనకందించుటకును, సమయము జూచి చంద్రగుప్తుని ఏదే నొక యుపాయమున సంహరించుటకును తన యనుచరుల నాజ్ఞాపించెను. అట్టి వారిలో "దారువర్మ" యను నొక మహాశిల్పి యుండెను.

దారువర్మ రాక్షసప్రేరితుఁడై చంద్రగుప్త సంహారోద్యోగమునకు బూనుకొని యుండెను. అది తెలిసికొని చారచక్షువైన చాణక్యుఁడు వాని నొకకంటఁ గనిపెట్టి ప్రతీకార ప్రయత్నమును ప్రారంభించెను. అందులకు ముందుగా, అర్థ రాజ్యాసక్తుఁడై కొండంత కోరికతో పాటలీపుత్రమున గూర్చుండియున్న రాజు తమ్ముఁడగు వైరోచకునిపీడ వదలింపఁ బూనుకొనెను.

ఒక శుభముహూర్తమున చంద్రగుప్తుఁడు నందరాజ భవనములో ప్రవేశించునని చాణక్యుడు ప్రకటించెను భవన ప్రవేశమహోత్సవమునకై పూర్వద్వారము మొదలుసౌధము నంతయు చక్కఁగా నలంకరింపుడని సూత్రధారులను బిలిచి

సంభాషించెను. సూత్రధారులు రాజభవనము దగ్గరకుబోయి మరలివచ్చి చాణక్యునితో నిట్లు విన్నవించుకొనిరి. "ఆర్యా! మేము వెళ్ళుసరికే మహాశిల్పి దారువర్మ రాజభవన ప్రథమ ద్వారమును బంగారు తోరణములతో నలంకరించినాఁడు. అసాధారణములైన యనేకవస్తువులతో సౌధమునెల్ల శోభాయమానముగాఁ దీర్చిదిద్దినాఁడు. ఇక మేము సౌధాంత ర్భాగమును మాత్రమే యలంకరింపవలసియున్నది."

చాణక్యుఁడు సూత్రధారుల మాటలువిని యాశ్చర్య పడెను. తన యాజ్ఞ లేకయే దారువర్మ రాజభవనద్వారము నలంకరించుటలో నేదియో శత్రుతంత్ర మిమిడియున్నదని యాయన యూహించెను. "ఓయి దారువర్మా! నీ బుద్ధి బలమునకు నచిరకాలములోనే తగిన ప్రతిఫలము నందెదవు గాక!" అని చాణక్యుఁడు సంభావించుకొనెను. "అంతయు మన మంచికే వచ్చినది. నేను దానికి ప్రతితంత్రమును నిశ్చ యించెదగాక!" అని చాణక్యుఁడు నిర్ణయించుకొనెను.

వెనువెంటనే యాతఁడు చంద్రగుప్తుఁ డానాటి యర్ధ రాత్రమున నందభవనమును ప్రవేశించునని పౌరుల కెల్లఱకు వెల్లడిచేయించెను. పర్వతేశ్వరుని సోదరుఁడైన వైరోచకుని రావించి యత్యాదరమున నిట్లుపలికెను. "పర్వతకసోదరా! మున్ను మేముచేసిన వాగ్దానముప్రకారము మీయన్నగారికి మగధరాజ్యమున నర్ధభాగము నీయవలసియున్నది. కాని

రాక్షస తంత్రమున నీవా యన్నగారు గతించిన విషయము నీ వెఱుంగుదువు అనంతరము పర్వత పుత్రుఁడైన మలయకేతువుగూడ మాకు మాట మాత్రము దెలుపకుండ పాటలీపుత్రమును వీడిపోయిన విషయముగూడ నీకు తెలియును. అయినను నాడిచ్చినమాట తప్పరాదు. కావున మేమీనాఁడు మగధరాజ్యమున నర్ధ భాగమును నీ కప్పగించ దలచితిమి. అర్ధరాజ్యాధిపతివైన నీవు నేఁడు భద్రగజాధిరూఢుఁడవై శుభముహూర్తమున రాజభవన ప్రవేశము చేసి మమ్మానందింపజేయవలయును.” వైరోచకుఁడు చాణక్య వాక్యములకు పరమానంద పరవశుఁడయ్యెను.

భవన ప్రవేశ ముహూర్తము సమీపించినది. పట్టపు ఏనుగు “చంద్రలేఖ” రత్నభూషణ సమలంకృతమైనది. వైరోచకుఁడు రాజోచిత వేషభూషోజ్జ్వలుఁడై, సుందర సుమమాలికాబృంద విరాజితగళుఁడై గజాధిరోహణము గావించెను. అది రాత్రివేళయగుటచేతను, నానాలంకార సమలంకృతుఁడై యున్న వైరోచకుడు చంద్రగుప్తుని గజరాజము నధిష్ఠించి యుండుటచేతను, పౌరులందఱు ప్రకటనానుసారముగా నాతనిని చంద్రగుప్తుఁడనియే భావించిరి. ఆ విధముగా వైరోచకుఁడు మహావైభవముతో రాజభవనమును సమీపించెను. చంద్రగుప్తానుయాయులైన యనేకులు రాజులు, రాజోద్యోగులు వాహనారూఢులై యా భద్ర

గజము ననుసరించి వచ్చుచుండిరి. గజరాజము భవనద్వార మును ప్రవేశించుచుండెను. అంతలో నా గజమును నడపు చున్న రాక్షసానుచరుడైన బర్బరకుఁడను మావటివాడు తన యంకుశపు కొరలో దాచి యుంచిన పిడికత్తి నందు కొనెను. అది గ్రహించి వాఁడు తనను గొట్టునేమోయని భయపడి చంద్రలేఖ తటాలున తన నడక మార్చెను. సరిగా నదే సమయమున దారువర్మ మారణాయుధమైన యంత్రతో రణమును గురిజూచి ప్రభువుతలపై విడచెను. కాని గజ గమనము మందమగుటచే యంత్ర తోరణము గురితప్పి మావటివానిపై బడెను. రాజద్రోహియైన బర్బరకుఁడు మరు క్షణమున మరణించెను. అది చూచి దారువర్మ యిక తన కెట్లును మరణము తప్పదని తలచి యంత్రతోరణమున కమర్చియున్న పెద్దయినుప గడియ నూడఁబెఱికి దానితో నేనుగు మీదనున్న వైరోచకుని తల బగులఁగొట్టి చంపెను. ఆ ఘోరకార్యమును జూచి గజరాజము ననుసరించుచున్న రాజభటులు లోకక్కపెట్టున చుట్టుముట్టి దారువర్మను కొట్టి చంపిరి. రాక్షసానుచరులైన బర్బరక దారువర్మలును, బర్వతక సోదరుఁడైన వైరోచకుఁడును నేకకాలమున నిహతులై పోయిరి. చంద్రగుప్తునకు చాణక్యప్రజ్ఞారూపమున దైవ బలము తోడ్పడినది. రాక్షసయత్నము నిష్ఫలమైనది. అనంతరము చంద్రగుప్తుఁడు సురక్షితముగా రాజభవన ప్రవేశము చేసెను.

# పట్టాభిషేకము

మౌర్యచంద్రగుప్తుని పట్టాభిషేక మహోత్సవమునకు సుముహూర్తము నిశ్చయింపబడినది. సర్వసద్గుణ సంపన్నుఁడైన చంద్రగుప్తుని యభ్యున్నతికి పాటలీపుత్రము పరమానంద పులకిత మగుచున్నది. బహుకాలముగా నందరాజుల నిరంకుశ పరిపాలనములో పడరాని పాట్లు బడిన మగధ రాజ్యము నవోత్తేజముతో నవనవోల్లాసముతో శోభిల్లుచున్నది. ధర్మస్థాపకుఁడు దయార్ద్రహృదయుఁడు నైన తమ నూతన ప్రభువును దలచుకొని ప్రజానీకము హర్ష పరవశ మగుచున్నది.

పట్టాభిషేక మహోత్సవమునకై పాటలీపుత్రము ప్రత్యేకముగా నలంకరింపబడినది. ప్రతి సౌధాగ్రమున మనోహరములగు మయూరపతాకములు శోభిల్లుచున్నవి. ప్రతి గృహద్వారమున మంగళతోరణములు విరాజిల్లుచున్నవి. రాజవీథులు రమణీయరంభాస్తంభములతో గన్నులవిందుగాఁ గళకళ లాడుచున్నవి. ప్రజలందఱు విందులతో వేడ్కలతో వినోదములతో విలాసముగా విహరించుచున్నారు. రాజభవనము రత్నాలంకారములతో నయనపర్వముగా విలసిల్లుచున్నది. పరిచారికలు పుష్పిత జంగమలతికలవలె సాలంకారలై పట్టాభిషేక సన్నాహములతో

క్షణము తీరిక లేక పరువులు వెట్టుచున్నారు. ఎటుచూచినను సంతోషమే! ఏ ప్రక్క వీక్షించినను మహానందమే!

ఆనాఁడు పట్టాభిషేక మహోత్సవము. అంతఃపురమున రాజమాత మురాదేవి ప్రియనందనుని రాజ్యాభిషేక శుభ సమయమును దలచుకొని పూర్ణిమనాటి క్షీరసాగరమువలె నానంద రస తరంగితాత్మ యగుచుండెను. ఆ వీరమాత ఇంత కాలమునకు తన కోరిక నెరవేరినందులకు హర్ష పరవశ యగుచున్నది. తన మనోభీష్టము ఫలించినందుల కిష్టదైవత ములకు మ్రొక్కుకొనుచున్నది. తనకు జరిగిన దురన్యాయ మునకు ప్రతీకారము గావింపబడినది. తన కుమారుఁడు మగధాధిపతి కావలెనను తన జీవితైకవాంఛ సఫలమైనది. రాజమాత గౌరవము నేటికి తనకు ప్రాప్తించినది. తన కుమారుడు చేసిన ప్రతిజ్ఞ చెల్లించుకొన్నాడు. నంద విధ్వంసము చేసి తాను మహారాజగుచున్నాఁడు. మురాదేవి యంతులేని యానందముతో మైమరచిపోయినది.

అభిషేక ముహూర్త మాసన్నమైనది. చంద్ర గుప్తుఁడు రాజోచిత వేష భూషాభిరాముఁడై రమణీయ రత్నాలంకార విరాజితుఁడై, స్వర్ణాభరణ శోభితుఁడై మాతృశ్రీ సాన్నిధ్యమునకు వచ్చెను. మురాదేవి తన పాద పద్మములకుఁ బ్రణమిల్లిన ప్రియతనయుని రెండుచేతులతో లేవనెత్తి శిరస్సు మూర్కొని ముద్దాడినది. హర్షగద్గద

కాంతిమతో మురిపించిన ప్రేమసామ్రాజ్య నాశీర్వదించినది. చంద్రగుప్తుఁడు తల్లి పొందిన ఆహ్లాదుఁడై పరివృతుఁడై పట్టాభిషేకసభకు బయలుదేరినాఁడు. పాటలీపుత్ర రాజవీథులలో భద్రగజము సముదాత్తగమనమున సాగిపోవుచున్నది. సౌధాగ్రములనుండి పురపురంధ్రులు మహాప్రభువుమీద పుష్పవర్షము గురిపించుచున్నారు. కర్పూరహారతు లెత్తుచున్నారు. పట్టపు టేనుగు సభామందిరమును జేరుకొన్నది.

ఆర్యచాణక్యుఁడు చంద్రగుప్తునకు భవనద్వారమున స్వాగతము చెప్పి సభాప్రవేశము చేయించినాఁడు. చాణక్య గురుదేవుల ఆశీస్సుమాళికతో, ప్రియమిత్ర బాంధవ శుభాభినందనములతో, కవీంద్రబృంద కావ్యాంజలులతో గాయనీ గాయక మధుర మంగళ గానముతో, సమస్త ప్రజల జయజయ ధ్వానములతో మౌర్యచంద్రగుప్తుఁడు మగధ సింహాసనము నధిష్ఠించినాడు. రాజపురోహితుఁడు చంద్రగుప్తుని రాజ్యాభిషిక్తుని జేసి రత్న కిరీటముతో ప్రభుమౌళి నలంకరించినాఁడు. ధర్మదండము నందించినాఁడు. చంద్రగుప్త మహారాజు వేదవేత్తల శుభాశీస్సులను దలదాల్చినాఁడు. సామంత భూకాంతుల బహూకృతులను పరిగ్రహించినాఁడు. యోగ్యతానుసారముగా ననుచరకోటి కమూల్యబహుమతులు ప్రసాదించినాఁడు. మహాసభ ప్రఫుల్లమైన శతపత్ర పద్మమై శోభిల్లినది.

చంద్రగుప్త మహారాజు సింహాసనము నుండి లేచి
యార్యచాణక్యుల కభివాదము చేసి ప్రభుహృదయము నిట్లు
ప్రకటించినాఁడు.

“మహాజనులారా! చాణక్య గురుదేవుల యాశీర్బల
ముతో మీరిప్పుడు మాపై మోపిన యీ రాజ్యభారమును
సమర్థముగా సక్రమముగా నిర్వహింపగలమని వాగ్దానము
చేయుచున్నాము. ప్రతిక్షణము ప్రజా సౌభాగ్యమునకు,
ప్రజా సంతోషమునకు నీ ప్రభుపీఠము సర్వశక్తులు ధార
వోయగలదని ప్రమాణము చేయుచున్నాము. ధర్మపాలన
ములో కర్తవ్య నిర్వహణములో మీ యందఱి సహకారము
నర్థించుచున్నాము. ఇంతకాలము నందరాజుల పరిపాలన
ములో ప్రజాజీవన మెట్లు సంక్షుభితమైనదో మీ రెఱుఁగు
దురు. నందరాజుల దురాచారపరాయణత్వమున కెందఱు
నిరపరాధులు బలియైపోయినారో మీకు తెలియును. నంద
రాజుల దురాక్రమణబుద్ధి యెంతటి నెట్లు వేధించి బాధించి
నదో మీకు చెప్పనక్కఱలేదు. ఎట్టకేలకు దైవబలమున,
గురుదేవుల మంత్రాంగ మహిమమున నందపీడ వినాశన
మైనది. దేశము నిష్కంటకమైనది. ఇక మన రాజ్యమున
సువ్యవస్థ నెలకొనవలెను. అందులకై మేము గురుదేవులైన
ఆర్యచాణక్యులను మగధరాజ్య మహామాత్య పదవిని స్వీక
రించి మాకు మార్గదర్శకత్వము వహింపవలెనని మీ
యందరి పక్షమున నభ్యర్థించుచున్నాము. నీతికోవిదులైన

గురుదేవుల యర్థశాస్త్రానుసారముగ రాజ్యపాలనము సాగింపబడునని మనవి చేయుచున్నాము. వారి మేధాబలమున మగధరాజ్య మచిరకాలమున మహాసామ్రాజ్యమై శాంతి సౌఖ్యములతోఁ దులతూగగలదని మా విశ్వాసము. ఈ సామ్రాజ్య పాలనమునకుఁ దగిన శక్తి యుక్తులు భగవంతుఁడు మాకు ప్రసాదించుగాక."

మహారాజు మణి మహోజ్జ్వలమైన తన మయూరాసనమున నుపవిష్టుఁ డయ్యెను.

సంతోషపరవశులైన సభాసదుల కరతాళ ధ్వనులతో సభాభవనము మారుమ్రోగినది. ప్రజలందఱు మహారాజునకు నార్యచాణక్యులకు జయము పలికిరి. మహారాజు భక్తిగౌరవములతో గురుదేవునకు మహామాత్యాధికార చిహ్నమైన శస్త్రము నందించెను. ఆర్య చాణక్యుఁడు ప్రభుని కోరిక మన్నించి మహామాత్య పదవిని స్వీకరించెను.

చాణక్య మహామాత్యుఁడు ప్రభుని ఆమోదముతో ప్రజ్ఞావంతులైన మంత్రులను, సమర్థులైన సేనాపతులను, రాజ్యాధికారులను, వివిధ రాష్ట్రాధిపతులను నియమించెను. విశ్వాసపాత్రులైన వీరులను, శక్తిసంపన్నులైన యవనీ కాంతులను మహాప్రభుని అంగరక్షక దళములో నియోగిం

చెను. రాజబంధువులను సముచితాధిపత్యము లిచ్చి సత్క రించెను.

రాజశాసన పరిపాలనమునకై అనేక శాఖాధికారు లను నియమించెను. సువర్ణాధ్యక్షుని, కోశాధ్యక్షుని, పణ్యా ధ్యక్షుని, ఆయుధాగారాధ్యక్షుని, శుల్కాధ్యక్షుని, సూత్రా ధ్యక్షుని, సూనాధ్యక్షుని. నావాధ్యక్షుని. గవాధ్యక్షుని, అశ్వాధ్యక్షుని, గజాధ్యక్షుని, రథాధ్యక్షుని, ముద్రాధ్యక్షుని, సమాహర్తను. వివిధ విషయ పరిశీలనమునకై, నానా శాఖాపతులను చాణక్య మహామాత్యుఁడు ప్రభుని అను మతితో నియమించెను. ఆయా రాజోద్యోగులచేత పదవీ స్వీకారప్రమాణములు చేయించెను.

"మహారాజా! నీ ప్రభుత్వము ఆర్య ధర్మ సంరక్షకమై, స్వజాతీయ సంస్కృతి సంప్రదాయ పరిరక్షకమై, సర్వ ప్రజారంజకమై వర్ధిల్లుగాక! దుష్ట శిక్షణములో, శిష్ట రక్షణ ములో నీవు నిరంతర జాగరూకుడవై వర్తింతువుగాక! వివిధ వృత్తి విశారదులైన కృషి పరాయణులకు మేలు కలుగు గాక ! శత్రుదుర్నిరీక్ష్యమై మగధరాజ్యము నీ భుజబల ప్రభా వమున, నీ పరిపాలనా సౌష్ఠవమున, నీ ప్రజారంజన సామర్థ్య మున మహాసామ్రాజ్యమై రూపొందుగాక ! విజయోస్తు !" అని చాణక్యమహామాత్యుఁడు చంద్రగుప్తమహారాజును ఉప

దేశాత్మకముగా దీవించెను. ప్రభువు సవినయముగా తల యూచెను. నాట్యవిద్యా వినోదములతో పట్టాభిషేక సభ ముగిసెను.

# ప్రతీకారము

చంద్రగుప్తుఁడు రాజ్యాధిపత్యమును స్వీకరించిన నాట నుండి ఆయన రక్షణవిషయమున చాణక్యుఁడత్యంత జాగరూకత వహించెను. చంద్రగుప్తుని నిత్యజీవన కార్యక్రమము నందును, నాహార విహారాది సర్వవిషయము లందును అప్రమత్తుఁడై యుండెను. ఒక్క-క్షణముగూడ నాతని నొంటరిగా విడువక కంటికి ఱెప్పవలె గాచుకొనుచుండెను. అయినను రాక్షసమంత్రి చంద్రగుప్త వధోపాయాన్వేషణము విరమించుకొనలేదు.

ఒకనాఁడు రాక్షసమంత్రి ప్రేరేపణమున భయదత్తుఁడను రాజవైద్యుఁ డొకఁడు చంద్రగుప్తుని సందర్శింపవచ్చెను. ఆతడు తన వెంట నొకరజితపేటికలో విషమిశ్రితమైన యొక రసాయనము దెచ్చెను. ఆ రసాయనము ప్రభువునకు జూపి "మహారాజా! ఇది దేహ స్థాపనమునకు దివ్యౌషధము. నానావిధములైన యమూల్యమూలికలతో బహుకాలము పరిశ్రమించి దీనిని సిద్ధము జేసితిని. దీనిని సేవించినవా రనతి కాలములోనే యపరిమిత బల సంపన్నులగుదురు. ఒక్క-పర్యాయము వాడి చూచినచో దీని గుణము ప్రభువులకే యవగత మగును." అని యభయదత్తుఁడు చంద్రగుప్తునకు విన్నవించుకొనెను

మహారాజు భిషగ్వర్యుఁ డిచ్చిన యా నూతన ఔషధము నందుకొనెను. చంద్రగుప్తుఁడు స్వీకరింపవలచిన మహౌషధము లన్నియు ముందుగా సుపరీక్షితములు గావలెనని చాణక్యుఁ డాజ్ఞాపించి యుండుటచే రాజానుచరు రా రసాయనమును బరీక్షింపనెంచిరి. వారు వెంటనే యౌషధము నొక బంగారు పాత్రలోఁబోసి చూచిరి. క్షణములో స్వర్ణపాత్ర వర్ణము మారినది. అది విషమిశ్రితౌషధమని చంద్రగుప్తుఁడు గ్రహించెను. ఆయన యభయదత్తుని జూచి 'భిషగ్వరా! ఎట్టి వస్తువు నైనను మొట్టమొదట నెట్ట యెదుట నున్న పెద్దల కిచ్చిగాని మహారాజులు సేవింపరు. ఈ రాజధర్మము మీకును దెలియునుగదా! అందువలన నీ మహౌషధరాజమును ముందుగా మీరు కొంత సేవింపవలెను. ఆ పిమ్మట మేము స్వీకరింతుము.'' అని పలికెను.

ఆ మాటలు వినుసరికి అభయదత్తునకు గొంతులో పచ్చి వెలగకాయ పడినట్లయ్యెను. రాజాజ్ఞను కాదనుట కాతని కవకాశము లేకపోయెను. ఆతఁడు గడగడ వడకుచు గ్రుడ్ల నీరు గ్రుడ్ల గ్రుక్కుకొనుచు భయంకర విషాక్తమైన యా యౌషధమును సేవించి క్రిందబడి యసువులు విడచెను. ఈ విధముగా నభయదత్తుఁడు తాను త్రవ్వుకొన్న గోతిలోఁ దానే పడవలసివచ్చెను. రాక్షస యత్నము మఱియొక

నూఱు విఫలమైపోయెను. అయినను రాక్షసమంత్రి తన యుద్యమము తాను విరమించలేదు.

చంద్రగుప్త శయనగృహాధికారియగు ప్రమోదకుఁడు రాక్షసానుచరుఁడు. ప్రమోదకుఁడు కొంతకాలముగా విలాస జీవితము గడుపుచు, వేలకొలది ధనమును విచ్చలవిడిగా వెచ్చించుచున్నాఁడని చాణక్యునకు సమాచార మందినది. రాక్షసనాయకమైన శత్రుపక్షముతోఁ బ్రమోదకునకు సంబంధమున్నదని చాణక్యుఁడు సందేహించెను. ఆయన యా నాఁ డాకస్మికముగాఁ జంద్రగుప్త శయనమందిరమును బరీక్షింపఁబోయెను. మందిరకుడ్యమున నొకచోట నిలువెత్తు దేవతాచిత్రము వ్రేలాడగట్టబడి యుండెను. ఉదయముననే మహారాజు శయ్యనుండి లేవగానే దైవదర్శనము జేసికొనుటకు వీలుగా నెదుట నుండవలసిన చిత్రపటము వెనుకవైపున కట్టబడియుండుటకుఁ గారణమేమో యని మహామంత్రి చాణక్యునకు సందేహము కలిగెను. ఆయన వెంటనే యా పటము నూడదీయించి చూచెను. అక్కడ గోడలో నొక మనుష్యుఁడు నిల్చుటకు వీలుగా నిలువెత్తు కన్నము కనుపించినది. దానిలోనే తళతళ మెఱయు కరవాల మొకటి నిక్షిప్తమై యున్నది. ఇది యంతయు చంద్రగుప్త మారణోద్యోగులైన శత్రువుల పన్నాగముగా మహామంత్రి గుర్తించినాఁడు. ఆయన శయనాగారమును మఱింత శ్రద్ధగాఁ బరిశీలించెను.

ఒకచోట మందిరకుడ్యము సందులోనుండి అన్నపు మెతుకులు నోటకరచుకొని బారులు బారులుగా బయటకు వచ్చుచున్న చీమల వరుసలు కనిపించినవి. చాణక్యుని సందేహము సత్యమయ్యెను. రాజశయన మందిరమున నన్నపు మెతుకులుండుటకు గారణమేమని యాతఁ డాలోచించెను. రాక్షసమంత్రి మాయాతంత్రము మహారాజ శయ్యామందిరమున గూడ ప్రవేశించినదని యాతఁడు గ్రహించెను. ఆ మందిరములోని భూగృహములో విరోధులెవ్వరో విడిది చేసి యుందురని యాయన నిశ్చయించుకొనెను.

చాణక్యుని యాజ్ఞానుసారముగా భవన కుడ్యముపై దట్టముగా గడ్డికప్పబడినది. ఆ గడ్డికి నిప్పు ముట్టింపబడినది. కుడ్యాంతర్భాగము నందలి సొరంగములో చంద్రగుప్తవధకై దాగియున్న భీభత్సకాది రాక్షసానుచరులు ఆ పెనుమంటలలో నుక్కిరిబిక్కిరియై శలభములవలె మలమలమాడి చచ్చిరి. ఆ దహనకాండ యంతయు దగ్గరనుండి చూచుచున్న ప్రమోదకునకుఁ బైప్రాణములు పైన బోసాగినవి. చాణక్యుఁడు ప్రమోదకుని బిలిచి యాతని విలాస జీవితమునకు వినియోగపడుచున్న ధనరాసులన్నియు నెక్కడనుండి వచ్చినవని గద్దించి యడిగెను. ప్రమోదకుఁడు నీళ్ళునములుచు సరియైన సమాధానము చెప్పలేకపోయెను. చాణక్య మహామంత్రి రాజద్రోహియగు ప్రమోదకుని చిత్రవధ

చేయించెను. ఈ విధముగా రాక్షసోద్దిష్టములైన చంద్రగుప్త సంహారయత్నములు చాణక్య మేధాబలమున విచ్ఛిన్నములై పోయెను.

# ముద్రికాప్రయోగము

"నందవంశము సమూలముగా నాశనమై పోయినది. మగధ రాజ్యము సురక్షితమైనది. చంద్రగుప్తుఁడు మహా రాజైనాఁడు. కాని అది చాలదు. మగధ రాజ్యము ధర్మ రక్షకమైన మహారాజ్యము గావలెను. చంద్రగుప్త మహా రాజు భారత చక్రవర్తి కావలెను. చక్రవర్తికి స్వామిభక్తి పరాయణుఁడును నిరుపమాన ప్రజ్ఞానిధియు నైన రాక్షస మంత్రి మహామాత్యుఁడు గావలయును. అవును! రాక్షస వశీకరణమే అవశ్య కర్తవ్యము. అంతవరకు నాకు శాంతి లేదు. విశ్రాంతిలేదు." చాణక్యుడు తన కుటీరములో గూర్చుండి నిశ్చయించుకొనెను.

అంతలోనే పురజనుల చిత్తవృత్తులను బరిశీలించి నివే దించుటకై నియోగింపబడిన నిపుణకుఁడు వచ్చెను. నిపుణ కుఁడు కార్యనిపుణుఁడు. ఆతఁడు మారువేషముతో యమ పటమును బట్టుకొని పాటలీపుత్ర నగర వీధులలో పరిభ్ర మించును. ప్రజలకు పాపపుణ్యములు, స్వర్గ నరకములు విన్నవించును. అందందు సమాచారమును సేకరించుకొని వచ్చి గురుదేవులైన చాణక్యులవారికి నివేదించును.

చాణక్యుఁడు ప్రశ్నార్థకముగా నిపుణకునివంక జూచెను. నిపుణకుఁడు వినమితశిరస్కుఁడై చేతులు జోడించి చంద్రగుప్తాపరక్తులను గూర్చి మహామాత్యున కిట్లు నివే దించుకొనెను.

“మహామాత్యా! ప్రజలందఱకు చంద్రగుప్త మహారాజుపై నెనలేని యభిమానమున్నది. కాని జీవసిద్ధి శకటదాసు, చందనదాసు నను ముగ్వురు మాత్రము రాక్షసాభిమానులై వర్తించుచున్నారు. అందు మొదటివాడైన క్షపణక జీవసిద్ధి రాక్షసమంత్రి యభీష్టానుసారముగా విషకన్యమూలమున పర్వతక వధకు కారణమైనాడని ప్రజలందఱు భావించుచున్నారు.

రెండవవాడు శకటదాసు. కాయస్థుఁడైన యాతఁడు రాక్షసమంత్రికిష్ట మిత్రుఁడైనవాఁడు. ఎప్పటికప్పుడు రాజ్యరహస్యములను రాక్షసమంత్రికి చేరవేయుచున్నాడు.

ఇక మూడవవాడు చందనదాసు. ఆతడు పేరు ప్రతిష్ఠలు సంపాదించిన రత్నాలవ్యాపారి. రాక్షసమంత్రికి ప్రాణమిత్రుఁడు. రాక్షసామాత్యుల భార్యాపుత్రుల నింట నుంచుకొని గుప్తముగాఁ గాపాడుచున్నవాఁడు. నిన్నటి యుదయమున నేను వీధులలోఁ దిరుగుచు చందనదాసు నింటికిబోయి యమపటముఁ బ్రదర్శించి పాటలు పాడుచుంటిని. అంతలో నయిదేండ్ల బాలుఁ డొకడు నాపాట విని గదిలోనుండి బయటకు వచ్చెను. వెంటనే మేలిముసుగు ధరించియున్న యొక స్త్రీ రత్నము పరుగు పరుగున లోపలనుండి వచ్చి బాలుని చేయిపట్టుకొని లోని కీడ్చుకొని పోయినది. ఆ తొందరలో నామె చేతి వ్రేలునుండి జారిపడిన ఈ రత్నాంగుళీయకము

దొరలుచు వచ్చి నా పదముల సమీపము చేరినది. నేను దాని నందుకొని యీవలకువచ్చి చూడగా నది యమాత్య రాక్షస నామాంకితమై యున్నది.

అందువలన నా తల్లిబిడ్డలు రాక్షస మంత్రుల వారి సతీసుతులే యైయుండవలెనని నా యభిప్రాయము.” నిపుణ కుఁడు రాక్షస ముద్రాంకితమైన రత్నాంగుళీయకమును మహామాత్యుల ముందు పెట్టెను.

దానిని చూచి చాణక్యుఁడు మహానంద మందెను. “అమాత్య రాక్షసా! ఇప్పుడు నా చేతికి చిక్కినది నీ యంగుళీయకము కాదు, నీవే!” అని చాణక్యుఁడు రాక్షస ముద్రాంకితమైన అంగుళీయకమును చేతఁబట్టుకొనెను. అతడు నిపుణకుని కార్య నైపుణ్యమును ప్రశంసించి సబహుమానముగా సెలవిచ్చి పంపెను.

అంతలో మహామాత్యుల సన్నిధికి చంద్రగుప్తుఁ డొక వార్త నంపెను. “ఆర్యా! మహామాత్యుల యభీష్టానుసారము పర్వతకరాజునకు పరలోకక్రియలు చేయగోరుచున్నాము. ఆ సందర్భమున పర్వతకరాజు మరణకాలమున ధరించియున్న స్వర్ణాభరణములను యోగ్యులగు విప్రవర్యులకు దానము

చేయవలచితిమి. గురుదేవుల యభిప్రాయము నెఱుఁగఁ గోరుచున్నాము.”

చంద్రగుప్తుని హృదయజ్ఞతకు, నౌచిత్యశుద్ధికి చాణక్యుఁడు సంతసించెను.

“మంచిది. మహారాజుల యభిప్రాయము ప్రకారమే జరుగుగాక!

ఉత్తమములైన పర్వతప్రభుని యాభరణముల నుత్తమ విప్రులకే దానము చేయవలెను. కనుక నేను సర్వోత్తమ గుణసంపన్నులైన బ్రాహ్మణశ్రేష్ఠులను దాన ప్రతిగ్రహణార్థమై ప్రభువులయొద్దకు పంపించెదను.” అని చాణక్యుఁడు మహారాజుకు సమాధానము పంపెను.

ఆయన వెంటనే తనకు పరమాప్తులైన ముగ్గురు విప్రులను రావించెను. ప్రభు సన్నిధికిఁబోయి పర్వత కాభరణములను బరిగ్రహించి తెండని వారి నాజ్ఞాపించెను.

వారట్లుపోయి తెచ్చి యిచ్చిన యాభరణత్రయమును తన యనుచరులకిచ్చి వర్తక వేషములతో మంజు పట్టణమున కేగి వానిని రాక్షసమంత్రికి విక్రయించి రండని ముదల యిడెను.

అనంతరము ఆయన యొక లేఖను వ్రాయించి సిద్ధార్థకుఁడను తన శిష్యునకిచ్చి యతని మిత్రుఁడైన శకటదాసుని చేత దానికి మరియొక ప్రతి వ్రాయించుకొని రమ్మని పంపెను.

సిద్ధార్థకుఁడు శకటదాసుని జేరి యాతని యక్షర శిల్పమును ప్రశంసించి తన కార్యమును సాధించుకొని వచ్చెను.

చాణక్యుఁడు శకటదాసు వ్రాసియిచ్చిన లేఖపై రాక్షసాంగుళీయక ముద్ర వేయించి ఉంగరముతోపాటు సిద్ధార్థకుని చేతికిచ్చెను.

ఆతనిని రాక్షసమంత్రి యొద్దకు పంపుటకై యొక యుపాయము పన్నెను.

రాక్షస ప్రేరితుఁడై రాజమంత్రులకు ప్రాణప్రమాదముఁ గలిగింపఁ దలచినాఁడని శకటదాసుపై నేరమునోపి యాతనికి మరణశిక్ష విధించెను. అనుకూలురైన తలారులను బిలిచి శకటదాసును కొరతవేయవలసినదని యాజ్ఞాపించెను.

సిద్ధార్థకుని జూచి "విన్నావు గదా! ఇప్పుడే శకటదాసును తలారులు వధ్యస్థానమునకు గొనిపోవుదురు నీవు సాయుధుఁడవై ముందుగానే యచటకుఁజేరి తలారుల బారి

నుండి శకటదాసును గాపాడి రాక్షసమంత్రి యొద్దకు గొని పొమ్ము.)

రాక్షస మిత్రుఁడైన శకటదాసుని రక్షించినందుకు మేము నిన్ను నాశనము చేయుదుమను భయమును నటింపుము రాక్షసమంత్రి సన్నిధిలోనేయుండి నమ్మించి, సముచితసమయమున ఈ ముద్రాంకితమైన లేఖను మలయకేతువునకు జూపుము. రాక్షస మలయకేతువులకు శాశ్వత విరోధము సృష్టింపుము.” అని చాణక్యుఁడు కర్తవ్యము చెప్పి పంపెను.

సిద్ధార్థకుఁడు గురూపదేశానుసారము శకటదాసును రక్షించి యాతనితోఁబాటు రాక్షసమంత్రి సన్నిధికి చేరెను.

రాక్షసమంత్రి పట్టరాని సంతోషముతో ప్రాణమిత్రుఁడైన శకటదాసునకెదురేగి వచ్చి ప్రేమమీఱ గాఢాలింగనము చేసికొనెను.

“మిత్రమా! శకటదాసా! ఆ చాణక్య హతకుని బారినుండి నీ వెట్లు బ్రతికి వచ్చితివయ్యా?” రాక్షసమంత్రి ప్రియమిత్రుని సాదరము ప్రశ్నించెను.

శకటదాసు రాక్షసమంత్రికి తన వెంటనున్న సిద్ధార్థకునిఁ జూపుచు “మహామాత్యా! వాని బారినుండి నేను బ్రతికి వచ్చుటకు కారణమైన వాఁడీ పుణ్యాత్ముఁడు!

చంద్రగుప్త [illegible]కై దాచిన ద్రవ్యములను నేనే [illegible]ంచి తినని నేరము మోపి ఆ చాణక్యుఁడు నాకు ప్రాణదండనము విధించినాఁడు. ఆతని యాదేశానుసారముగా తలవరులు నన్ను వధ్యస్థానమునకు గొనిపోవునప్పుడు దేవునివలె వచ్చి వారిని పారద్రోలి నాకు ప్రాణభిక్ష పెట్టిన పరమాప్తుఁడీతఁడు. ఈతని పేరు సిద్ధార్థకుఁడు" అని ప్రియమిత్రుని పరిచయము చేసెను. రాక్షసమంత్రి తన మిత్రునికి ప్రాణదానము చేసిన సిద్ధార్థకుని బహువిధముల ప్రశంసించెను. ఆనందాతిశయముతో తన కంఠములోని రత్నహారమును దీసి యాతనికి బహుమానముగా నిచ్చెను.

రాక్షసమంత్రి ప్రేమాదరములకు సిద్ధార్థకుఁడు మిక్కిలి యానందపడెను. చాణక్యోపదేశమును స్మరించి సర్వమును సక్రమముగా జరుగుచున్నందులకు సంతోషపడుచు "మహామాత్యా! ఈ హారమును దమ యొద్దనే భద్రము చేయుఁడు. ఇచ్చట నంతయు నాకు క్రొత్త యగుటచే దీనిని నేను భద్ర పరచుకొనలేను. అవసరమైనప్పుడు నేనే మఱల అడిగి తీసికొందును" అని యా హారము నొక పేటికలోనుంచి, దానిమీఁద తన దగ్గరనున్న రాక్షస నామాంకితమైన యంగుళీయకముద్ర వేసెను.

సిద్ధార్థకుఁడు నగల పెట్టెపై వేసిన రాక్షసాంగుళీయ ముద్ర చూచి శకటదాసు విస్మితుఁడయ్యెను. రాక్షసమంత్రి

యాశ్చర్యభరితుఁడై "మిత్రమా! సిద్ధార్థకా! ఆ యుంగ రము నీ కెట్లు దొరికినది?" అని సిద్ధార్థకు నడిగెను. సిద్ధార్థకు డమాయకత్వమును నటించుచు "ఇదియా! ఇది నాకు పాటలీ పుత్రములో చందనదాసను నొక రత్నాల వర్తకుని యింటి కడ దొరికినది. కావలసినచో మీరు తీసికొనుఁడు" అని యంగుళీయమును రాక్షసమంత్రి కందిచ్చెను. ఆ మాటలు విని చందనదాసు నింటనున్న తన భార్య వ్రేలినుండియే యా యుంగరము పొరబాటున జారిపడి యుండునని రాక్షసమంత్రి యూహించెను. ఆతఁడు సిద్ధార్థకుని పలు తెఱఁగుల కొని యాడి యపరిమిత ధనమును బహుమానముగా నిప్పించెను! ఆ యుంగరము నధికార చిహ్నముగా దగ్గర నుంచుకొనుమని శకటదాసున కిచ్చెను.

సిద్ధార్థకుఁడు తన నాటకము చక్కగా రక్తిగట్టుచున్న దని పరమానంద మందుచు "మహామాత్యా! ఒక్క మనవి. శకటదాసును వధ్యస్థానములో రక్షించినందుకు నాపై ఆ చాణక్యుఁడు కారాలు మిరియాలు నూరుచుండును. నాపేరు విన్నంతనే కస్సుబుస్సు మనుచుండును. నే నిప్పుడు మఱల పాటలీపుత్రమునకుఁ దిరిగి వెళ్ళినను వాఁడు నన్ను బ్రతుక నీయడు. అందువలన ఇంక నే నిక్కడ నే యుండి మీ పాద సేవ చేసికొనుచుందును. అనుమతింపుఁడు" అని రాక్షస మంత్రిని వేడుకొనెను.

రాక్షసమంత్రి కృతజ్ఞతాభావముతో "మంచిది. సిద్ధార్థకా! మిక్కిలి సంతోషము. నీ యభిమతము మాకు తెలియక పోవుటచే మేమే ముందుగా నట్లు నిన్ను గోరలేకపోయితిమి. నీ యిష్టానుసారమే మా కొలువున నుండుము." అని పలికెను. సిద్ధార్థకుఁడు రాక్షసమంత్రి కాంతరంగిక మిత్రుఁడయ్యెను. అక్షరశిల్పియగు శకటదాసు రాక్షసమంత్రియొద్ద లేఖకుఁడయ్యెను.

# మహాజాలము

చాణక్యుఁ డిప్పుడు చందనదాసును గూర్చి యాలో చించెను. చందనదాసు రాక్షసమంత్రికి ప్రాణాధిక ప్రియ మిత్రుఁడు, పరమ విశ్వాసపాత్రుడు, న్యాయశీలుఁడు కను కనే రాక్షసమంత్రి తనభార్యా పుత్రులసంరక్షణ భారమును నాతనిపై నుంచి పోయినాడు. ఇప్పుడు చందన దాసును రావించి నయమునను భయమునను రాక్షసమంత్రి కుటుంబము నధీనముఁ జేయుమని యాదేశింతును. అతడందుల కంగీ రించెనా రాక్షసమంత్రి భార్యాపుత్రుల రక్షణ కొఱకై మాకు లొంగిపోక తప్పదు. లేదా రాక్షసపక్షపాతి యను నెపమున చందనదాసునిపై నేర మారోపించి మరణశిక్ష విధింతును. అప్పుడు మిత్రప్రాణరక్షణార్థమైనను రాక్షసమంత్రి మాకు దాసోహ మనక తప్పదు, ఎట్లయినను నీ చాణక్య తంత్రమునకు రాక్షసమంత్రి చిక్కుపడక తప్పకొనలేఁడు" అని చాణక్య మహామాత్యుఁడు భావించుకొనెను. అతఁడు వెంటనే చందనదాసును గొనిరండని భటులను బంపెను.

చాణక్యాదేశానుసారము చందనదాసు మహామాత్యుని సన్నిధికి వచ్చెను. "మహామాత్యులకు మణికారశ్రేష్ఠి చందన దాసు నమస్కరించు చున్నాడు." అని చందనదాసు చాణ

క్యుని ముందు చేతులు మోడ్చి నిలిచెను. చాణక్యుఁడు కన్నెత్తి చూచెను.

"ఎవరు? చందనదాసశ్రేష్ఠియా! రమ్ము రమ్ము. ఈ పీఠముపైఁ గూర్చుండుము. కుశలమే కదా!" చాణక్యుఁడు శ్రేష్ఠిని బలుకరించెను. చందనదాసు సముచితముగా సమాధానము చెప్పెను. చాణక్యుఁడు చందనదాసును బేరసారములను గూర్చియు, లాభనష్టములను గూర్చియుఁ బ్రశ్నించెను. చందనదాసు సవినయముగా "ఆర్యచాణక్యుల యనుగ్రహమున వ్యాపారములకేమియుఁ గొదువలేదు." అని బదులు పలికెను. చాణక్యుఁడు "చంద్రగుప్త పరిపాలనములో మీ కెవ్వరికి కష్టములు గలుగుట లేదుకదా!" అని శ్రేష్ఠి నడిగెను. చందనదాసు "చంద్రగుప్తమహారాజుల పరిపాలనము శరచ్చంద్ర సుధాసారమువలె లోకాహ్లాదకరముగా నున్న" దని ప్రశంసించెను.

అప్పుడు చాణక్యుఁడు ముఖ్యవిషయమును బ్రస్తావించెను.

"మఱి అట్టి సంతుష్టి పొందుచున్న ప్రజలు ప్రభువులకు దగిన ప్రతిఫలము నర్పింపవలయును."

"అదేమో సెలవిండు. ఎంత ధనమిమ్మందురో తెచ్చి యిచ్చెదను."

"అట్లు ధనము గోరుటకు ఇప్పుడు మగధమహారాజు ధననందుఁడుకాఁడు - చంద్రగుప్తుఁడు!"

"మఱి ప్రభుసంతోషమునకు నే నేమి చేయవలెనో తెల్పుఁడు."

"ఏమియు లేదు. నిష్కారణముగా మీవంటి ప్రజలు కష్టములపాలు గాకుండ సక్రమముగా ప్రవర్తించిన చాలును. మహారాజు పరమానందభరితుఁడగును."

"ధన్యుఁడను. మహామాత్యా! ధన్యుడను. మహారాజులవారి కెట్టి క్లేశమును గలుగరాదనియే నా కోరిక."

చందనదాసు మాటలకు చాణక్యుని కొఁడలు ముడి పోయెను. "ఓయి శ్రేష్ఠీ! ఇంక నీ ధూర్తవినయములు గట్టి పెట్టుము. నీవు రాజద్రోహము చేయుచున్నట్లు ఋజువగు చున్నది! అందులకేమందువు?" చాణక్యుఁడు భీకరముగా గర్జించెను.

చందనదాసు చెవులు మూసికొని "పాపము శమించు గాక! మహామాత్యా! తృణాంకురములకు దావాగ్నితో విరోధమేమి!" అని పలికెను.

"శ్రేష్ఠీ! రాజద్రోహియగు రాక్షసమంత్రి కుటుంబములు నీయింటదాచి యుంచినమాటనిజమేనా?" చాణక్యుఁడు

తీవ్రస్వరమున ప్రశ్నించెను. చందనదాసు నిస్సంకోచముగా "అబద్ధము. రాక్షసమంత్రి కుటుంబము నాయింటనున్న మాట నిజముకాదు." అని బదులు పలికెను. చాణక్యుఁడాతని వంక చుఱచుఱచూచి "నీవిప్పుడు చెప్పినమాట యబద్ధము! రాక్షసుని కుటుంబము నిన్నటి వఱకు నీ యింట నున్నట్లు మాకు ప్రత్యక్ష ప్రమాణము లభించినది. నిజము చెప్పుము" అని గద్దించి యడిగెను. చందనదాసు నిర్భయముగా "మహాత్మా! రాక్షసమంత్రి నగరమునుండి వెడలిపోవునపుడు తన గృహజనమును మా యింట నుంచిన మాట నిజమే. కాని కొలది కాలము తర్వాత మఱలివచ్చి వారి నెచ్చటికో తోడ్కొని పోయినాఁడు. ఇప్పుడు వారు మా యింట లేరు" అని చెప్పెను.

చాణక్యుఁడు వికవికనవ్వి "అట్లు చెప్పుము. అబద్ధమాడుటకూడ చేతగాని వాఁడవునీవు! ఇంత కొంకక్షణము ముందే వారు నా యింట లేరంటివి! ఇప్పుడు కొంతకాలమున్నారంటివి! సరిగా చెప్పుము. వారెచ్చట నున్నారు." అని ప్రశ్నించెను. చందనదాసు "నాకు తెలియ"దనెను. చాణక్యుఁడు మండిపడుచు "ఓరి రాజద్రోహీ! నీవునన్ను వంచింపలేవు! మా వలన ప్రమాదము శంకించి నీవు రాక్షసకుటుంబము నెచ్చటనో రహస్యముగా దాచి వచ్చియుందువు! వెంటనే వారిని మాకప్పగించి నీ దారాపుత్రాదులతో నీవు

సుఖముగా నుండుము. లేదా నీకు సర్వనాశనము తప్పదు." అని గర్జించెను.

చందనదాసు చేతులు నలుపుకొనుచు "ఆర్యా! నమ్మిన వానిని చెఱచు స్వభావము నాదికాదు." అని చాణక్యునకు సమాధానము చెప్పెను.

అంతలో నా ప్రాంతమున నేదియో పెద్ద కలకలము వినవచ్చెను. ఆ కలకలము నుద్దేశించి చాణక్యుఁడు "చూచితివా శ్రేష్ఠీ! రాజద్రోహుల కెట్టి దురవస్థ కలుగునో యటు చూచి తెలిసికొనుము. అదుగో! నీవలెనే రాక్షసపక్షపాతియై ప్రవర్తించినందుకు ఒకానొక రాజద్రోహి మరణశిక్ష పొంది వధ్యస్థానమునకు గొనిపోబడు చున్నాఁడు ప్రజలందఱు వానిని గేలిచేయుచు వెంటబడుచున్నారు." అని చందనదాసును హెచ్చరించెను. కాని చందనదాసు మిత్రద్రోహమున కంగీకరింపలేదు. రాక్షసకుటుంబము నప్పగించుటకుసమ్మతింపలేదు. తాను సర్వనాశనమై పోయినను తన్ను నమ్మిన రాక్షసమంత్రిని వంచించుట కాతఁ డిష్టపడలేదు.

ఎట్టకేలకు చాణక్యుఁడు "చూడు శ్రేష్ఠీ! నీకేలనయ్యా! ఈ యకారణప్రాణార్పణము! నీవేమి రాజ్యము లేలువాఁడవా? యేలించువాఁడవా? ఈ రాజకీయ కల్లోలములో నీవేల తల దూర్చెదవు? నామాటవిని రాక్షసకుటుంబమును దెచ్చి నా కప్పగింపుము. కడుపులోఁ జల్ల కదలకుండ నీవుసుఖముండుము.

ఆప్తవాక్యము లాదరించి రాజానుగ్రహమునుం బొందుము. అని అనునయముగా బలికెను.

చందనదాసు తల అడ్డముగ ద్రిప్పెను. "మహామాత్యా! మీరు నాకుఁ జెప్పెదరు, నయ్యది యొప్పఁదు. మిత్రద్రోహము నాచేతగాదు. ఆపై మీరు నన్ను కొట్టినను దిట్టినను చంపినను మీయిష్టము." అని యాతడు ఖండితముగాఁ బలికెను.

"అవును. నీ శిరముపై మృత్యుదేవత తాండవమాడుచుండగా నీకు హితోక్తు లెట్లు రుచించును! అయినను నందులను మేము నిర్మూలించినట్లు, చంద్రగుప్తుని రాక్షసమంత్రి యున్మూలింపగలఁడని కలలోఁ గూడ భావింపకుము. ఈ చాణక్యరక్షితుఁడైన చంద్రగుప్తుని రూపుమాపుట యనగా వెన్నెలను చంద్రునినుండి వేఱుచేయుట - గజేంద్ర రక్తపానలోలమైన మృగేంద్రము కోఱను బెకలింపఁ జూచుట. తెలిసినదా?" చాణక్యుఁడు సగర్వముగాపలికెను.

చందనదాసు బదులు పలుకలేదు.

"శ్రేష్ఠీ! ఆప్తవాక్యము నాదరింపుము. ఆత్మరక్షణము చేసికొమ్ము. అతి విచిత్రమైన రాజానుగ్రహము పొందుము. రాజద్రోహులను దీవ్రముగాశిక్షించు చంద్రగుప్తమహారాజు క్రోధాగ్నికి గుఱికాకుము. ఇతరుని భార్యాపుత్రుల నప్ప

గించి నిన్ను నీ భార్యా పుత్రులను గాపాడుకొనుము." అని చాణక్యుఁడు చందనదాసున కుపదేశించెను.

"మహామాత్యా! ఆత్మాపరాధమునగాక మిత్రకార్యమున నేను సర్వనాశనమైనను నాకు సంతోషమే! ఇక మీ యిష్టము." చందనదాసు తన దృఢ నిశ్చయముఁ దెల్పెను.

చివరకు చాణక్యుఁడు చందనదాసు నింటగల సర్వమును గొల్లగొట్టి తెచ్చి కోశాగారమునఁ జేర్చుడు. వీనిని సకుటుంబముగాఁ గారాగారమున బంధింపుఁడు. తగిన సమయమున మహారాజు వీనికి మరణశిక్ష విధించును." అని యాజ్ఞాపించెను.

చందనదాసు మిత్రకార్యమునకై తనకు ప్రాణార్పణము చేయు నవకాశము లభించుచున్నందులకు సంతసించుచు రాజభటుల వెంట నడచెను.



# మిత్రభేదము

మంజు పట్టణములో మలయకేతువు రాక్షసమంత్రి ప్రోద్బలమున సైన్య సమీకరణము సాగించుచున్నాఁడని చాణక్యునకు దెలియవచ్చినది. మహాబలుఁడైన మలయకేతువునకు రాక్షసమంత్రి మంత్రాంగ శక్తియేగాక, మ్లేచ్ఛ రాజుల చతురంగ బలములుగూడ తోడై యున్నవని చాణక్య మహామాత్యునకు వార్త అందినవి.

అసంఖ్యాకములైన యవన గాంధార శక హూణ సైన్యములు మంజు పట్టణములో విడిసియున్నవనియు, నచిర కాలమున మలయకేతువు మగధదేశముపై దండెత్తి వచ్చు ననియు చాణక్యచారులు నివేదించినారు.

చాణక్యుఁడు శత్రుబల విచ్ఛేదమునకై పథకముఁ బన్నెను.

మలయకేతువు సైన్యములో చంద్రగుప్తానురక్తులైన సేనాపతులుండుట ప్రయోజనకరమని యాయన భావించెను. అందులకై యాయన భద్రభట పురుదత్తాది సైనికోద్యోగు లను బిలిపించెను. వారికి మలయకేతుని సమరసన్నాహములు వివరించి చెప్పెను.

“మిత్రులారా ! మిమ్ము రాజద్రోహాపరాధము నారోపించి నగరమునుండి వెడలగొట్టుచున్నాము. మీ రందఱు మగధదేశము విడిచి, మంజునగరముఁ జేరి మలయకేతువు నొద్ద నాశ్రయము పొంది సైనికోద్యోగములు నిర్వహించుచుండుఁడు.

చంద్రగుప్తునితో మీకు ప్రబల విరోధము ప్రాప్తించినట్లు వారిని నమ్మింపుఁడు.

చంద్రగుప్త మహారాజుకు సంగ్రామ సహచరులైన మీ యందఱిపై నన్యాయముగా నపరాధములు మోపబడినవని మలయకేతువుకు వివరింపుఁడు.

నిష్కారణముగా మీపై నపోహపడి మహారాజు మిమ్ములను పదభ్రష్టులను గావించినాఁడని తెలుపుఁడు.

మీ రందఱు చంద్రగుప్తునికి ప్రతీకారము చేయుటకే మలయకేతువు నాశ్రయించినట్లు నటింపుఁడు. అందులకు మీకు అచటనేయున్న మన భాగురాయణుఁ డుపకరింపగలఁడు. అతని సాయమున మీరు మలయకేతువు కొలువులో నున్నతస్థానము లాక్రమింపుఁడు.

సమయసముచితముగా వ్యవహరించుచు రాక్షసమలయకేతువుల కభిప్రాయ భేదము గల్పింపుఁడు. వారికి పరస్పర

ద్వేషము గల్పించి రాక్షసమంత్రిని నిస్సహాయునిగా, నిరా శ్రయునిగా జేయుటకై ప్రయత్నించుచున్న భాగురాయణు నకు తోడ్పడి రాక్షసవశీకరణములో, మలయకేతువు బంధ నములో నూపకరింపుడు.

యుద్ధసమయములో మలయకేతువును వెన్నంటి యుండి, తరుణము దొరకగనే పట్టి బంధించి నాకు సమర్పిం పుడు. అప్రమత్తులై మీ ప్రభుభక్తిని యథాపూర్వముగ నిరూపించుకొనుడు.''

చాణక్య మహామాత్యుడు భద్రభటాదుల కుపదే శించెను.

వారందఱును మహామంత్రి యాజ్ఞానుసారము కర్తవ్య పాలనకై మంజు పట్టణమునకు బయలుదేరిపోయిరి.

అనంతరము చాణక్య ప్రేరితులైన వణిక్ప్రముఖులు పర్వతరాజ రత్నాభరణములను రాక్షసమంత్రికివిక్రయించు టకై పోయి ముందుగా శకటదాసును సందర్శించిరి. శకట దాసు పరమ రమ్యములైన ఆ రత్నాభరణములను జూచి ముచ్చటపడి వానిని రాక్షసమంత్రి కడకు పంపి "కొనుమం దురా'' అని యనుమతి నడిగెను. మున్నొకసారి తనకోసరమై మలయకేతువు బహుమతిగా బంపిన మణిహారమును తాను

సిద్ధార్థకునికి బహూకరించి యుండుటచే ప్రస్తుతము తాను ధరించుటకు తగిన హారము రాక్షసమంత్రికి లేకపోయెను. అందుచే నతడు రమణీయములైన యీరత్నభూషణములను తగిన వెల యిచ్చి కొనవలసినదని శకటదాసు నాజ్ఞాపించెను. వణిక్ప్రముఖులు సఫల మనోరథులై మరలిపోయిరి.

ఇచ్చట రాక్షసమంత్రి ఇంట రత్నభూషణ స్వీకారము జరుగుచుండగా నచట మలయకేతువు భవనమున భద్ర భటాదుల పదవీ స్వీకారము జరిగెను. భద్ర భటాది సైనికోద్యోగులు భాగురాయణ పురస్సరముగా మలయ కేతువును సందర్శించిరి.

"మహారాజా! ఇంతదనుక మేము భక్తి ప్రపత్తులతో నందరాజులను సేవించితిమి. కాలవశమున నంద వంశము నిర్మూలనమైపోయినది.

ఈనాడు మేము పూర్వశత్రువైన చంద్రగుప్తుని సేవించుట మా యాత్మగౌరవమునకు భంగకరము. అంతేగాక అచ్చట నా చంద్రగుప్తుడు నామమాత్ర ప్రభువు! పరిపాలన మంతయు నా కుటిలోపాయధురీణుడైన చాణక్య మంత్రి యాజ్ఞానుసారమే జరుగుచుండును. అట్టి పనికిమాలిన ప్రభువును సేవించుట మాకు పరువుతక్కువ యనిపించినది. అయి

నను మేమెట్లో కాలము గడుపుచుండగా నా చాణక్య మంత్రి ప్రోద్బలమున నస్వతంత్రుఁడైన చంద్రగుప్తుఁడు మాపై నేవియో యభియోగములు మోపి బాధించినాఁడు. మాకు వానికొలువు ప్రాణాంతకముగా నున్నది. అచ్చట నుండుటకంటె తమవంటి పరాక్రమశీలురైన ప్రభువుల పాద సన్నిధిలో నుండుట మాకు పరమానందకరము. సామర్థ్య పరిజ్ఞానము లేని యా చంద్రగుప్తునిసేవ మావంటివారికి సముచితము కాదని నిశ్చయించుకొంటిమి. మేము మున్ను భాగురాయణులవారి మాట వేదవాక్యముగా మన్నించెడి వారమనియు, నిప్పుడు తన యాజ్ఞలను ధిక్కరించుచున్నా మనియు నారోపించి యా చంద్రగుప్తుఁడు మమ్ము దేశబహి ష్కృతులను గావించినాఁడు. మేము గుణగ్రహణపారీణు లైన తమ సమక్షమునకు వచ్చితిమి. మా స్వభావములును, స్వామిభక్తియు, మన భాగురాయణులవారికి తెలియనిది కాదు." అని వారు మలయకేతువునకు విన్నవించుకొనిరి.

వెనువెంటనే భాగురాయణుఁ డందుకొని భద్రభటా దులు విశ్వాసార్హులనియు, శౌర్యసంపన్నులనియు, వారి సహాయమున చంద్రగుప్తు ననాయాసముగా మట్టుబెట్టవచ్చు ననియు మలయకేతునికి ప్రబోధించెను.

మలయకేతువు భాగురాయణుని మాటలు నమ్మెను. మగధసైన్య రహస్యములు సమగ్రముగా నెఱిఁగిన భద్ర

భటాదులు తన విజయమునకు బహువిధములుగాఁ బనికివత్తు
రని భావించి మలయకేతువు యథార్హముగా వారి కందఱకు
సైనికోద్యోగము లిచ్చెను. భద్రభటాదులు పదవీస్వీకార
ములు చేసి కర్తవ్య పరాయణులైరి.

# కృతక కలహము

ఆనాఁడు కౌముదీమహోత్సవము. చంద్రగుప్తమహారాజు పట్టాభిషేకానంతరము జరుగుచున్న మొదటి యుత్సవమది! మహోత్సవమును స్వయముగ సందర్శించు కుతూహలముతో చంద్రగుప్తమహారాజు సుగాంగ ప్రాసాద ప్రదేశమును రమణీయముగా నలంకరింపుఁడని రాజసేవకుల నాజ్ఞాపించెను రాజాజ్ఞ నిర్వర్తింపబడినది.

నగరమంతయు నానావిధాలంకారములతో శోభాయమానముగా నుండెను. కుసుమపురము సార్థకాఖ్యమై సురభి సుందరమై విలసిల్లుచుండెను. ప్రజలందఱు సమధికోత్సాహ సంపన్నులై గృహాలంకరణములు గావించుకొనుచుండిరి. రాజమార్గములు పన్నీటి జల్లులతో పుష్పతోరణములతో నగరు ధూపములతో రాజిల్లుచుండెను. ఎల్లెడల మంగళ పతాకలు, మయూరధ్వజములు విలసిల్లుచుండెను. తీర్చిదిద్దిన ముత్యాల ముగ్గులతో రత్నాల రంగవల్లులతోఁ బాటలీపుత్రముననిల్లిల్లును గన్నుల విందు గావించుచుండెను.

పవలు గడచినది. రాత్రివేళయైనది. దిక్కులెల్ల శరదిందు శోభాసుందరములై తేజరిల్లుచున్నవి. మహారాజు కౌముదీ మహోత్సవ సందర్శనాభిలాషతో సుగాంగ ప్రాసా

దా్రగమున నిలిచి చూచెను. ఎచ్చటను నుత్సవ సంరంభము కనుపించలేదు. ప్రజాసంచారముగోచరించలేదు. నగరమంతట నిశ్శబ్దనై రాశ్యము లావరించియుండెను. మహారాజు విస్మయ భరితుండై కంచుకిని బిలిచి కౌముదీ మహోత్సవము జరుగ కుండుటకుఁ గారణమేమని ప్రశ్నించెను.

ఉత్సవముని షేధింపబడినట్లు ప్రకటింపబడినదనికంచుకి నిరుత్సాహముగా బదులుచెప్పెను.

మహారాజు క్రోధోద్వేగమున సంచలించిపోయెను తన యాజ్ఞను ధిక్కరించి, తన నగరమున నయనానందకరమైన ఈ మహోత్సవమును నిషేధించిన వారెవ్వరని తిరిగి ఆయన ప్రశ్నించెను.

"చాణక్య మహామాత్యులవారు తప్ప తమ యాజ్ఞను గాదనగలవా రెవరున్నారు ప్రభూ?" యని కంచుకి సమాధానము చెప్పెను. ఆర్యచాణక్యులు తన యనుమతిలేకుండ కౌముదీ మహోత్సవమును నిషేధించి నందులకు చంద్రగుప్త మహారాజు మండిపడెను. ఆయన వెంటనే "చాణక్యుల వారిని మేము చూడగోరుచున్నాము" అని కంచుకి నాజ్ఞాపించెను. కొలదిసేపటికి రాజాజ్ఞానుసారము చాణక్యామాత్యుఁడు రాజ ప్రాసాదమున కరుదెంచెను.

"జయము జయము మహారాజు!" మహామాత్యుఁడు ప్రభువును దీవించెను.

"ఆర్యా! వివిధరాజన్య మకుట ఘటిత మణిమయూఖ కాంతికలిత పాదపద్ముఁడగు మగధాధిపతి మౌర్యచంద్ర గుప్తుఁడు నమస్కరించుచున్నాడు. రండు. ఈ పీఠము నలంక రింపుడు" మహారాజు సముదాచార సంపన్నముగఁ బలికెను.

"మంచిది మహారాజా! మమ్మేందులకు పిలువనంపి తిరి?"

"తమ సందర్శన భాగ్యమున కృతార్థుఁడ నగుటకు."

"ప్రభువులు నిష్ప్రయోజనముగా మావంటి ప్రధాన రాజోద్యోగులనుఁ బిలువనంపరుగదా!"

"అయిన మా ప్రశ్నలకు సరియగు సమాధానములు చెప్పుడు."

మహారాజు సాధికారముగాఁ బలికెను. మహామా త్యుఁడు చిఱునవ్వునవ్వి యూరకుండెను. ఆ యనాదరసూచక దరహాసరేఖ చూడగానే మహారాజు కోపోద్రిక్తుఁ డయ్యెను.

"మహామాత్యా! ఈ రాజ్యమునకుఁ బ్రభువెవ్వరు?" చంద్రగుప్త మహారాజు చాణక్యామాత్యుని తీవ్రముగాఁ బ్రశ్నించెను.

చాణక్యుఁడు నిస్సంకోచముగా "రాజ్యమునకు చంద్రగుప్త మహారాజే ప్రభువు! కాని రాజ్యరక్షణభార మమాత్యులది." అని సమాధానము చెప్పెను.

"మరి మే మాజ్ఞాపించిన కౌముదీ మహోత్సవమును మీ రేల నిషేధించితిరి! అది రాజ్యరక్షణమున కత్యవసరమా?" మహారాజు మరల ప్రశ్నించెను.

"అవును. అయినను, కాకపోయినను నీవు మా శిష్యుఁడవు. మా యభిరుచిని మన్నింపవలెనేగాని మమ్ము ప్రశ్నించుటకు నీ కధికారము లేదు. మ మ్మాజ్ఞాపించుటకు నీ కర్హత లేదు." చాణక్యుడు ప్రతిసమాధాన మిచ్చెను.

గురు శిష్యుల వివాదము మఱింత తీవ్రమైనది.

"మీ యిచ్చవచ్చినట్లు వ్యవహరించుటకు మేము ప్రభువులము గాని పరిజనులము గాము." మహారాజు సాధికారముగాఁ బలికెను.

అంతలోనే రాక్షసప్రేరితుఁడైన వైతాళికుఁ డొకఁడు ప్రభు ప్రశంసాపూర్వకముగ "మహారాజా! తమవంటి వీరవరేణ్యులగు ప్రభువులు ఆజ్ఞాభంగము నోర్వఁజాలరు. తిరస్కృతాత్మ శాసనుఁడు ప్రభు పదమున కర్హుఁడే కాఁడు." అని పలికెను.

ఆ ప్రశంసవిని చంద్రగుప్త మహారాజు సంతసించి ఆ వైతాళికునకు వేయి బంగారునాణెములు బహుమతి ఇమ్మని రాజోద్యోగుల నాజ్ఞాపించెను.

కాని చాణక్యుఁ డడ్డుపడి "ఈ విధముగా ప్రశంసల కుబ్బి రాజకోశమును శూన్యము చేయరాదు." అని పలికెను. మహారాజు ఆగ్రహావేశముతో "ఆ మాత్రము స్వేచ్ఛ మాకు లేనిచో, మా కీ రాజ్యాధికారము బంధనమే కాని ప్రభుత్వము కాదు." అని చిరాకుపడెను.

చాణక్యుఁ డనెను. "అవును. అంతే! [illegible] సర్వ కార్య సిద్ధియు సచివాయత్తమని నీవు గ్రహింపవలయును. స్వాతంత్ర ముగా రాజ్య వ్యవహారము నిర్వహింపలేని రాజుల కిట్టి స్థితి గతులు తప్పవు."

"మీరు మాకు ధర్మసూక్తు లుపదేశింపనక్కరలేదు. మీ రుత్సవము నేల నిషేధించితిరో స్పష్టముగా చెప్పుడు."

"ఈ యుత్సవము వలన ప్రయోజన మేమియో నీవు ముందు స్పష్టము చేయుము."

'మా రాజ్యమున రాజాజ్ఞ అప్రతిహతముగా నెఱవేఱునని నిరూపించుటయే ప్రథమ ప్రయోజనము.

పూర్వ ప్రభు సంస్మరణమున ఇంకను మా యెడల ననురక్తులు గాలేని ప్రకృతులు కొందఱు కొంత సంతుష్టి నందుట రెండవ ప్రయోజనము."

"సరి సరి. అయిన నీ యాజ్ఞను మేము ధిక్కరింపగల మని నిరూపించుటయే నిషేధమునకు ప్రథమ ప్రయోజనము. సందానురక్తులగు ప్రకృతుల కుటిలోపాయములు సాగకుండ మనము నిరంతరము జాగరూకులమై యున్నామ నియు, వినోదములతో విహారములతో కాలక్షేపము గావించుట లేదనియు నిరూపించుట రెండవ ప్రయోజనము! తెలిసినదా! కనుక నిషేధింపవలసిన యవసరముండియే నిషేధించితి మని గ్రహింపుము."

"ఏమా యవసరము? మేము వినగోరుచున్నాము."

"ఉత్సవములు ప్రశాంతసమయములలో జరుగవలసినవి. అవ్యవస్థలో జరుపవలసినవిగావు! రాజ్యమింకను శత్రుభయ విముక్తము కాలేదు. నిరంతరము యుద్ధసన్నద్ధముగా నుండవలసిన ఈ విషమపరిస్థితులలో నీయుత్సవవినోదములు జరుగుట ప్రభువుకు శ్రేయస్కరము గాదు. ప్రజలకు క్షేమంకరమును గాదు. పితృవధామర్షితుఁడగు మలయకేతువు రాక్షసమంత్రి సహాయముతో నేడో, రేపో మనపై దండెత్తి వచ్చుటకు సంసిద్ధముగా నున్నాఁడు."

"అయిన...?"

“అయిన నిది యుద్ధసమయముగాని యుత్సవ సమయము కాదని మా నిశ్చయము. అందులకే మేము దీనిని నిషేధించితిమి.”

“అంతగా రాజ్యక్షేమమును కాంక్షించిన మీరు ప్రబల శత్రువులైన రాక్షస మలయకేతువులు నగరమునుండి పారిపోవు చుండగా నేమిచేయుచున్నారు!”

“ప్రజాభిమాన సంపాదన పద్ధతి, రాజనీతి వైమనస్య విధానము దెలిసిన వారికి గాని రాక్షస మలయ కేతువులను మేమేల విడిచిపుచ్చితిమో అర్థముకాదు.”

“ఆ యర్థమేమో తెలియగోరుచున్నాము.”

“చెప్పెదము. మలయకేతువును నగరము నుండి పారిపోకుండ జేయవలెనన్నచో రెండు పద్ధతులున్నవి. ఒకటి వాని తండ్రి కిత్తుమన్న యర్ధరాజ్యము నిచ్చుట, అట్లిచ్చినచో పర్వతక సంహారము నిష్ప్రయోజకమే అగును. అందువలన నిది పనికిరాదు గదా! ఇక రెండవ పద్ధతి మలయకేతువును సంహరించి వైచుట. అది మనకృతఘ్నతను ప్రత్యక్షముగా బట్టియిచ్చును. అందువలన నదియు యోగ్య మార్గముకాదు.

అట్లే రాక్షస మంత్రిని విడిచి పుచ్చుటకు కారణమున్నది. ఆతడు ప్రజాభిమానము నధికముగా గలవాడు.

నందానురక్తులగు ప్రకృతులకు విశ్వాసపాత్రుడు. ప్రజ్ఞా పౌరుషము లున్నవాడు. అర్థబలము, సంగ బలము నున్న వాఁడు. అట్టివానిని మనము జంపను రాదు-ప్రక్కలో బల్లెమువలె పట్టణములో నుండనీయను రాదు. అందులకే నగరమునుండి పారిపోవుచుండగా మే ముపేక్షించియుంటిమి."

"రాక్షస మంత్రి పలాయనము నట్లేల యుపేక్షింప వలయును? బలప్రయోగమున నాతని నధీనము చేసికొన్నచో సరిపోయెడిది గదా?"

"కాదు కాదు. అది సరికాదు. రాక్షసామాత్యుఁడు అపారమైన ఆత్మాభిమానము గలవాఁడు. బలప్రయోగమున నాతనిని లోబరుచుకొనుటకు పూనుకొంటిమా అతడు శత్రు నాశనమునో, ఆత్మ నాశనమునో చేసితీరును. అందువలన ఆతడు నగరములో నుండి అంతఃకలహము బుట్టించుట కంటె దూరప్రాంతములకు వెడలిపోవుటయే మంచిదని యుపేక్షించితిమి."

"మఱి మాకు సంగ్రామ సహచరులుగా నుండి విశ్వాస పాత్రులై మమ్ము సేవించిన భద్ర భట పురుదత్త డింగు రాత బలగుప్త రాజసేన భాగురాయణ రోహితాక్ష విజయ వర్మాదులు వెడలిపోయి మా శత్రువగు మలయకేతువు నాశ్రయించుట మీ రేల యుపేక్షించితిరి?"

"చెప్పెదను వినుము. గజాధ్యక్షుండైన భద్రభటుడు అశ్వాధ్యక్షుండైన పురుషదత్తుడు స్త్రీలోలురై, మద్యపానమత్తచిత్తులై, మృగయాలాలసులై గజాశ్వ పరామర్శనక్రమముగా చేయింపకపోవుటచేత వారిని పదభ్రష్టులను చేసితిని.

వారుపోయి మలయకేతువు నాశ్రయించిరి. డింగురాత బలగుప్తులు దురాశాపీడితులై నే యిచ్చు వేతనములు చాలక, అధికభృతికై పోయి మలయకేతువును చేరిరి.

రాజసేనుడు నీదయవలన మహాధనము నార్జించి అది మరల నీవు చేపట్టుదువని భయపడి మలయకేతువు సన్నిధి చేరెను. భాగురాయణుడు పర్వతకు మిత్రుడగుటవలన మలయకేతువునకు పరమాప్తుడై, ఆతనిని స్వదేశమున కేగునట్లు చేసిన వాడగుటవలన నాతనినే ఆశ్రయించి అత్యంత సన్నిహితుడై అతనియొద్దనే నిలిచియున్నాడు.

రోహితాక్ష, విజయవర్మలు మదగర్వ దురభిమానులై నీయెడల మాత్సర్యముచేత మలయకేతువు నాశ్రయించి అతని మిత్రులైనారు. అందులకు నేను వెంటనే ప్రతిక్రియ చేయుటకు వీలుకాలేదు. ఎందుచేతననగా ఆయా రాజోద్యోగులను అనుగ్రహముతో కాని, నిగ్రహముతో గాని సాధింపవలసియున్నది. అనుగ్రహించుట యనగా వ్యసనదోషులైనవారికి, అతిలుబ్ధులైనవారికి, భయభ్రాంతులైన వారికి దురభిమానులైనవారికి వారికోరికలు దీర్చి వయ

జూపుట. అది వారికి సంప్రీతికల్గించుమార్గము కాదు. అట్టి వారిని అధికారము లిచ్చి కొలువున ఉంచుకొనుట మనకు శ్రేయస్కరము కాదు. ఇక నిగ్రహముచేత వారిని సాధింప వలెనని తీవ్రముగా దండించినచో నందానురక్తులగు ప్రజలకు మనయెడల విశ్వాసము లేకుండపోవును. అందువలన మేము వారిని నిగ్రహించక యుపేక్షించితిమి! ఇట్టివారితో గూడి రాక్షసోపదేశము ననుసరించి మ్లేచ్ఛబలములను సమకూర్చుకొని పితృవధామర్షతో మనపై దండెత్తు మలయకేతువు నెదుర్కొనుటకు సన్నద్ధులమై దుర్గసంస్కారాది యుద్ధయత్నములు సాగింపవలసిన ఈ క్లిష్ట సమయములో కౌముదీ మహోత్సవాదులు తలపెట్టుట వివేకులు చేయ దగినపని కాదు."

భద్రభటాది రాజోద్యోగులు శత్రుపక్షమున జేరుచుండ తా నుపేక్షించియుండుటకు, కౌముదీ మహోత్సవమును నిషేధించుటకును గల కారణములను చాణక్యుఁడు వివరించెను.

చంద్రగుప్తుఁడు పరుషముగా పలికెను.

"చాలుచాలు. ఇంక మేము వినదలచుకొనలేదు. ఇంక ఈ యుక్తులతో మాకు పనిలేదు. అంతయు చూడగా ప్రజ్ఞాపౌరుష సంపదతోఁబాటు ప్రభుభక్తి పారమ్యముగల రాక్షసమంత్రియే ప్రశంసార్హుఁడని మాకనిపించుచున్నది."

"అనగా మేము కాననివారోగదా! నీకు మాపై నంత విశ్వాసములేనిచో మాకు నీ మంత్రిత్వమే యక్కరలేదు. మా స్థానమున మా కన్న మిన్నయని నీవు భావించుచున్న యీ రాక్షసమంత్రినే మహామాత్య పీఠమునఁ బ్రతిష్ఠించుకొనవచ్చును. మేము వెడలిపోయెదము."

"మంచిది. అదియే ఉత్తమమని మా యభిప్రాయమును. ఈ క్షణమునుండి ఈ రాజ్యాధికారము సర్వమును మేమే నిర్వహించుకొనదలచితిమి. మాకు మీతోఁ బనిలేదు."

"అట్లయిన మాకును సమ్మతమే! కాని నీ నిర్హేతుక గర్వాతిరేకమువలన ధనాధికార మదాంధులైన నందులను చెండాడి బలిపశువులను గావించిన ఈ చాణక్యుని క్రోధాగ్ని జ్వాలను మరల రగుల్కొల్పుచున్నావు. ఈ నిబద్ధశిఖను మరల విప్పునట్లు చేయుచున్నావు.

మావంటి మహా పండితులను భృత్య భావముతో జూచుట మృత్యుముఖ ప్రవేశము చేయుట యని గుర్తింపలేకున్నావు." చాణక్యుఁడు క్రోధావేశముతో భయంకరముగ గర్జించుచు అమాత్యచిహ్నమైన శస్త్రమును విడిచి పదవీ పరిత్యాగము చేసి వేగముగా వెడలిపోయెను.

అతని యాగ్రహము చూచి చంద్రగుప్త మహారాజు గడ గడ వణకిపోయెను. "ఇదేమి? ఆర్యులకు నిజముగా

కోపము వచ్చెనా ఏమి? సర్వాంగసంచలనముతో, పిశంగ లోచనములతో ప్రళయ రుద్రునివలె రౌద్రవ తాండవము గావించుచున్నారు. ఇదియంతయు కృతక కలహమని మఱచి నారా ఏమి? రాక్షస వశీకరణమునకై, మన మిరువురము స్వయం నిర్ణయాధికారులమై పరస్పరాజ్ఞాధిక్కారములతో వ్యవహరించుచున్నట్లు కొంతకాలము కపట నాటక మాడ వలెనని ఆర్యులేగదా నాతో చెప్పినది.

నాకు తనమీాది అపరక్తితోబాటు రాక్షసమంత్రి మీాద అనురక్తి ప్రబలమగుచున్నట్లు ప్రచారము జరుగుట కును, రాక్షస మలయకేతువుల మైత్రీ బంధమునకు విఘా తము కల్పించుటకును మన కృతక కలహము పనికివచ్చె ననియు, మలయకేతువుని కొలువున జేరిన మన భాగురాయ ణాదులు ఇందులకు సమధిక సహాయము గావింతురనియు ఈ సర్వయత్న మహా ఫలముగా రాక్షస వశీకరణము మనకు సులభసాధ్యము కాగలదనియు ఉపదేశించినది గురుదేవులే కదా!" అని చంద్రగుప్త మహారాజు తలపోసెను.

చాణక్య చంద్రగుప్తుల మధ్య పొరపొచ్చెములు బయలుదేరినవనియు, ఒకరి మాటపై మఱియొకరికి గుఱిలే దనియు, ఒకరిపై మఱియొకరికి లక్ష్యములేదనియు, ఇచ్చ వచ్చినట్లుగా నెవరికి వారు ఉత్తరువు లిచ్చుచున్నా రనియు, నౌకరి యాజ్ఞల నొకరు ధిక్కరించు చున్నారనియు,

చేతికి జిక్కినపుడు రాక్షస మలయకేతువుల జంపకుండ విడిచిపెట్టినందులకు చంద్రగుప్తుఁడు చాణక్యునిపై మండిపడు చుండగా, మగధ రాజ్యమును సాధించి యిచ్చినందుకు కృతజ్ఞత లేకుండ తనమాట మీరుచున్నాఁడని చాణక్యుఁడు చంద్రగుప్తునిపై కోపించుచున్నాఁడనియు, చాణక్య చంద్ర గుప్తుల కలహము చరమస్థాయి నందుకొనినదనియు చారు డొకఁడు రాక్షస మంత్రికి రహస్యముగా గ్రహించివచ్చి నివేదించుకొనెను.

చారుఁడు చెప్పిన కృతక కలహ వృత్తాంతమును నిజ మని నమ్మి రాక్షసమంత్రి యానందించెను.

# సంశయస్థాపనము

రాక్షసమంత్రి చాణక్య చంద్రగుప్తుల యంతఃకల హము, చాణక్య మంత్రి పదవీ పరిత్యాగము తనకు పరమ ప్రయోజనములని యానందించెనేకాని భాగురాయణ మంత్రాంగబలమున తనకును మలయకేతువునకు భయంకర విరోధము ప్రాప్తింపనున్నట్లు గ్రహింపలేకపోయెను. భాగు రాయణుఁడు సమయసముచిత వాక్చాతుర్యముతో మలయ కేతువునకు రాక్షసమంత్రిపై సందేహము కలుగునట్లు చేసెను. మలయకేతువు తాను పాటలీపుత్రమునుండి పారి పోయివచ్చుటకు సహాయపడిన వాఁడగుటచే భాగురాయణు నిపై నపార విశ్వాసము గలిగియుండెను. ఆతఁడు చెప్పిన ప్రత్యక్షరమును మలయకేతువు పరమసత్యముగా భావించు చుండెను. ఆ నమ్మకము నవకాశముగా దీసికొని భాగు రాయణుఁడు మలయకేతువు మనస్సులో రాక్షసమంత్రి యెడ ననుమాన బీజములు నాటెను. పైకి శత్రుత్వము నటించుచున్నను రాక్షసమంత్రి సహజసిద్ధముగా చంద్రగుప్త పక్షపాతియని భాగురాయణుఁడు మలయకేతువునకు నూరి పోసెను.

మలయకేతు వాలోచించెను. "అవును. రాక్షసమంత్రి బహుకాలముగా నుగధ ప్రభువులను గొలిచినవాఁడు. అందు

వలసిన సమయము వచ్చినప్పుడు నన్ను వంచించి నందవంశము వాఁడగు చంద్రగుప్తునికే సహాయపడినను నాశ్చర్యములేదు అట్టి దురుద్దేశ మేదియో యాతని మనస్సున లేకున్నచో నే నెన్ని పర్యాయములు పాటలీపుత్రముపై దండెత్తిపోవుదమని తొందరపెట్టినను నీ రాక్షస మంత్రి కాలహరణ మేలచేయుచున్నాఁడు? ఇందేదియో మహారహస్యమిమిడియే యుండును. పరిశీలించెదగాక!" అని మలయకేతువు నిశ్చయించుకొనెను.

ఒకనాఁడు భద్రభటాది సేనానాయకులు మలయకేతు భాగురాయణులను సందర్శింపవచ్చిరి. మలయకేతువు వారి నాదరించి వచ్చిన కారణ మడిగెను. వారు "మహారాజా! మేమింక ప్రమాదభూయిష్ఠమైన రాక్షసమంత్రి యాధిపత్యములో పని చేయజాలము. మేమారంభము నా రాక్షసమంత్రి ముఖముజూచి తమ కొలువునజేరలేదు. తమ సేనాపతి గౌరవము జూచి తమ జయేచ్ఛను సద్గుణ సంపన్నతను సామర్థ్యమును జూచి వచ్చి చేరితిమి. అదియునుగాక శస్త్రజీవులమైన మేము, సమరవిముఖులమై యాచంద్రగుప్తుని యౌన్నత్యము నింకను జెల్లనిచ్చుచున్న రాక్షసమంత్రిని విశ్వసింపలేకున్నాము" అని మలయకేతువుతో మనవిచేసికొనిరి.

మలయకేతువునకు వారి మాటలయంతరార్థము బోధపడలేదు. అతఁడు ప్రక్కనున్న భాగురాయణుని వంక చూచెను. భాగురాయణుఁడందుకొని "మఱేమియు లేదు

మహారాజా! రాక్షసమంత్రి ప్రవర్తనముపై మనవారి కను మానము గల్గినది. రాక్షసమంత్రికి మగధాధిపతులపైఁగల యచంచలభక్తివిశ్వాసములు మీరందరెఱుగుదురు. ఇప్పుడు చంద్రగుప్తుఁడు చాణక్యుని మంత్రిపదవినుండి తొలగించినాఁడుగదా! ఈ యదను చూచి రాక్షసమంత్రి చంద్రగుప్తుఁ డాహ్వానించినచో నాతనిమీఁది సహజాభిమానముతోడనో లేక ప్రాణమిత్రులగు చందనదాసాదుల రక్షణకొఱకో చంద్రగుప్తునితో మైత్రిచేసికొని, తదాస్థానమున మహామాత్యపదవి నంగీకరింపవచ్చును. అప్పుడు మీ రాతని ప్రవర్తనము నసహ్యించుకొందురుగదా! అట్టి సందర్భమున మీరు తమ్ముగూడ రాక్షసమంత్రివంటి వంచకులేయని తలచి విశ్వసింపరేమో యని మన భద్రభటాదుల సందేహము. అందుచేత నాతని క్రింద పనిచేయుట వీరి కిష్టములేదు." అని వివరించెను. మలయకేతువు తలయూచెను.

భాగురాయణుఁడు వ్యాఖ్యానమును విశదీకరించెను. "చాణక్యునకు వలెనే రాక్షసమంత్రికిగూడ చంద్రగుప్తునిపై ననురక్తి యెక్కువ. అతనికి చాణక్యుని మీఁదనే కాని చంద్రగుప్తునిపై పగలేదని మనవారి భావము."

మలయకేతువు మనస్సు వికలమై పోయెను. అతనికి రాక్షసమంత్రిపై ననుమానము ప్రబలమయ్యెను. అతఁడుభద్రభటాదులకు సముచితముగా సమాధానము చెప్పిపంపెను.

అనతికాలములో రాక్షసమంత్రి చిత్తశుద్ధిని పరీక్షింపవలెనని మలయకేతువు నిశ్చయించుకొనెను. ఆయన మనసులో నేదియో ఆలోచించుకొనుచు పీఠమునుండి లేచెను.

ఆనాడు రాక్షసమంత్రి శిరోవేదనముతో బాధపడు చున్నాడని వినియుండుటవలన ఆయనను పరామర్శించుటకై మలయకేతువు అమాత్యభవనమువైపు సాగెను. ఆయన తన ఈ ప్రయాణము రాక్షసమంత్రి హృదయమును గూడ గ్రహించుటకు తోడ్పడగలదని భావించెను. రాక్షసమంత్రి తన యోగక్షేమ మారయవచ్చిన మలయకేతువును సాదర ముగా సంభావించి సముచితాసన సమాసీనుని గావించెను.

మలయకేతువు రాక్షసామాత్యుని ప్రశ్నించెను. "ఆర్యా! మీ శిరోవేదన ముపశమించినదా?" అమాత్యుఁడు బదులాడెను. 'కుమారా! నీవు సఫలప్రతిజ్ఞుఁడవై మహారాజు పదము నందకుండ నా శిరోవేదన మెట్లుపశమించును!' "అయిన మఱి కాలహరణ మెందులకు? మగధపై దండ యాత్రకు సుముహూర్తము నిశ్చయింపవచ్చునుగదా!" మలయకేతువు పలికెను. రాక్షసామాత్యుఁడు "అవును రాకుమారా! మేమా ప్రయత్నములోనేయున్నాము. మనకు పరమాప్తుఁడైన క్షపణక జీవసిద్ధిచేత చంద్రబల సంపన్న మైన పూర్ణిమనాడు, బుధలగ్నమున, కేతుగ్రహాస్తమయవేళ

మన రణయాత్రకు ముహూర్తము నిర్ణయింపబడినది" అని చెప్పెను. మలయకేతువు సాలోచనముగా తల యూచెను.

రాక్షసామాత్యుఁడు మరల తన పథకమును వివరింపసాగెను.

"రాజకుమారా! ఇది మన దండయాత్ర కనువైన సమయము. సచివ వ్యసనముపొంది నిస్సహాయుఁడై యున్న నవప్రభువు చంద్రగుప్తుఁడు మనకు సులభముగా వశుఁడై తీరును. మన చతురంగ బలసంపద, పాటలీపుత్రములోని నందాభిమానులగు ప్రజల సానుభూతి సహకారములు, కొంతగా నా మంత్రాలోచన మహత్త్వము ఏకమై మనకు నిశ్చయముగా జయము సాధించిపెట్టును.

నిరంతర భూభారవహన దక్షుఁడైన ఆదిశేషునివలె, వియన్మండల విహారియైన దినకరునివలె, ఈ రాక్షసమంత్రి ఎంత శ్రమకైనవోర్చి కర్తవ్యమును నిర్వర్తించి నీకు తోడ్పడగలఁడు.

అనతికాలములో మన భద్ర గజవాహిని పాటలీపుత్రమును ముట్టడింపగలదు. అందులకు సర్వమును సన్నద్ధమైనది."

రాక్షసామాత్యుని మాటలు విని "మంచిది. అట్లే కానిండు. సర్వమునసన్నద్ధము చేయుడు. మేమును మా ప్రయత్న

మున నుండెదను." అని పలికి మలయకేతువు ఆలోచనా మగ్నుఁడై రాజభవనాభిముఖుఁడయ్యెను.

చాణక్య సహాయము లేని చంద్రగుప్తుడు స్వాయత్త సిద్ధికాని మహారాజగుటచే అనాయాసముగా తనచే విజితుఁడగునని రాక్షసమంత్రి సంతసించెను. శత్రువ్యసనము సంభవించు వఱకు తాను వేచి యుండుట మేలే యైనదని భావించెను. మలయకేతుని మహాబలము, చంద్రగుప్తుని యసహాయదశ తన మహోద్యమమును సఫలము చేయునని విశ్వసించెను. వెనువెంటనే మగధరాజ్యముపై దండయాత్రకు సిద్ధముగా నుండుడని సేనాపతుల నాదేశించెను. సమర సమయము కనుక సైనిక సంచలనవార్త శత్రువుల కందకుండ శ్రద్ధ వహించెను. పట్టణము నుండి బయటకు పోవువారుగాని, లోనికి వచ్చువారుగాని ముందుగా భాగురాయణమంత్రి దగ్గఱ యనుమతిపత్రము బొందవలెనని శాసించెను.

భాగురాయణుఁడాస్థాన మంటపములోఁ గూర్చుండి యనుమతి పత్రము లిచ్చుచుండెను. అనుగు మిత్రుని కల్లంతదూరములో మలయకేతువు రాక్షసామాత్యుని కార్య విధానమును గూర్చి తనలో తాను తర్కించుకొను చుండెను. అంతలో జీవసిద్ధి ప్రయాణానుమతి పత్రము కొఱకై భాగురాయణుని దగ్గరకు వచ్చెను.

భాగురాయణుఁడు :- ఎవరది? రాక్షసమిత్రులు క్షపణకులా?

జీవసిద్ధి :- అవునవును. రాక్షస మిత్రులు కాదు. పిశాచ మిత్రులు!

భాగురాయణుఁడు :- ఏమంతకోపముగా నున్నారు?

జీవసిద్ధి :- మాకోప మెవ్వరి నేమి చేయును?

భాగు :- మఱి ప్రియమిత్రుని విడచి యెచ్చటికేగు చున్నారో తెలిసికొనవచ్చునా?

జీవ :- ఆహా! చక్కగా తెలిసికొనవచ్చును. ఆ రాక్షస నామము వినబడని చోటుకు పోవుచున్నాను. అర్థమైనదా?

భాగు :- ఏమో అమాత్యుల పేరెత్తగానే యిట్లు మండిపడు చున్నారు! వారు మీకు చేసిన యపకారమేమి?

జీవ :- అపకారమా? దానికేమి? వారేమైన చేయుదురు! వారు మహామంత్రులు గదా! అఘటన ఘటనా సమర్థులు! తాము పెద్దమనుష్యులవలె నుండి మధ్య మా వంటి దౌర్భాగ్యులను నరకమున ద్రోయుదురు.

భాగు :- అదియేమి? నాకర్థము కాలేదు. రహస్యము కానిచో చెప్పుఁడు.

జీవ :- ఎందులకు? ఉన్నమాట ఉన్నట్లు చెప్పినచో మెడ మీఁదతల యెగిరిపోవును. అంతేకదా! అప్పుడు మీరేమైన వచ్చి రక్షింతురా?

భాగు :- ఆ మాట యేమియో చెప్పిన గదా రక్షించుటకు, శిక్షించుటకు.

జీవ :- ఏమయిన గానిండు. నేను చెప్పను. చెప్పి లాభము లేదు.

భాగు :- అయినచో నేను మీ కనుమతి పత్రము నీయను.

జీవ :- సరే. ఇంకేమి చేయుదును? చెప్పెదను వినుఁడు.

నేను పాటలీపుత్రములో నుండఁగా దురదృష్టవశమున నీ రాక్షసునితో మైత్రి కలిగినది. అందువలన నాకు గలిగిన మహాలాభమేమియో తెలియునా? దేశబహిష్కారము! ఘోరావమానము! ఈ దుష్టాత్ముఁడైన రాక్షసుఁడు విషకన్యనుసృష్టిచేయించి, దానిమూలమున పరమమిత్రుఁడైన పర్వతకుని జంపించినాఁడు. ఆ సంగతి తెలిసికొని, రాక్షసమిత్రుఁడ నైనందులకు నామీఁద నాగ్రహించి యీ చాణక్యుఁడు నన్ను ఘోరముగానవమానించి నగరమునుండి వెడలగొట్టించినాఁడు. అందువలన గదా నేను నెత్తిపై గుడ్డవైచుకొని యూరు, వాడ, యిల్లు వాకిలి యన్నియువిడచి యిచ్చటకు వచ్చితిని.

జీవసిద్ధి భాగురాయణుల సంభాషణ మా మూలా గ్రము మలయకేతువు చెవిని బడినది. అతని హృదయమున శోకక్రోధములు పొంగులెత్తినవి. "ఓయి రాక్షసా! ఎంత యన్యాయమున కొడిగట్టితివి? నీవేదిక్కని నమ్మియున్న నిరప రాధియగు నా తండ్రిని వంచించి చంపించితివా! నీవు నిజము గానే రాక్షసుడవు!" మలయకేతువు పళ్ళుగొరికెను. మరల కొంతశాంతము దెచ్చుకొని జీవసిద్ధి ప్రసంగము నాలకించెను.

"చూచితిరా మఱి! రాక్షసమంత్రి కౌటిల్యము! నమ్మినవారిని మోసగించుటలో నాతని మించినవారు భూ మండలములో లేరు." జీవసిద్ధి మాటలువిని భాగురాయ ణుడు తన సందేహమును ప్రకటించెను.

భాగు:- కాని మిత్రమా! చెప్పినమాట ప్రకారము పర్వత ప్రభువుల కర్ధరాజ్యము నీయవలసి వచ్చునని భయ పడి, యదియట్లు జరుగకుండుటకై చాణక్యుడే విష కన్యను ప్రయోగించి యాతని జంపించినాడని లోక ములో వదంతి యున్నది కదా! మఱి నీ విట్లందు వేమి?

జీవసిద్ధి:-వదంతుల కేమయ్యా! లోకులు కాకులు. నోటికివచ్చి నట్లు కూయుదురు. దోష మొకచోట నుండును! నింద మఱియొకరికి వచ్చును! దాని పద్ధతియే యంత.

పాపము ! చాణక్యునకు విషకన్య పేరైనను తెలియదు. అది యంతయు నాటకము ! చంద్రగుప్త సంహారమునకని యా రా[illegible] [illegible] చెప్పిన మాట నమ్మి నేను గదా యాతని కా [illegible]క్య నప్పగించితిని ! ఆ విషయము నా కన్న లోకమున కెక్కువ తెలియునేమి ?

మలయకేతువునకు జీవసిద్ధి మాటలపైఁ బరిపూర్ణ విశ్వాసముకలిగెను. జీవసిద్ధి మఱల ప్రారంభించెను.

"మిత్రమా! భాగురాయణా! జరిగినదానికేమి గాని జరుగబోవు ఘోరమును దలచుకొనినచో నా యొడలు మండి పోవుచున్నది. ఈ రాక్షస హంతకుఁడు కష్టకాలములోఁ దన కాశ్రయమిచ్చిన మలయకేతువును మంచిగా నమ్మించి నడి సముద్రములో ముంచుటకై ప్రయత్నించు చున్నాఁడు. చాణక్య చంద్రగుప్తులకు స్నేహము చెడగానే యితఁడు మెల్లగా చంద్రగుప్తునిజేరి యాతని దగ్గర మహామంత్రి కావలెనని చిరకాలముగాఁ గోరుకొనుచున్నాఁడు. నేఁడో రేపో ఆపనియుఁ జేయును. ఈ విశ్వాసఘాతకుని చేతిలో పాపము మలయకేతువు గతి యేమగునోయని నాకు చాల విచారముగా నున్నది! అయినను నీ రాజకీయముల గొడవలు

నాకేల ? నేను పోయెదను. ఇక్కడ నున్నచో నా దోషమే మియు లేకున్నను రాక్షసమిత్రుఁడనైన నేరమునకీసారినాతల తీసివేయుదురు. మఱి నాకు పత్రమునిచ్చి పంపుఁడు.” అని పలికి భాగురాయణుని యనుమతి పత్రమునందుకొని జీవసిద్ధి వెడలిపోయెను.

మలయకేతువునకు జీవసిద్ధి పల్కిన ప్రత్యక్షరమును సత్యమేయనిపించెను. అతనికి రాక్షసమంత్రిమీఁది ఆగ్రహాగ్ని మఱింత ప్రజ్వలించెను. ఆతనికి రాక్షసమంత్రి నిర్ణయించిన యుద్ధయాత్రాముహూర్తముస్ఫురణకువచ్చెను. ఆతఁడు వెను వెంటనే పితృమరణకారకుఁడై విశ్వాసఘాతుకుఁడై తన్నాశ్రయించి తన వినాశనమును గూడ తలపెట్టిన రాక్షసమంత్రిని శిరచ్ఛేదము చేయవలెనని ఖడ్గము నందుకొనెను. అది గ్రహించి భాగురాయణుఁడు “రాక్షసమంత్రికి ప్రాణాపాయము సంభవింపకుండఁ జూడుమని” తనకు చాణక్యమహామాత్యుఁ డిచ్చిన యాదేశమును గుర్తుకుదెచ్చుకొని, మలయకేతువును సమీపించి “మహారాజా! ఆవేశము తగదు. రాజకీయములలో సావధానముగ నుండవలెను. మనకు మగధ రాజ్యము చేజిక్కువరకు రాక్షసమంత్రితో మైత్రిగానుండుట

యత్యవసరము. ఆ పిమ్మట ఆతనిని బరిగ్రహించుటయో పరిత్యజించుటయో మన యిష్టానుసారము చేయవచ్చును.'' అని శాంతపరచి యప్పటి కాప్రమాదమునుదప్పించెను. మలయకేతువునకు రాక్షసమంత్రిపై సంశయము సుస్థిరమయ్యెను.

# నిరాకరణము

ఆమఱునాఁడుకూడ భాగురాయణమంత్రి ఆస్థానమంటపములో అనుమతిపత్రము లిచ్చుచుండగా అల్లంత దూరమున మలయకేతువు ఆలోచనానిమగ్నుడై కూర్చుండియుండెను.

అంతలో రాజభటులు సిద్ధార్థకుని వెంట బెట్టుకొని వచ్చి భాగురాయణుని కప్పగించిరి

“ఆర్యా! ఈతఁ డెవ్వఁడో తమ యనుమతి పత్రము లేకుండ నగరము వీడి పర్వెత్తుచుండగాఁ బట్టి తెచ్చితిమి. వీనియొద్ద నీ నగలపెట్టెయు, రహస్య లేఖయు లభించినవి. చిత్తగింపుఁడు.” అని రాజభటు లాభరణ పేటికను, రహస్య లేఖను భాగురాయణుని ముందు పెట్టిరి.

భాగురాయణుఁడు సిద్ధార్థకుని విచారింపసాగెను.

“ఎవరు నీవు? అనుమతి పత్రము లేకుండ నగరము వీడి యేలపోవుచున్నావు?” భాగురాయణుఁడు ప్రశ్నించెను.

సిద్ధార్థకుఁడు కొంచెము భయమునటించుచు “నేనా? నేను రాక్షసమంత్రులవారి యాంతరంగిక భృత్యుఁడను! ఆయన యాజ్ఞానుసారమే మిక్కిలి యవసరమైన పనిమీద తొందరగా వెళ్ళుచున్నాను. నాకనుమతి పత్ర మెందులకు?

నేనేమి దొంగ ననుకొంటిరా! కావలసినచో చూచుకొ నుఁడు. మలయరాజు తన ముద్రిక వేయించి యిచ్చిన నగలపెట్టె యున్నది. రహస్యలేఖ యున్నది. ఇంక నామీద మీకెందులకు ననుమానము?" అని బదులు పలికెను.

భాగురాయణుఁడు క్రోధావేశముతో "అనుమాన మేమిటికా? నీవు శత్రుసహాయచారివని నీ ముఖమే చెప్పు చున్నది కనుక. ఇంతకు నీ పెట్టెలో నేమున్నది? దీనిమీద రాక్షసమంత్రి తన ముద్రిక యేల వేసెను?" అని ప్రశ్నించెను.

సిద్ధార్థకుఁడు బదులుచెప్పెను. "పెట్టెలోనా? పెట్టెలో నేవో రహస్య వస్తువులుండును ఆ మాత్రము తెలియదా మీకు?

ఇక రాక్షసమంత్రి తన ముద్రిక ఏల వేసెననగా నేనేమి చెప్పుదును. అవసరముగనుక వేసెను. అంతే. అయి నను నవియన్నియు మీ కెందులకు!"

ఆ మాటలువిని మలయకేతువు విభ్రాంతుఁడయ్యెను. ఆతఁడు ముద్రిక చెదరకుండ నా పెట్టెలో నేమియున్నదో, తెఱచి చూడుఁడని భటుల కాజ్ఞ యిచ్చెను. తాను రహస్య లేఖ నందుకొని విప్పి చదివెను.

"ఒకానొక వ్యక్తి యొకానొక ప్రదేశమునుండి
మరియొక ప్రదేశమున నున్న ఒకానొక మాన్యు

నకు వ్రాసిన లేఖ.

మహాశయా !

మీరు చెప్పిన ప్రకారము చేయుచున్నందులకు చాల సంతోషము.

ఇచ్చట మనవారందఱు స్వాశ్రయ వినాశనమునకు తగిన సమయమునకై యెదురు చూచుచున్నారు. తమతమ కార్యము లన్నియు సక్రమముగా నెరవేర్చుచున్నారు.

మీరు కార్యసిద్ధికై యిచ్చటిమిత్రులకు మున్ను చేసిన వాగ్దానముప్రకారము సంధిమూల్యము చెల్లింపవలసియున్న దని మనవిచేయుచున్నాను. ఈమిత్రులలోఁ గొందఱు శత్రుని రాజ్యమును కోరుచున్నారు. కొందఱు ధనమును, మఱి కొందఱు గజయూథమును గాంక్షించుచున్నారు. విజయసిద్ధి తరువాత వారి కోరికలు తీర్పగలమని చెప్పితిని.

మీరు నాకు బహుమతిగాఁబంపిన మూడాభరణము లందినవి. నేనును శక్త్యనుసారముగా నీ లేఖతోఁబాటుగా నొక రత్నహారము నంపుకొనుచున్నాను. దయయుంచి స్వీక రింపుఁడు. ఇఁక మిగిలిన విషయములు మనకుఁ బరమాప్తుఁడైన యీ సిద్ధార్థకుని వలన గ్రహింపగలరు."

లేఖ చూడగానే మలయకేతువునకు రాక్షసమంత్రిపైఁ గల సందేహము దృఢతరమయ్యెను. ఆ లేఖ రాక్షసమంత్రి చంద్రగుప్తునికి వ్రాసినదని యతఁడు నిశ్చయించుకొనెను.

అంతలో రాజభటులు నగలపెట్టె తెఱచి యందున్న రత్నహారమును మలయకేతువున కందించిరి.

మలయకేతుని యనుమానము మఱింత ధ్రువపడెను. ఆ రత్నహారము మున్నొకప్పుడు తాను స్వయముగా రాక్షసమంత్రికి బహూకరించెను. మలయకేతువు తలవంచుకొని నిలబడియున్న సిద్ధార్థకుని బ్రశ్నించెను.

"ఈ లేఖ ఎవరెవరికి వ్రాసినది ?"

"నాకు తెలియదు." సిద్ధార్థకుఁడు బదులాడెను.

"దుష్టుఁడా! ఇట్టి లేఖ గొనిపోవుచున్న వానికి ఎవరెవరికి వ్రాసినారో తెలియదా ? చెప్పెదవా లేదా?" అని మలయకేతువు గద్దించి యడిగెను.

భాగురాయణుఁడు కన్నులెట్టి జేయుచు "వాఁడావిధముగాఁ జెప్పఁడు. దేహశుద్ధి కావలయును." అని భటులను జూచి వీనిని కొరడాతోఁ గొట్టుఁడని యాజ్ఞాపించెను. సిద్ధార్థకుఁడు కొరడాదెబ్బలుతిని బిగ్గరగా రోదించుచు "చెప్పెదను చెప్పెదను, కొట్టకుఁడు కొట్టకుఁడు. రాక్షసమంత్రి చంద్ర

గుప్త మహారాజులవారికి లేఖను, నగల పేటికను నిచ్చి రమ్మని పంపఁగాఁ బోవుచుంటిని. ఇందులో నా దోష మేమున్నది?" అని చెప్పెను.

"మఱి నీవు చెప్పవలసిన మిగిలిన విషయము లేమి?" భాగురాయణుఁడు ప్రశ్నించెను.

సిద్ధార్థకుఁడు బదులు పలికెను. "మిత్రులైన కులూతదేశాధిపతి చిత్రవర్మ, మలయాధిపతి సింహనాథుఁడు, కాశ్మీరేశ్వరుఁడు పుష్కరాక్షుఁడు, సింధురాజు సింధుసేనుఁడు, పారసీకప్రభువు మేఘాక్షుఁడు నీ యైదుగురిలో మొదటిముగ్గురు మలయకేతువుల వారి రాజ్యమును గోరుచున్నారు. మిగిలిన యిద్దరు ధనరాసులను,గజయూథమును గాంక్షించుచున్నారు. ప్రభువులు నన్నభిమానించినట్టే యీ మిత్రరాజులను గూడ నభీష్టదానమున నభిమానింపవలెను.వీరందఱును మలయకేతు వినాశములో మనకు మిక్కిలి సహకరించువారే! అని రాక్షసమంత్రి చంద్రగుప్త మహారాజులవారికి నా మూలమున సందేశ మంపినాఁడు."

సిద్ధార్థకుఁడు చెప్పిన మాటలతో, నాతనిదగ్గర దొరకిన ప్రమాణములతో రాక్షసమంత్రి నిశ్చయముగా ద్రోహబుద్ధి కలవాఁడని మలయకేతువు విశ్వసించెను. అట్టి వానిని వెనువెంటనే తన కొలువునుండి వెడలగొట్టవలెనని యతఁడు నిర్ణయించుకొనెను.

సరిగా నాసమయములోనే రాక్షసమంత్రి సర్వసైన్యములను పాటలీపుత్రముపైకి నడపించుమని సేనాపతులకాజ్ఞయిచ్చుచుండెను. అంతలోనే మలయకేతువు తన కోసమై యాస్థానమంటపములో నెదురు జూచుచున్నాఁడని రాక్షస మంత్రికి వార్త వచ్చెను. అతఁడు ప్రభువు నొద్దకు నిరలంకారముగాఁ బోవుట యుక్తముగాదని తాను వర్తకుల యొద్ద కొన్ని పర్వతకాభరణములు మూఁడింటిలోనొకదానిని ధరించి మలయకేతుని దర్శింపఁబోయెను.

మలయకేతువు రాక్షస మంత్రి కాసనము జూపెను. రాక్షసమంత్రి యుద్ధయాత్ర ప్రారంభమైనట్లును, చతురంగ బలములు పాటలీపుత్రమును ముట్టడించుటకై ముందు సాగు చున్నట్లును మలయకేతువునకు తెలియజేసెను. పరమమిత్రు లైన చిత్రవర్మాదులు రణరంగములో మలయకేతువును బరి వేష్టించి రక్షణ బాధ్యత వహింతురని పలికెను. ఆ మాటలు వినగానే మలయకేతువునకు రాక్షసమంత్రి తనవినాశనమునకే సర్వమును సంసిద్ధము చేసినాఁడని యనిపించెను. అతఁడు "మమ్ము నాశనముచేసి చంద్రగుప్తుని సేవింపవలెనని కుతూ హలపడు చున్నవారే మమ్ముద్ధరించు వారివలె నటించు చున్నా" రని తలంచెను.

మలయకేతువు రాక్షస మంత్రికి సిద్ధార్థకునిజూ "అమాత్యా! మీరీతనికి లేఖ నిచ్చి పాటలీ పుత్రమునకు

బంపిన దెందులకు ?" అని తీవ్రస్వరముతోఁ బ్రశ్నించెను. మలయకేతువు మాటలధోరణిబట్టి రాక్షసమంత్రి యేదియో మోసము జరిగినదని గ్రహించెను.

అతఁడు మలయకేతువు చేతిలోని లేఖ నందుకొని చూచి దిగ్భ్రాంతుఁడయ్యెను. "కుమారా! శత్రువులుపన్నిన కుట్రయిది. ఈ లేఖ నేను వ్రాసినదికాదు" అని పలికెను. మలయకేతువు మఱింత కటువుగా "అయిన నిందలి హారము మాట యేమి?" అని గద్దించియడిగెను. రాక్షసమంత్రి రత్న హారమును బరిశీలించి చూచెను. "కుమారా! నీవిచ్చిన యీ హారము నొకానొక సందర్భమున నేనే ఈ సిద్ధార్థకుని కిచ్చితిని." అని బదులు పలికెను. "ఏమేమీ ! రాజకుమారుడు ప్రసాదచిహ్నముగా మీకు బహూకరించిన ఈ అమూల్య హారమును వీనికి బహూకరించితిరా ? చాల బాగున్నది !" భాగురాయణుఁడు రాక్షసమంత్రి నాక్షేపించెను. మలయకేతువు పరుషకంఠముతో "మఱి యీ ముద్ర సంగతియేమి?" అని యడిగెను. రాక్షసమంత్రి ఖిన్నుఁడై "ముద్రయా! దాని కేమి వంచకులు కపట ముద్రను గూడ సృష్టింపగలరు" అని సమాధానము చెప్పెను.

అంతలో భాగురాయణుఁడందుకొని "ఈ యుత్తరమును వ్రాసిన వారెవరురా?" అని సిద్ధార్థకుని బ్రశ్నించెను. "మహా

మంత్రులవారి ప్రియమిత్రుఁడు శకటదాసు" అని పలికి సిద్ధార్థకుఁడు రాక్షసమంత్రితో "అమాత్యా! ఏమి చేయుదును. వీరు నన్ను కొట్టి హింసించుటచే నిజము చెప్పివైచితిని." అనెను. రాక్షసమంత్రి కంతయు నగమ్యగోచరముగా నుండెను. సిద్ధార్థకుఁడు శత్రువర్గములోని వాఁడని యాయన కర్థమయ్యెను. మఱి తన లేకరియగు శకటదాసే కపట లేఖ నెట్లు వ్రాసెనో యాయన కర్థము కాలేదు. అయినను మిత్ర పక్షపాతియగు రాక్షసమంత్రి 'ఆ లేఖ శకటదాసే వ్రాసి యుండినచో నా దోషము తనదే' యని యంగీకరించెను.

మలయకేతువు శకటదాసును బిలిచియడిగినచో యథార్థము బయటబడుననిపలికెను. కాని భాగురాయణుఁ డందుల కంగీకరింపలేదు. రాక్షసమంత్రి యెదుటికి వచ్చి శకటదాసు నిజము చెప్పుటకంగీకరింపఁడనిభాగురాయణుఁడు వాదించెను అందువలన అతని వ్రాలు మాత్రము విడిగా వ్రాయించి తెప్పించి దానితో నీ లేఖాక్షరములు సరిపోలునో లేదో పరిశీలింతమని భాగురాయణుఁడనెను. రాజభటుఁడు శకటదాసుని వ్రాలు వ్రాయించి తెచ్చెను. ఆ యక్షరములతో లేఖాక్షరములు సరిగా సరిపోలెను. అదిచూచి రాక్షసమంత్రి నిర్వ్యాపారపాటు నందెను. శకటదాసుకూడ విరోధి వర్గములోని వాఁడా యని యతఁడు సందేహించెను.

మలయకేతువు రాక్షసమంత్రి ధరించియున్న రత్న హారమును జూచి "ఆ యాభరణము మీకెక్కడిది? అది మా తండ్రిగారిది కదా! ఆ చంద్రగుప్తుఁడంపిన మూఁడాభరణములలో అది కూడ నొక్కటియైవచ్చి మిమ్ముచేరినదా?" అని యడిగెను. రాక్షసమంత్రి విస్మయపడుచు "కుమారా! ఇది నేను నగలవర్తకుల యొద్ద మూల్యమిచ్చి కొంటిని" అని బదులు చెప్పెను.

రాక్షసమంత్రి మాటలమీద మలయకేతువునకు నమ్మకము కుదరలేదు. మరణకాలమున తన తండ్రి ధరించియున్న మూఁడు హారములలో నొక్క హారము రాక్షసుని దగ్గర నుండుటయే యతఁడు తన తండ్రిని జంపించెననుటకు ప్రత్యక్ష సాక్ష్యమని మలయకేతువు భావించుకొనెను. అతడు క్రోధావేశముతో "రాక్షసా! నీవు విశ్వాసఘాతుకుఁడవు! విషకన్యమిషతో నా తండ్రిని జంపించిన పాపివి నీవు! ఈరహస్యమును నీ ప్రియమిత్రుఁడైన జీవసిద్ధియే ప్రకటించినాడు! ఆశ్రయ దాతలైన మాకు నీవు చేసిన యీ మహాద్రోహమునకు నీకు మరణదండనమే తగినశిక్ష. అయినను నేను నమ్మినవారిని జెఱచు రాక్షసుడను గాను! మలయకేతువును! అందుచే నిన్ను ప్రాణములతో విడచిపుచ్చుచున్నాను. పొమ్ము. పోయి నీ కిష్టుఁడైన యా చంద్రగుప్తునే యాశ్రయింపుము. అతనికే మంత్రిత్వము వహింపుము. ఇక నీతో

మాకుఁ బనిలేదు. వెడలిపొమ్ము. ఇంక నీవు మా దేశము నుండఁదగవు. పొమ్ము." అని కఠినముగా నాజ్ఞాపించెను.

రాక్షస మంత్రి విశ్చేష్టుఁ డయ్యెను. ఆతని కప్పుడేమి చేయవలెనో తోఁచలేదు.

"ఇంత కాలముగా తన చెంత చేరిన వారందఱు చాణక్యానుచరులే యని తాను గుర్తింపలేక మోసపోయెను. తాను చేసిన శత్రుసంహార యత్నములన్నియు విఫలములై పోయెను. తన జీవితమే వ్యర్థమైపోవుచున్నది" అని రాక్షస మంత్రి పరితపించెను.

ఇఁక కష్టకాలములో తన కుటుంబమును దాచి కాపాడిన ప్రాణమిత్రుఁడు చందనదాసునైన సంరక్షించి మిత్రఋణమును దీర్చుకొనవలెనని యతఁడు భావించెను.

రాక్షసమంత్రి ఖడ్గమాత్ర సహాయుఁడై పాటలీపుత్రమునకు బయలుదేరెను.

సిద్ధార్థకుఁడు కర్తవ్యమును నిర్వర్తించి గురుదేవుఁడగు చాణక్యుని సన్నిధికి బోయెను.

మలయకేతువు సిద్ధార్థకుని కడ దొరికిన లేఖానుసారముగా మిత్రద్రోహులై తన వినాశనమునకు తలపెట్టినారని భ్రమపడి యాప్తమిత్రులైన చిత్రవర్మాదులను శిక్షింప దలచెను.

సేనాపతిని బిలిచి చిత్రవర్మాది సామంతు లైదుగురిలో మొదటి మువ్వురు భూభాగమును గోరిన వారగుటచే వారిని గోతులు త్రవ్వి సజీవ సమాధి కావింపుమని యాజ్ఞాపించెను. మిగిలిన యిద్దరు గజ ధనములు గోరినవారగుటచే గజములచే ద్రొక్కించి చంపింపుమని యాదేశించెను. ఆ భయంకర శిక్షలు చూచి యసహ్యించుకొని మలయకేతుని సాయపడ వచ్చిన రాజులందఱును తమ తమ సైన్యములతో స్వదేశములకు మరలిపోయిరి.

అమాత్య సామంత సహాయ విరహితుఁ డయ్యును, స్వబల పరబల తారతమ్య మెఱుఁగక మగధపై దండెత్తిన మూర్ఖుఁడగు మలయకేతువును భద్రభట భాగురాయణాదులు పట్టి బంధించి పాటలీపుత్రమునకు గొనిపోయిరి.

చంద్రగుప్త మహారాజు కృతకృత్యులైన తన సేనాపతులను మెచ్చుకొని మలయకేతుని కారాగారములోఁ బడవేయుఁడని యాజ్ఞాపించెను.

# వశీకరణము

చాణక్యుఁడు తలచిన పని చాలవరకు నెరవేరినది. రాక్షస మలయకేతువుల మైత్రీ బంధము విచ్ఛిన్నమైనది. రాక్షసమంత్రి నిరాశ్రయుఁడైనాఁడు. ఇప్పుడు రాక్షస మంత్రిని మంచిమాటలతో వశముచేసికొని మగధరాజ్య మహామంత్రిత్వమున కంగీకరింపఁ జేసినచోఁ దన ప్రయత్నము పరిపూర్ణముగా ఫలించునని చాణక్యుఁడు నిశ్చయించుకొనెను.

రాక్షసమంత్రి పాటలీపుత్ర నగరోపాంతము నందలి జీర్ణోద్యానమునకుఁ జేరుకొన్నాఁడని చాణక్యునకుఁ దెలియ వచ్చినది. ఆయన వెంటనే శిష్యులైన సిద్ధార్థక సమిద్ధార్థకులను పిలిపించి చండాల వేషములతో కారాగారమున బంధితుఁడై యున్న చందనదాసును వధ్యస్థానమునకు గొనిపొండని యాజ్ఞాపించినాఁడు. ఒక రాజపురుషుని రావించి చందనదాస వృత్తాంతమును జీర్ణోద్యానములోని రాక్షసమంత్రి కెఱిఁగించు నుపాయమును జెప్పి పంపినాఁడు.

రాక్షసమంత్రి యవమాన భారముతో జీర్ణోద్యానములోఁ బ్రవేశించి యెవ్వనినుండియైన చందనదాసునివృత్తాంతము నెఱుంగవలెనని భావించెను. ఆయన యొక శీర్ణ శిలా

ఫలకముపైఁ గూర్చుండి, దైవప్రాతికూల్యమునను బుద్ధిహీనుఁడైన మలయకేతుని యనాలోచిత వర్తనమునను తన యత్నము లన్నియు విఫలములయ్యెఁ గదా యని విచారింప సాగెను. తాను శత్రువులకు జిక్కి చావనైనను జచ్చును గాని వంచనమునకుఁ లోఁబడి చంద్రగుప్తునితో సంధిచేసికొన డని తలచెను.

అంతలో చాణక్య నియుక్తుఁడైన రాజపురుషుఁడు వనములోఁ బ్రవేశించి రాక్షసమంత్రి కెదురుగానున్న యొక్క చెట్టుకొమ్మ కురిత్రాడు గట్టి మెడకు జుట్టుకొని యాత్మహత్యా ప్రయత్నమునకు బూనుకొన్నట్లుగా నభినయింప సాగెను.

రాక్షసమంత్రి వానినిజూచి “ఇదేమి నాయనా! నీ వెవ్వరవో రాజపురుషునివలెనున్నావు! నీవేల యిట్టి ఘోరకార్యమున కొడిగట్టుచున్నావు? ఆత్మహత్య మహాపాపమని యెఱుఁగవా?” అని ప్రశ్నించెను.

రాజపురుషుఁడు “ఆర్యా! నన్నడ్డగింపకుఁడు. నేను తొందరగా నీపాడులోకమును వదలిపోవలెను. దుస్సహమైన మిత్రవ్యసనము గల్గినవాఁడు బ్రతికియుండియు మాత్రము ప్రయోజనమేమి?” అని పలికెను.

రాక్షసమంత్రి యాశ్చర్యపడుచు “మిత్రవ్యసనమా! అదేమియో చెప్పుము. నేనును నీయట్టి వాడనే కనుక నాకు

చేతనైనంతవరకు తగిన సాయము చేయుదును" అనెను. రాజపురుషుండు నివేదించెను.

"ఆర్యా! ఈ పట్టణములో జిష్ణుదాసుండను రత్నాల వర్తకుండొకడున్నాండు. ఆయన ధర్మాత్ముండైన చందనదాసను శ్రేష్ఠికి ప్రాణ మిత్రుండు. రాక్షసమంత్రి కుటుంబమును తన యింట దాచియుంచిన నేరమునకు చంద్రగుప్త మహారాజు చందనదాసునకు మరణదండన విధించెను. ఇప్పుడు చందనదాసును వధించుటకై వధ్యస్థానమునకు గొనిపోవుచున్నారు. ఈ వార్త విని జిష్ణుదాసు దుర్భర దుఃఖముతో మహారాజును దర్శించి "ఎంత మొత్తమైన నరే! ధనముగైకొని తన ప్రాణమిత్రుండైన చందనదాసునకు ప్రాణదానము చేయుండని" ప్రార్థించినాండు. గాని మహారాజంగీకరించలేదు. అందువలన చందనదాసు మీంద స్నేహభావముతో జిష్ణుదాసుండు తన ధనమంతయు దానముచేసి తానగ్నిలో దుమికి ప్రాణపరిత్యాగము జేయనున్నాండు. అట్టి పుణ్యాత్ముండైన జిష్ణుదాసుండు నాకు ప్రియమిత్రుండగుటచే నేనుగూడ నాతని మరణవార్త చెవిని బడకముందే యురి బిగించుకొని చావవలెనని యీ ప్రయత్నము చేయుచున్నాను" అని రాజపురుషుండు కన్నుల నీరు పెట్టుకొనెను.

రాక్షసమంత్రి యాతని మాటలు విని, జిష్ణుదాసుని మిత్రప్రేమను లోలోన ప్రశంసించుకొనెను. ఏ ధనము కోస

రమై తలిదండ్రులు సతీ సుతులు అన్నదమ్ములు పరస్పరము హింసించుకొందురో, పరమ మిత్రులు శత్రులుగా మారుదురో అట్టి మహాధనమును మిత్రునికొఱకై త్యాగము జేయబూనిన జిష్ణుదాసుని బహువిధముల మెచ్చుకొనెను. మిత్రుని గూర్చిన దుర్వార్త చెవిఁ బడకముందే మరణింప దలచిన ఆతని స్నేహశీలమున కాశ్చర్యమందెను. అట్లే తన కుటుంబ రక్షణార్థమై ప్రాణార్పణము జేయనున్న చందన దాసును దలచుకొని యాతఁడు బహువిధముల పరితపించెను శరణాగత రక్షణములో శిబి చక్రవర్తిని తలదన్ను వాఁడని చందనదాసును మెచ్చుకొనెను. ఆయన వెంటనే తన కర్తవ్యమును నిశ్చయించుకొనెను.

"రాజపురుషా ! ఇక నీప్రయత్నము మానుము రాక్షసమంత్రి చందనదాసును రక్షింపవచ్చెననియు, నందు వలన తన యగ్నిప్రవేశమును విరమించుకొమ్మనియు జిష్ణు దాసుతో చెప్పుము. పొమ్ము" అని రాక్షసమంత్రి రాజ పురుషునితోఁ బలికెను.

రాజపురుషుఁడు విస్మయ మందెను. రాక్షసమంత్రి తన యొరలోనుండి ఖడ్గముదూసి "ఇదే నేను చండాలురను సంహరించి చందనదాసును గాపాడుదు" నని బయలుదేరెను రాజపురుషుఁ డతనినివారించి "వలదువలదు. మహాశయా ! ఆ పని మాత్రముచేయకుఁడు. మీరుఖడ్గధారులై వధ్యస్థానము

వైపునకు వెళ్ళునచో నల్లంత మారముననే మిమ్ము జూచి ప్రమాదము శంకించి చండాలురు చందనదాసును తత్క్షణమే చంపుదురు. మున్నొకప్పుడు శకటదాసనువాడు వధ్యస్థలమునుండి తప్పించుకొనిపోయెను. అప్పటినుండి వధ్యస్థాన సమీపమున నెవ్వడేని సాయుధపురుషుఁడు కన్పించినచో తలారులు వెన్వెంటనే మరణశిక్ష విధింపవలసినవానిని చంపి వేయుచున్నారు. కనుక ఆ ఖడ్గము నాకిచ్చి పొండు" అని హితవు చెప్పెను. రాజపురుషుని యుక్తిబలమున రాక్షస మంత్రి నిరాయుధుఁడై వధ్యస్థలము నైపునకుఁ బర్వెత్తి పోయెను.

అప్పటికే వధ్యస్థానమునఁ జండాలురు బలివేషముతో నున్న చందనదాసు నురికంబ మెక్కించిరి. "శ్రేష్ఠీ! ఇప్పటికైన రాక్షసమంత్రి గృహజనమును చాణక్యులకు వశము చేసి నీ ప్రాణములు నీవుకాపాడుకొనుము. నీకొఱకై దుర్భర దుఃఖముతో నల్లాడుచున్న నీ భార్యా పుత్రులను రక్షించు కొనుము." అని తుదిసారిగా చండాలురు చందనదాసును హెచ్చరించిరి. చందనదా సంగీకరింపలేదు. "మిత్రకార్యము నకై యాత్మార్పణము చేయు నవకాశము నాకు లభించి నందులకు మహానందముగా నున్న"దని చందనదాసు చండాలురకు బదులుచెప్పెను.

అంతలో రాక్షసమంత్రి యచ్చటకువచ్చెను. "ఆగుఁడాగుఁడు. ఆతనిని చంపకుఁడు. ఎవ్వని కొనమై పుణ్యాత్ముఁ

చేసి ఈ చందనదాసుకు మరణదండన విధింపబడినదో, అట్టి స్వార్థపరుడు, అసమర్థుఁడు, దైవవంచితుఁడు, విఫలప్రతిజ్ఞుఁడు, రాక్షసమంత్రి వచ్చినాఁడని మీ చాణక్యులతో చెప్పుఁడు. మిత్రరక్షణకై యాతఁడేమి కోరినను దీర్చెదనని నా మాటగా తెలుపుఁడు.'' అని రాక్షసమంత్రి యుచ్చైస్స్వరముతోఁ బలికెను.

ఆ శుభవార్త వెనువెంటనే ఆర్యచాణక్యున కందింపబడినది. చాణక్యుఁడు విజయోత్సాహముతో రాక్షసమంత్రి సన్నిధికి వచ్చెను. "అమాత్యరాక్షసులకు చాణక్యుఁడిదే యభివాదము చేయుచున్నాఁడు.'' చాణక్యుఁడు రాక్షసమంత్రిని గౌరవించెను. "గుణరత్న రత్నాకరులైన ఆర్య చాణక్యులకు ప్రణామములు.'' రాక్షసమంత్రి ప్రత్యభినందనము చేసెను. అంతలో చంద్రగుప్త మహారాజుకూడ నచ్చటకు వచ్చెను. మహారాజు రాక్షసమంత్రికి ప్రణమిల్లెను. రాక్షసమంత్రి మహారాజు నాశీర్వదించెను.

చాణక్యుఁడు రాక్షసమంత్రికి మనవి చేసెను. "అమాత్యశేఖరా! మగధసామ్రాజ్య మహామంత్రిత్వమును స్వీకరించి చందనదాసును రక్షించుకొనుము. భద్రభటాదుల నియోగము, కపటలేఖాకల్పనము రత్నాభరణవృత్తాంతము చందనదాసవధోద్యోగము సమస్తమును మీయనుగ్రహము నర్థించియే చేసితిమి. మీరు మిత్రప్రాణరక్షణార్థమై మా

యభీష్టము నంగీకరింపక తప్పదు. ఇఁక ధర్మాత్ముఁడైన మా మహాప్రభువు, సువిశాలమైన ఈ మగధరాజ్యము మీ యధీనములు. మీరే ఈ క్షణమునుండి మగధరాజ్య మహామంత్రులు !"

ఆర్య చాణక్యుఁడు రాక్షసామాత్యునకు నమాత్య చిహ్నము అందించెను. రాక్షసమంత్రి చందనదాస రక్షణమును, చంద్రగుప్తుని భక్తిభావములను, ఆర్యచాణక్యుల యభ్యర్థనమును బురస్కరించుకొని మగధరాజ్య మహామాత్య పదవిని స్వీకరించెను!

చాణక్య యత్నము ఫలించినది. చంద్రగుప్త మహారాజుకు సమర్థుఁడైన యమాత్యరాక్షసుఁడు మహామంత్రియైనాఁడు. మహామంత్రి ప్రీత్యర్థమై మహారాజు చందనదాసును నగరశ్రేష్ఠిగా నియమించెను. రాక్షసమంత్రి తన కొకప్పుడాశ్రయమిచ్చి, యాదరించినందులకు మలయకేతువును మన్నించి బంధవిముక్తుని జేసి, తండ్రిరాజ్యమునిచ్చి, చంద్రగుప్త మహారాజుకు సామంతుని గావించెను. కృతకృత్యుఁడైన ఆర్యచాణక్యుఁడు భావ్యర్థసంసూచకముగా చంద్రగుప్తుని దీవించెను. "చంద్రగుప్త మహారాజా! జయీభవ! దిగ్విజయీభవ !"

---

# కల్యాణ కౌతుకము

"వీరు నూఱు చెప్పేడు. వేయి చెప్పేడు. నేను మాత్రము మీ ఈ అక్రమమైన దురాక్రమణ వాంఛను హర్షింపలేను నాన్నగారూ!"

"కాదు హెలీనా! ఈ మన యుద్ధోద్యమమును నీవు సరిగా అర్థము చేసికొనలేదు. ఈ జగజ్జైత్రయాత్ర అక్రమము కాదు! ఈ విశ్వ విజయోద్యోగము దురాక్రమణముగాదు! జగన్నియంత కాగోరిన మన అలెగ్జాండరు ప్రభువు ప్రారంభించిన మహాయత్నములో కడపటి ఘట్టమిది! చక్రవర్తి అవసానదశలో నన్ను చేరబిలిచి నాకు తాను రాజ్యాధిపత్యమిచ్చి తానారంభించిన జైత్రయాత్ర సఫలముచేయుమని నన్నాదేశించినాఁడు. నా భుజబల సంపదపై అంతటి విశ్వాసముంచి, నన్ను తన్ను మించినవానిగాభావించిన ఆ మహా ప్రభుని అభీష్టమును నేను సఫలముచేసి తీరవలెను. అందులకే ఇప్పుడు మఱల ఈ భారతభూమిపై దండెత్తిరావలసి వచ్చినది."

గ్రీకు ప్రభువు సెల్యూకసు ప్రియపుత్రికయగు హెలీనాకు తన రణయాత్రా కారణమును వివరించి చెప్పెను. సింధునదీ పరిసర ప్రాంతమున ప్రభుయోగ్యమైన ప్రత్యేక మందిరములో విశ్రాంతిగా గూర్చుండియున్న ఆ తండ్రి కూతుల సంభాషణము క్రమముగా తీవ్రతరమైనది.

"అయిన ఈ సంఢయాత్రకు ప్రధానకారణము అలెగ్జాండరు ప్రభుని ఆదేశమేనా ? మీ కీర్తికాంక్ష కాదా నాన్నగారూ!"

"కాకేమి! ప్రభుని యాదేశముతో బాటు యశోలాభము గూడ ఈ జయేచ్ఛకు పరమప్రయోజనమే! అంతేకాదు! విశ్వవిఖ్యాతమైన గ్రీకు ప్రభువు విజయ పతాకము దిగంత విశ్రాంతదీప్తిమంతమై నిరంతరము సగర్వముగ తలయెత్తి నిలబడుటయే ఈ మహాసాహసమునకు ప్రతిఫలము! లోకోత్తర నాగరకతా సంపన్నమైన గ్రీకు జాతీయ జీవన భావనమును విశ్వవ్యాప్తము గావించుటయే ఈ సామ్రాజ్య విస్తరణాభిలాషకు ముఖ్యహేతువు! ఇది యంతయు నీకు అక్రమముగా కన్పించుచున్నదా హెలీనా!"

గ్రీకుప్రభువు సెల్యూకసు ఉచ్చైస్స్వరముతో ఉత్సాహ పారవశ్యమున కుమార్తెను ప్రశ్నించెను. రాకుమారి హెలీనా ప్రశాంత దరహసిత వదనముతో బదులు పలికెను.

"అంత ఆవేశపడనక్కరలేదు నాన్నగారూ! వీరోచితమైన మీ విజయేచ్ఛను నేనాక్షేపించుట లేదు. మీ కీర్తికాంక్షను నేను కాదనుటలేదు! కాని ప్రశాంతముగా నాలోచించినచో ఈ రాజ్యవిస్తరణ కాంక్షకు అంత మెక్కడ కనిపించును? ప్రపంచములోని సర్వదేశములను నాశనము చేసి,

జయించిన గదా విశ్వ విజయము సాధ్యమగును! ఒకవేళ మానవ మారణ హోమమును నిర్వర్తించి లోకము నెల్ల జయించినను చివఱకు మనము త్రవ్వి తలకెత్తుకొనునది ఏమున్నది? ఇట్టి దారుణ హింసాకాండవలన కలుగు పరమ ప్రయోజనమేమి!"

"పరమ ప్రయోజనము యశోలాభమని చెప్పితినిగదా హెలీనా! అయినను నీకు నా యీ మాటలు ఇష్టార్థమగు నట్లు లేవు!

ఆ చంద్రగుప్తునితోడి అల్పకాల సహవాసము వలన నీ కాతని యెడలను, ఆతని దేశము నెడలను అపారమైన యభిమాన మేర్పడినట్లున్నది! భారతీయ తత్త్వగ్రంథములు చదివి చదివి వారి జీవన విధానముపై, వారి ఆధ్యాత్మిక భావనముపై ఇంత మమకారము పెంచుకొంటివి! కనుక నే లోకైక నాగరక జాతియగు మన గ్రీకు జాతీయ మహత్త్వ మును గ్రహింపలేకున్నావు!"

"అట్లుకాదు నాన్నగారూ! అంత తేలికగా భావింప కుండు. గ్రీకులవలె భారతీయులుగూడ పరమ నాగరకులని నా అభిప్రాయము శౌర్య ధైర్యౌదార్య జ్ఞానదీప్తమై, సముదాత్త సంస్కృతి సంపన్నమైన భారతజాతికి, లోకో త్తర ప్రజ్ఞాప్రపూర్ణమై, పరాక్రమ ప్రశస్తమైన గ్రీకు జాతికి పరస్పర స్నేహమేర్పడుట లోకశ్రేయస్కరమని నా

యభిప్రాయము. గ్రీకు జాతి పాశ్చాత్యలోకమునకు నాగరకతను, తత్త్వభిక్షను పంచిపెట్టగా, భారతజాతి ప్రాచ్యభూములకు సంస్కృతిభిక్ష పెట్టి, జ్ఞానదానము చేసినదని నా యుద్దేశ్యము. అందులకే గ్రీకు భారతజాతులు ఈ సంఘర్షణము మాని మధురమైత్రితో వర్తింపవలెనని నా కోరిక!”

హెలీనా! నీవలె ఆలోచించినచో ఇక ప్రపంచమున వీరత్వమునకు ప్రసక్తియే లేదు! ఒక దేశమును మఱియొక దేశము జయించుటయే జరుగదు! ఒక ప్రభువును మఱియొక ప్రభువు ఓడించుటయే యుండదు! వీరవరులకు సహజలక్షణమైన విజయయాత్రలు సాగనే సాగవు! లోకములో అందరును రాజులే కాని రారాజులే యుండరు! అప్పుడు ప్రభుహృదయములు, ప్రజాజీవనములు నీరసములై నిస్సారములై నిష్ప్రయోజకములగును. అట్టియెడ మన మానవ జన్మమునకన్న క్రిమికీటకముల జన్మములే మేలుగా కనిపించునుగదా!”

“అంతదూరము మీ రాలోచింపరాదని నే ననుచున్నాను నాన్నగారూ! నేను పలుకునది సర్వస్వతంత్రమైన ఒక జాతిపై నిష్కారణముగ దండెత్తుట న్యాయముకాదనియే? ఒక ప్రశాంతభూమిని రుధిరపంకిలము చేయుట అకార్యమనియే! దురాశతో దురాక్రమణకు పూనుకొనుట అనుచితమనియే?”

ఆ మాటలువిని సెల్యూకసు కొంత సేపు నిశ్శబ్దముగా, నిశ్చలముగా నూరకుండెను. అంతలో ఆయన మానసాకాశ మున నొక నూత్నభావము తళుక్కున మెరసెను. "అల్లై నచో ఆ చంద్రగుప్తుఁడు మగధప్రభునైన వెను వెంటనే జైత్రయాత్ర నేల తలపెట్టవలెను? అది మాత్రము పర స్వాతంత్ర్యాపహరణము గాదా? భయంకర విధ్వంస కాండ కాదా?"

"కాదు నాన్నగారూ! ఆతని జైత్రయాత్ర స్వజాత్య భ్యుదయమునకు! స్వదేశైక్యమునకు! బలహీనములై, కీర్ణ ప్రకీర్ణములై యున్న భారతీయరాజ్యములను సమైక్యముచేసి, భారతదేశమున నేకచ్ఛత్రాధిపత్యము స్థాపించి, మీవంటి వారు తలపెట్టు దురాక్రమణముల నుండి ఆత్మరక్షణము గావించుకొనుటకు!"

ఆ మాటలు విని సెల్యూకసు పకపక నవ్వెను. "అయిన చంద్రగుప్తుని జైత్రయాత్ర సముచితమనియు, మన దండయాత్ర అనుచితమనియు నీ అభిప్రాయము! ఇది నీకు భారతదేశముపై గల అపారాభిమానమునకు నిదర్శ నముగాని అన్యముకాదు తల్లీ!"

హెలీనా ఒకక్షణము మౌనము వహించెను. "కేవల మభిమానమే కాదు నాన్నగారూ! ఏలనో ఈ దేశము నాకు ప్రాణప్రియమైనది! ఈ ప్రకృతి నాకు ఆత్మీయమైనది! తల్లిని

కోల్పోయిన నాకు ఈ భారతభూమి శోకోపశమనము చేసి మనశ్శాంతిని ప్రసాదించినది.

సమున్నత మహానగ సమూహములతో, నిర్మల జల పూర్ణ నదీనదములతో, సుమసుందర సరోవరములతో, సస్య శ్యామలములైన సువిశాల భూములతో, పరమపావనము లైన తపోవనములతో, ప్రశాంత రమణీయములైన ఆశ్రమ సీమలతో, మహిత మంత్రారావ ముఖరితములైన ముని సంఘములతో, స్నేహమాధురీ ధురీణములైన జంతు సంతా నములతో, పుష్పపరిమళ పూర్ణములైన వివిధ తరువర లతావితానములతో, విద్యా విశిష్టములైన విశ్వ విద్యా లయములతో, భూలోకస్వర్గమై శోభిల్లు ఈ ఆర్యసీమపై, ఈ భారతభూమిపై అనురాగ మేర్పడుటలో ఆశ్చర్యమే మున్నది నాన్నగారూ! నిత్యసంతుష్టులై, నియమితజీవనులై, నిరంత రాతిథి సత్కార పరాయణులై, భాగ్యసంపన్నులై హాయిగా జీవించు ఇచ్చటి ప్రజల మేలుగోరుటలో అనౌ చిత్య మేమున్నది?"

గ్రీకు ప్రభువు సెల్యూకసు సహాసముగా పలికెను. "హెలీనా! ఈ ఆలోచనాసరళి యంతయు మున్ను మన కతిథియై యుండిన ఆ యుద్ధత రాకుమారుడే నీకు నూరి పోసెనని పించుచున్నది! నీ ధోరణి చూడగా నీవు శాశ్వతముగా ఈ దేశములోనే ఉండిపోవునట్లున్నావు!"

"అట్టి యదృష్టమే లభించినచో...." హెలీనా అప్రయత్నముగా నర్ధోక్తిలోననెను. సెల్యూకసు సవిమర్శముగా జూచుచు "మంచిది తల్లీ! దైవానుగ్రహ మెట్లున్న నట్లు జరుగును? కాని కర్తవ్య నిర్వహణమునుండి మాత్రము నేను వెనుకంజ వేయలేను! సరే! ఇఁక నీవు విశ్రాంతి వహింపుము. నేను మన స్కంధావారములను సమీక్షించి, సముచిత సన్నాహము లాదేశించి వత్తును" అని లేచి బయలుదేరెను.

హెలీనా సాలోచనముగా "కానిండు నాన్నగారూ! మీ ప్రయత్నములే కొనసాగనిండు! కాని భారతీయ రణ వ్యూహ విధానములే కాక, మీ సమక్షమున మన యుద్ధ విద్యా రహస్యములను గూడ సమగ్రముగా గ్రహించి, స్వదేశ సంరక్షణోద్యుక్తమైన అపార సేనావాహినితో విజృంభించు ఆ చంద్రగుప్త మహారాజును జయించుట మాత్రము అసాధ్యమనియే నా నిశ్చితాభిప్రాయము." గ్రీకు ప్రభువు సెల్యూకసు ఆ మాటలు వినియు విననట్లుగా గబగబ ముందునకు సాగిపోయెను. హెలీనా నిమీలితనేత్రయై, ఆలోచనా నిబద్ధయై, నిశ్శబ్దముగా అట్లే కూర్చుండియుండెను.

# దిగ్విజయము

చంద్రగుప్తమహారాజు సుస్థిరమును, సువిశాలమును నైన మగధమహారాజ్యమున కధిపతియైనాఁడు. పశ్చిమమున పాంచాలము మొదలు తూర్పున వంగదేశమువరకును, నుత్తరమున కోసలరాజ్యము మొదలు దక్షిణమున నవంతిరాజ్యము వరకును బరివ్యాప్తమైయున్న మగధరాజ్య మాతని కధీనమై యున్నది. కాని ఆ రాజ్యము సామ్రాజ్యము గావలెనని చంద్రగుప్తుఁడాశించెను. ఆ మహారాజు చాణక్య గురుదేవుల యాదేశానుసారముగా సురక్షితమైన మగధ రాజ్యము నమాత్య రాక్షసుని కప్పగించి యొక శుభముహూర్తమున తాను చతురంగ సైన్య సమేతుఁడై దిగ్విజయయాత్రకు బయలుదేరెను.

ఆఱులక్షల పదాతిదళముతో, ముప్పదివేల యాశ్విక సైన్యముతో, తొమ్మిదివేల గజదళముతో, రెండువేల రథ సముదాయముతో శత్రు దుర్నిరీక్ష్యుఁడై యున్న చంద్ర గుప్త మహారాజు జైత్రయాత్ర సాగెను. క్రమక్రమముగా నొక్కొక్క రాజ్యము నాక్రమించుకొనుచు మహారాజ సైన్యములు పురోగమించుచుండెను. అప్రతిహత పరాక్ర మోపేతములైన యా మహాసైన్యములను ధిక్కరించి యెది రించి నిలుచు శత్రువులే లేకపోయిరి.

చంద్రగుప్తమహారాజు శరణు వేడిన తక్షశిలాధి మైత్రి చేసికొని యతని కానుక లంది ముందంజ వేసెను. కాశ్మీరనాథుని పరాజితుని జేసెను. శైబ్యుని సామంతుని జేసికొనెను. సింధు మాళ్వ దేశాధిపతులను వశ పరచుకొనెను. సౌరాష్ట్రపతి సాంగత్యము నంగీకరించెను. ఉజ్జయిని రాజు నోడించి సత్కృతులు పొందెను. కుంతల కదంబ కొంకణ గాంగ మహారాష్ట్ర ప్రభువులను సామంతు లను గావించుకొనెను. కౌశాంబి నాథునితో నెయ్యము పాటించెను. మిత్రులైన కళింగాంధ్ర చోళ కేరళ సింహ ళాధిపతులను సందర్శించి సమ్మానితుఁడయ్యెను. దిగ్విజయ యాత్ర సఫలము చేసికొని వివిధరాజ్య వికీర్ణమై యున్న భారతదేశము నొక్కటిచేసి ఏకచ్ఛత్రాధిపతి యయ్యెను. విజయశ్రీ విరాజితుఁడై నిజరాజధానికి మరలివచ్చిన మహా రాజునకు పాటలీపుత్రము పరమానందముగా స్వాగతము పలికెను.

అంతలో వార్తాహరులు గ్రీకు ప్రభువు సెల్యూకసు భారతవిజయమునకై రెండులక్షల యేబదివేల మహాసైన్య ముతో నెత్తివచ్చి సింధుప్రాంతమున విడిసి యున్నాడని వార్త తెచ్చి మహారాజున కందించిరి. ఆ మాట వినగానే ఆయన చాల ఆశ్చర్యపడెను. సెల్యూకసు పేరు వినగానే చంద్రగుప్తునకు బహువిధములైన పూర్వస్మృతులు జ్ఞప్తికి

వచ్చెను. "ఒకపక్షమున సెల్యూకసు తన నాదరించి యాతిథ్య మిచ్చి యుద్ధవిద్యలో గురుత్వమును వహించినవాడు అంతే గాక తన్నువలచి వలపించుకొన్న హెలీనాకు ప్రియజనకుడు. అట్టి వానిని తనిప్పుడు రణరంగములో ప్రతిఘటింపవలసి యున్నది. అవును తప్పదు. స్వజాతిగౌరవమును స్వదేశ స్వాతంత్ర్యమును సంరక్షించుటకై తాను యుద్ధమునకు సిద్ధముగాక తప్పదు" మహారాజు నిశ్చయించుకొనెను.

"విశ్వవిజయమునకై మున్ను విఫలయత్నము చేసిన గ్రీకు చక్రవర్తి అలెగ్జాండరు స్వదేశమునకు మరలి పోవుచు మార్గమధ్యమున మరణించుటచే సేనాపతి సెల్యూకసు గ్రీకు ప్రభువయ్యెను. యుద్ధప్రియుడైన సెల్యూకసు అలెగ్జాండరు ప్రారంభించిన భారతవిజయమును పరిపూర్ణము చేయవలెనని నిశ్చయించుకొనెను. ఆతడు తన మహాపరాక్రమము నెరిగిన వాడయ్యెను, దుర్గర్వదూషితుండై దురాక్రమణవాంఛతో భారతభూమిపై దండెత్తి వచ్చెను.

యవన సైన్యములు తక్షశిలా దుర్గాభిముఖములై వాయువేగమున సాగివచ్చుచుండెను." పూర్వాపరము లాలో చించి చంద్రగుప్త మహారాజు నిశ్చయించుకొనెను.

"తప్పదు అకారణముగా భారతదేశముపై దండెత్తి వచ్చిన సెల్యూకసును ప్రతిఘటింపక తప్పదు. మాతృదేశ రక్షణకై యన్ని మమకారములు విడనాడక తప్పదు. దురా

క్రమణము నెదుర్కొనక తప్పదు. ఒక్క సెల్యూకసు కాదు వేయిమంది సెల్యూకసు లొక్కపెట్టున దండెత్తి వచ్చినను భారతభూమిలో నొక్క యంగుళముమేర గూడ జయింప జాలరు. యవన గర్వాంధకారము వీర భారత భాను దీప్తిలోఁ బటాపంచలు కాక తప్పదు."

చంద్రగుప్త మహారాజు అఖండ శౌర్య సంపన్న మైన అపార భారత వీర సైన్యముతో యవన సైన్యముల కన్న ముందుగా తక్షశిలానగరమును జేరుకొనెను. శత్రు సైన్యములు నగర ప్రాంతములకు రాకుండ భారతసైన్యము ప్రతిఘటించి నిలిచెను. యవన భారత సైన్యములకు భయం కర సంగ్రామము ప్రారంభమయ్యెను.

దురాక్రమణ పరాయణమైన గ్రీకు సైన్యమును స్వాతంత్ర్య రక్షణాసక్తమైన వీర భారత సైన్యము చీల్చి చెండాడుచుండెను.

భారతవీరుల శౌర్యాగ్నిలో యవన సైనికులు శలభ ములవోలె హతమై పోవుచుండిరి.

చంద్రగుప్త మహీపతి యవన ప్రభువు నెదుర్కొ నెను. భారతీయ యుద్ధపద్ధతికి తోడు గ్రీకు యుద్ధ ప్రణాళిక కూడ సమగ్రముగా గ్రహించియున్న చంద్రగుప్తునిముందు సెల్యూకసు నిలువలేకపోయెను.

ప్రళయ భీకరమైన యీ మహాయుద్ధములో చంద్ర గుప్తుఁడు ప్రదర్శించిన రణకౌశలమునకు గ్రీకు ప్రభువు నివ్వెరపడెను.

అంతలోనే మహారాజు అధిష్ఠించియున్న గజరాజ మును గాంచి యవన ప్రభుని అశ్వరాజము బెదిరిపోయి ప్రక్కకు దిరిగెను. గజరాజము తన తుండముతో సెల్యూ కసు ఎక్కియున్న అశ్వరాజమును గట్టిగా జుట్టి నేలగొట్టెను సెల్యూకసు భూపతితుఁ డయ్యెను. సంగ్రామము సమాప్త మైనది. గ్రీకు ప్రభువు పరాజితుఁడైనాడు.

జయశ్రీ చంద్రగుప్తుని వరించినది. భారతసైన్య ములో విజయోత్సాహము మిన్ను ముట్టినది.

మున్ను తనకు గ్రీకుల సమర కళావిశేషముల నెరగిం చిన సెల్యూకసుపట్ల కృతజ్ఞతాసూచకముగా చంద్ర గుప్తుఁడు సెల్యూకసుతో సంధి ప్రసంగము కావించెను. సెల్యూకసు పరాజయ పరిక్లిన్నుఁడై చంద్రగుప్తునితో సంధి జేసికొని నెయ్యము వాటించెను. ఆర్యచాణక్యుల యభీష్టాను సారముగా గ్రీకు ప్రభువు సెల్యూకసు తన ప్రియ పుత్రిక యగు హెలీనాను చంద్రగుప్తున కిచ్చి వైభవముగా వివా హము చేసెను.

సమర రంగమున విజయలక్ష్మి కరగ్రహణము కావిం చిన చంద్రగుప్తుఁడు జగదేకసుందరియగు హెలీనాను గృహ లక్ష్మిగా స్వీకరించెను.

సెల్యూకసు తన కక్షీనములై యున్న కొన్ని భూభాగ ములు హెలీనాకు అరణముగా నిచ్చెను.

మహారాజు ఐదువందల భద్రగజములను మామగా రికి బహూకరించెను. గ్రీకు భారత జాతుల నెయ్యము తియ్యని వియ్యముగా రూపొందినది.

అన్యోన్యాను రక్తులైన హెలీనా చంద్రగుప్తుల కల్యాణము భారతసామ్రాజ్య కల్యాణమై ప్రవర్తిల్లినది. ఆకల్యాణ మహోత్సవదీప్తులతో చంద్రగుప్త మహారాజు పట్టపురాణితో నఖండ భారత సామ్రాజ్యాధినేతగా నభిషి క్తుడైనాడు. ఆయన ప్రథమ భారత చక్రవర్తి యైనాఁడు.

# ఆశీర్వాదము

"అమ్మా! అనుగు బిడ్డడు చంద్రగుప్తుఁడు నమస్కరించుచున్నాడు."

"చిరంజీవివై వర్ధిల్లు నాయనా!"

"జననీ! శత్రునిర్మూలము కావించి విజయలక్ష్మీ విరాజితుఁడైన చంద్రగుప్తుఁడు మాతృమూర్తి పాదారవిందములపై భక్తితో ప్రణమిల్లుచున్నాడు."

"అంతయు భగవదనుగ్రహము తండ్రీ!"

మురాదేవి తనకు నమస్కరించిన కుమారుని లేవనెత్తినది. అంతులేని సంతోషముతో కౌగిలించుకొనినది. తన జీవితాశయ మీడేరినందుకు అనిర్వచనీయమైన యానందముతో ఆమె హృదయ ముప్పొంగినది.

"ఆనాడు నేను చేసిన ప్రతిజ్ఞ ఫలించినది. తల్లీ! నీవు నేడు వీరమాతవు! రాజమాతవు!"

చంద్రగుప్తుఁడు సగర్వముగా పలికెను.

"సర్వమును గుర్తించుచుంటిని కుమారా! నిజభుజపరాక్రమము, పాణిని మహర్షి యాశీర్వాదము, చాణక్య మహామాత్యుల యఖండ మేధావైభవము సదారక్షకములై

నిన్నింత వానిని కావించినవి. నాకు రాజమాత గౌరవమును ప్రసాదించినవి. ధన్యురాలను.''

మురాదేవి పరమానంద పరవశయై పలికినది.

చంద్రగుప్తుఁడు దిగ్విజయానంతరము మాతృశ్రీ యాశీర్వాదమును బొందుటకై మురాదేవి సమక్షమున కరిగెను. తననే జీవితాశాజ్యోతిగా భావించి, కంటిలో వత్తి నిడికొని పెంచి పెద్దజేసిన మాతృమూర్తి ఆశీర్వాదము తన భావి జీవితములో శ్రీరామరక్ష యని యతఁడు భావించెను.

''జననీ జన్మభూమి శ్చ స్వర్గా దపి గరీయసీ ''అను ఆర్యోక్తి ఆతనిమనమున మఱియొకపరి మెదలెను. మాతృదేశమును శత్రువుల బారినుండి సంరక్షించిన యనంతరము మాతృశ్రీని సందర్శించిపోవుటకై యరుదెంచెను.

''తల్లీ ! దురాత్ములైన నందులను నిర్మూలించితిమి. విదేశీయుల పీడ మడంచితిమి. నేడు రాజ్యము నిష్కంటకమైనది. సర్వము సుఖాంతము శుభాంతమునైనది.''

''సంతోషము కుమారా ! సామ్రాజ్యాధినేతమైన వీరకుమారునిగాంచి ఏ మాతృ హృదయము హర్ష పులకితమై పరవళ్ళు త్రొక్కదు! దిగ్దిగంతములవరకు ప్రసరించిన తనయుని కీర్తికాంతులను గాంచి ఏ తల్లి హృదయము పారవశ్యము చెందదు.''

మురాదేవి చంద్రగుప్తుని ఒడలెల్ల ఒక్కసారి నిమిరినది. చక్రవర్తిత్వ భారము వహింపనున్న చంద్రగుప్తునితో గంభీరముగా పలికినది.

"కుమారా! ఒక్కమాట. నీవు నిర్వహింపవలసిన కార్యభారము మఱి యెంతయో కలదు. చంద్రగుప్త విజయము ధర్మవిజయము. నందనాశనము అధర్మపరాజయము. ఏ సదాచార ధర్మరక్షణకై యింతకాలము నీ జీవితమంతయు పోరాడితివో, ఆ పవిత్ర భారతధర్మపరిరక్షణకై దీక్షాకంకణము ధరింపుము. న్యాయధర్మశీలుండవై ప్రజానురంజకుండవు కమ్ము. సత్యపథమును దప్పని ఆదర్శ చక్రవర్తివై స్వధర్మమును నిర్వర్తింపుము. సాధు జన విధేయుడవు కమ్ము. నీ ప్రజాపాలనము భవిష్యద్భారత మహామహీశులకు మార్గదర్శకమై పరిఢవిల్లునుగాక! నీ అనుపమాన మాతృభక్తి సూచకముగా "మౌర్యచంద్రగుప్త" యను నామధేయముతో ప్రశస్తి నందుదువుగాక!"

మురాదేవి అపారవాత్సల్యముతో కుమారుని ఉపదేశాత్మకముగా దీవించినది. ఆమె ప్రబోధములో చంద్రగుప్తునకు తన భావి జీవితకర్తవ్యోపదేశము గోచరించినది. తల్లి కంఠమున నాడు దేవవాణి ప్రతిధ్వనించుచున్నట్లు ఆతండు భావించెను.

"మాతృదేవతవైన నీ ఆశీర్వాదము నాకు శిరోధార్యము తల్లీ !"

చంద్రగుప్తుఁడు మురాదేవి ఆశీస్సులను పొంది సెలవు గైకొనెను.

# ఆదర్శ ప్రభుత్వము

చంద్రగుప్త చక్రవర్తి తేజోబలము, చాణక్య గురుదేవుల మేధాశక్తి, రాక్షసామాత్యుల మంత్రాంగదీప్తి, రాజోద్యోగుల కార్యదీక్ష, భారతసామ్రాజ్యమును సుప్రతిష్ఠితము చేసినవి. సువ్యవస్థితమైన యీ మహాప్రభుని పరిపాలనములో దేశము నిత్యకల్యాణము పచ్చతోరణముగా కళకళలాడినది. ప్రజలందరు శాంతిసౌఖ్యములతో నానందభరితులై యుండిరి. చక్రవర్తి గురుదేవుని యర్థశాస్త్రోపదిష్ట మార్గమున రాజ్యపాలనాపద్ధతిని తీర్చిదిద్దుకొనెను తరతరాలకు యుగయుగాలకు, తన పరిపాలన మాదర్శవంతముగా నుండునట్లు ప్రభుత్వ వ్యవస్థ నేర్పరచెను.

సామ్రాజ్యమునకు సర్వాధికారి చక్రవర్తి. న్యాయనిరూపణములో, శాసన నిర్మాణములో, కార్యనిర్వహణములో ఆయనదే సర్వాధిపత్యము. అనుపమబుద్ధి సంపన్నులైన మంత్రుల సహాయమున చక్రవర్తి సర్వకార్యములు నిర్వహించుచుండెను. నిరంతర కార్యోత్సాహ శీలుఁడై, ధర్మరక్షకుఁడై ప్రజాహితమే తన హితముగా, ప్రజాసౌఖ్యమే తన సౌఖ్యముగా చక్రవర్తి భావించుకొనుచుండెను. విద్యావివేక దక్షుఁడైన మహాప్రభువు ఆన్వీక్షకి, త్రయీ

వార్తాదండ నీతులను క్షుణ్ణముగా గ్రహించి కర్తవ్యనిర్వహణము గావించుచుండెను.

చక్రవర్తికి మంత్రిపరిషన్నాయకుఁడైన ప్రధానామాత్యుఁడు కార్య నిశ్చయములో, నిర్వహణములో సర్వవిధముల సహకరించుచుండెను. శాస్త్రలోకజ్ఞానసంపన్నులైన మంత్రులు నిరంతరము ప్రభువుకు మార్గదర్శకు లగుచుండిరి రాజ సమక్షమున రాజ్యకార్యనిర్వహణమునకై కేంద్ర కార్య నిర్వాహక మండలి ప్రవర్తించుచుండెను. సమాహర్తాది ప్రధానోద్యోగులు దుర్గ రాష్ట్ర ఖని సేతు వనవ్రజ వణిక్పథముల సుస్థితి నిల్పుచు ఆదాయసంపాదనము చేయుచుండిరి. రాజ్యమంతయు రాష్ట్రములుగా రాష్ట్రములు మండలములుగా మండలములు గ్రామములుగావిభక్తమైయుండెను రాష్ట్రకార్య నిర్వాహకులు, గ్రామకార్య నిర్వాహకులు నియమితులై యుండిరి.

కేంద్రరాష్ట్ర ప్రభుత్వములలో పరిపాలనా సౌలభ్యమునకై బహువిధములైన శాఖ లేర్పరుపబడి యుండెను ప్రభుత్వాదాయాభివృద్ధి సాధించుటకై గోపులు, స్థానికులు, ప్రదేష్టలు నను రాజాధికారులు క్రమముగా గ్రామాధికారులై మండలాధికారులై రాష్ట్రాధికారులై నియోగింపబడి యుండిరి.

పురపరిపాలనము సర్వ సమర్థములైనయూఅనసంఘముల సహకారమున నిర్వర్తింపబడుచుండెను. పారిశ్రామికాభ్యుద

యము, విదేశీయ వసతిపాలనము, జనన మరణ పరిగణనము వ్యాపారవాణిజ్యాభివృద్ధి, ఉత్పత్తి విక్రయ విశేషములు అమ్మకపుపన్నుల పరిశీలనము-ననునవి యాఋసంఘముల చేత నిర్వహింపబడుచుండెను.

గ్రామపాలనము వృద్ధ పరిషన్ముఖమున గ్రామాధ్యక్షా ధీనమైయుండెను. ప్రజాదీక్షకు ప్రభుసహకారముతోడై వ్యవసాయవ్యాపారము లభివృద్ధి పొందుచుండెను. గ్రామము లెల్ల స్వయం సమృద్ధములై, జలవసతి పూర్ణములై, నిరంతరాభివృద్ధి గాంచుచుండెను. భూములెల్ల సారవంతములై ఫలవంతము లగుటచే దేశము పాడిపంటలతో శాంతి సౌభాగ్యములతో తులదూగు చుండెను.

రాజోద్యోగులు న్యాయబద్ధముగా, నిష్పక్షపాతముగాఁ బ్రవర్తించునట్లు నియమము లేర్పరుపఁబడెను. రాజ బంధువులకు, నుద్యోగులకు, పరిజనములకు సంతుష్టికరము లగు యోగ్యవేతనములు నిర్ణయింపబడెను. అసహాయులకు దీన దుఃఖితులకు రాజకోశమునుండి యుపకారభృతి లభించుచుండెను. మతధర్మ సంస్థల సక్రమ నిర్వహణము సాగుచుండెను. చక్రవర్తి చారచక్షువై ప్రజాహృదయమును బరీక్షించుకొనుచు ధర్మపాలనము గావించుచుండెను.

దేశప్రజలందఱు జారచోర భయదూరులై నిశ్చింతగా జీవించుచుండిరి. శిక్షాస్మృతి యతికఠినమగుటచే దురాచారములు రూపుమాసిపోయెను. చక్రవర్తి సమయ సముచిత కార్య కరణ దక్షుండై ప్రజారక్షకుండై ప్రశంసార్హుండగుచుండెను. సంధి విగ్రహపద్ధతు లెఱింగి నిఖిల శత్రువులను నిర్జించి, ప్రజాభిమానము నార్జించి సామ్రాజ్యమును సురక్షితము గావించుకొనెను.

శక్తిసంపన్నమైన చతురంగ సేనాబలము నిరంతరము సామ్రాజ్య సంరక్షణమునకై సర్వసిద్ధమై యుండెను. పటిష్ఠమైన నౌకాదళము వ్యాపారసౌకర్యములకై యుపయుక్తమగుచుండెను. ధనుర్బాణ కృపాణ గదా తోమరాద్యాయుధములతో బలిష్ఠమైన సమస్తసైన్యము ప్రభు విధేయమైన యొక సమరసమితి యధీనమునఁ బ్రవర్తించుచుండెను. చక్రవర్తి సైన్యములకుఁ దోడుగా నవసరమైనప్పుడు సాయమువచ్చుటకై సామంతప్రభు సైన్యము సన్నద్ధము చేయబడియుండెను. సామ్రాజ్య సైనికులు దేశీయ యుద్ధ శిక్షణముతోఁబాటు గ్రీకు యుద్ధపద్ధతులలోఁగూడ నారి తేరియుండిరి. సమర్థులు, స్వామిభక్తులునైన దళాధిపతులు, సైన్యాధినేతలు చక్రవర్తి కనుసన్నలలో మెలగుచు కర్తవ్యపరాయణులై యుండిరి.

రాజ్యమునందలి నగరములు జనపదములు శుభ్రములై సుందరములై నియమిత మార్గమును నిర్మింపబడి యుండెను.

రాజధానియైన పాటలీపుత్రము పరమరమణీయముగా పునర్ని ర్మాణము గావించెను.

వివిధోద్యాన విలసితమై సుమ సురభిళమై పుష్ప పురమై కుసుమ పురమై శోభిల్లుచుండెను.

గంగా శోణానదుల మధ్యస్థమైన యా మహానగరము పదునాల్గు మైళ్ళ విస్తీర్ణముగలిగి దుర్లంఘ్యములైన ప్రాకా రపరిఖలచేత పరివృత్తమై యజేయమై యుండెను.

రాజమార్గము సువిశాలమై యాతా యాత ప్రజా సందోహ సందీప్తమై పరిఢవిల్లుచుండెను. రమణీయ పుష్పో ద్యానపరివేష్టితమై రాజభవనము వైభవోపేతమై వైజయం తము నధః కరించుచుండెను.

చక్రవర్తి ప్రజా ప్రార్థనము లాలకించునప్పుడును ధర్మానుష్ఠాన నిర్వహణ వేళయందును మృగయా విహార ప్రయాణము అందును ప్రజానీకమునకు దర్శన భాగ్యమును ప్రసాదించుచుండెను.

చక్రవర్తి సామ్రాజ్యము నందంతటను వైదిక ధర్మ మును సుప్రతిష్ఠితము చేసెను. విద్యావ్యాప్తికై శ్రద్ధ వహిం చెను. సంస్కృత ప్రాకృతాది భారతీయ భాషలతోఁబాటు విదేశ భాషలుకూడ విద్యాలయములలో నేర్పించునేర్పాట్లు చేసెను వ్యాకరణాది శాస్త్రాధ్యయనము సక్రమముగాఁ

జేయించెను. దేశ విదేశ విద్యార్థి బృందములతో సరస్వతీ సదనములై వర్ధిల్లు గురుకులముల నభిమానించి పోషించెను. భారత ప్రజల భౌతికాధ్యాత్మిక జీవనాభ్యుదయమును సాధించి చంద్రగుప్త చక్రవర్తి ప్రజాహృదయ సార్వభౌముఁడయ్యెను.

# చంద్రగుప్త చక్రవర్తి

"చంద్రగుప్తా!"

"గురుదేవా!"

"నందవంశము నిర్మూలమైనది."

"తమ ప్రతిజ్ఞాఫలము."

"ప్రజాకంటకమైన నందరాజుల నాగధ్వజము నేల గూలినది."

"తమ మంత్రశక్తి."

"మనోజ్ఞమైన మౌర్యసార్వభౌముని మయూర పతాకము సగర్వముగా శోభిల్లుచున్నది."

"తమ యనుగ్రహము."

"మగధరాజ్యము సంరక్షితమైనది."

"తమ మేధావిశేషము."

"అమాత్య రాక్షసుఁ డనుగ్రహించినాఁడు."

"తమ నీతి నైపుణ్యము."

"జైత్రయాత్ర సఫలమైనది."

"తమ శుభాశీర్బలము."

"సామ్రాజ్యము సుప్రతిష్ఠితమైనది."

"తమ మంత్రాంగనైపుణ్యము."

"ప్రజలందరు ననురక్తులైనారు."

"తమ మహోపదేశ ఫలము."

"ప్రజాజీవితము సుఖసంపన్నమైనది."

"తమ మార్గదర్శకత్వము."

"జాతీయ జీవనము పునరుజ్జీవన మందినది.

"తమ ప్రతిభా వైభవము."

"విదేశీయ దురాక్రమణ వాంఛ విచ్ఛిన్నమైనది.

"తమ మనోభీష్టసిద్ధి."

"నీవు భారత చక్రవర్తివైతివి."

"తమ యనుగ్రహము."

"పరమ నాగరకములై ప్రపంచప్రసిద్ధములైన గ్రీకు భారతజాతుల బాంధవ్య బంధముతో లోకకల్యాణము సమకూరినది.

"తమ దయా విశేషము."

"నా అభీష్టము సిద్ధించినది. నా ప్రతిజ్ఞ సఫలమైనది. నా కర్తవ్యము నెరవేరినది. నీవు స్వతంత్రభారత సామ్రాజ్యమున కేకచ్ఛత్రాధిపతివైతివి." ఆర్య చాణక్యుల నేత్రములలో ఆనందదీప్తి తొణికిసలాడెను.

"చంద్రగుప్త చక్రవర్తీ! ఇక నే నీ లౌకిక వ్యాపారములనుండి విశ్రాంతిగొని తపోవనముల కేగఁదలచితిని."

ఆర్య చాణక్యుల గంభీర వాణిలో నాయన దృఢనిశ్చయము ద్యోతక మయ్యెను.

చంద్రగుప్త చక్రవర్తి చాణక్య గురుదేవులకు భక్తి పూర్వకముగా నభివాదముచేసెను. గురుదేవుడు చిఱునవ్వుతో చేయెత్తి తన ప్రియశిష్యుని ప్రేమపూర్వకముగా నాశీర్వదించెను,

"సుఖీభవ! చంద్రగుప్త చక్రవర్తీ! సుఖీభవ!"

సమాప్తము.

*రచయితను గురించి....*



జంధ్యాల లక్ష్మీనారాయణశాస్త్రి,
ఎం. ఏ.,

జననం : అస్తమయం :
1-7-1933 21-7-'72

స్వగ్రామం :
బాపట్ల తాలూకా, కొమ్మూరు

జననీ జనకులు :
కృష్ణవేణమ్మ, మల్లయ్య.

విద్యాభ్యాసం : హైస్కూలు విద్య - పెదనందిపాడు. తెలుగు ప్రధాన పాఠ్యాంశంగా బి.ఏ., వరకు ఆంధ్ర క్రైస్తవకళాశాల, 1955 లో హిందీ ప్రధాన పాఠ్యాంశంగా బి.ఏ., 1955 లో ఆంధ్ర విశ్వకళా పరిషత్తులో ఎం.ఏ., పట్ట స్వీకారము.

కవితా గురువు : బాబాయిగారు "కరుణశ్రీ" జంధ్యాల పాపయ్యశాస్త్రిగారు

అధ్యాపకత్వము : గుంటూరు ఆంధ్ర క్రైస్తవ కళాశాలలో మూడు సంవత్సరాలు; చీరాల వి.ఆర్.ఎస్. కళాశాలలో ఒక సంవత్సరం; శ్రీకాకుళం ప్రభుత్వ కళాశాలలో ఒక సంవత్సరం; అనంతపురం ప్రభుత్వ కళాశాలలో ఆరు సంవత్సరాలు; నెల్లూరు డి.కె. మహిళా కళాశాలలో ఒక సంవత్సరం; కందుకూరు ప్రభుత్వ కళాశాలలో ఆంధ్రశాఖాధిపతిగా అయిదు సంవత్సరాలు.

రచనలు : వైజయంతి - ఖండకావ్య సంపుటి; ప్రతిమా నాటకం - భాసకృతికి భావానుకృతి; సులోచన - పౌరాణిక నాటకం; చంద్రగుప్త విజయం - చారిత్రకమైన నవల; లాల్‌బహదూర్ శాస్త్రి - జీవిత చరిత్ర. అముద్రితములు : జయభారతి ఖండకావ్య సంపుటి; ఆది కవి - కావ్యం.